# సేవాశ్రమం

## ద్వితీయ భాగము


శ్రీమతి దామెర్ల భ్రమరాంబ

శ్రీమతి కొండ విజయలక్ష్మీబాయి





సరస్వతీగ్రంథమండలి

రాజమహేంద్రవరము

నిజామురాష్ట్రమం దుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రాబాదు నెం 544/566 రు గృహమందు నాంపల్లి గౌరీశంకరవర్మ అండుకో, ఆంధ్ర బుక్కుడిపోవారిని మా ప్రతినిధులుగా ఏర్పరచినాము. కావున నిజామురాష్ట్రవాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుఁడు.

# విజ్ఞప్తి

"సేవాశ్రమము" అను నీనవల, సుప్రసిద్ధ హిందీనవలారచయి తలగు శ్రీయుత ప్రేమచంద్‌గారి "సేవాసదనము" అను నవల కను వాదము.

సేవాసదనమును తెనుగులో ననువదించుటకు దయతో మా కనుమతి నిచ్చిన శ్రీ ప్రేమచంద్‌గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

మరియు నీనవల ననువదించుటలో మాకు ప్రోత్సాహ మొసర్చిన శ్రీయుత మరువాడ ఆంజనేయులుగారికిని, కల్లికోట కళాశాల ఆంధ్రోపాధ్యాయులగు కావ్యతీర్థ శ్రీ నేమాని నరసింహ శాస్త్రిగారికిని, మా కృతజ్ఞతాపూర్వకవందనములు.

ఇట్లు
విధేయురాండ్రు,
వామెర్ల భ్రమరాంబ
కొండ విజయలక్ష్మీబాయి

# పీఠిక

శ్రీమతి దామెర్ల భ్రమరాంబగారును, శ్రీమతి కొండ విజయలక్ష్మీబాయిగారును హిందీభాషనుండి తా మాంధ్రీకరించిన 'సేవాశ్రమ' మను నవలకుఁ బీఠిక వ్రాయుమని నన్నుఁ గోరిరి. ఇట్లు కోరుట నన్ను మిక్కిలి గౌరవించుట యని నేను భావించెదను. ఏలయన, నిట్టి గ్రంథములకుఁ బీఠికలు వ్రాయువా రాంధ్రదేశమున ననేకులు గలరు. స్వల్పప్రయత్నముతో ననేకులు లభించుచుండఁగా దూరమున నున్న నన్నీపనియందు నియోగించుట నాభాగ్య మని చెప్పక తప్పదు. ఇట్లు వారు కోరుటకు నాయందుఁ గల గుణవిశేషము కారణము గాదు. వారికి నాయందుఁ గల పక్షపాతమే ముఖ్యకారణము. ఈ పక్షపాతమునకు హేతువు లేకపోలేదు. రాజమహేంద్రవరములో దామెర్లవారి కుటుంబమునకును, నాకును రమారమి 45 సంవత్సరముల నుండి యత్యంతమైత్రి గలదు. వారికుటుంబమునకుఁ జిరపరిచితుఁడ నగుటచేత శ్రీయుత భ్రమరాంబగారును, నామెతోడి సఖ్యసంబంధములచేత విజయలక్ష్మీబాయిగారును నా కీగౌరవము గలిగించిరి. ఇదివఱకు నేను గొందఱుమిత్రుల గ్రంథములకుఁ బీఠికలు వ్రాసి యిచ్చితిఁగాని, యీపీఠిక వ్రాయునప్పుడు గలిగిన యానందము నా కీవఱకెన్నఁడుఁ గలుగలేదు. తత్కారణ మిది. ఆంధ్రదేశనారీమణులు పురుషులవలెనే నవీనపద్ధతులమీఁద నాంధ్రభాష నభ్యసించి, పాండిత్యము సంపాదించి, దేశోపకారకములై భాషౌన్నత్యము గలిగించునట్టి సద్గ్రంథముల వ్రాయునట్టి మహాపర్వదినము లెప్పుడు వచ్చునా యని యాసుదినముల నిమిత్తమై నే నెదురుచూచుచుంటిని. ఈ ఈకోరికతోడనే నా గురువు లగు శ్రీ కందుకూరి వీరేశములింగము

పంతులుగారు గూడ స్త్రీవిద్యకు సమితప్రోత్సాహ మొసఁగిరి. ఆంధ్ర దేశమాత కడుపు చల్లఁగాఁ గొంతకాలమునుండి కవనమునందు, వచన రచనమునందుఁ బ్రౌఢతనముఁ జూపెడి నాఁడుబిడ్డలను గడుపు చల్లఁగాఁ గనుచున్నది. ఆయువతీమణుల గ్రంథము లాంధ్రజనమనో రంజకములై, వీనుల విందులై, కనుల పండువులై, హస్తాలంకారము లై గృహభూషణములై విరాజిల్లుచుండుట దేశముయొక్క యదృష్టము. ఈగ్రంథము స్త్రీరత్నములు రచియించిన దగుటచేతను, నా స్త్రీరత్నములు నాకుటుంబములోనివంటివారే యగుటచేతను, నా చిర కాల మనోరథమును సిద్ధి నొందించినవారిలో వీరునుఁ జేరుటచేతను, నే నీపీఠిక సంతోషపూర్వకముగా వ్రాసితిని.

ఈనవల యాంధ్రీకరణ మైనను రసపుష్టి గలిగి, స్వకపోల కల్పితమైన గ్రంథమువలెనే హృదయంగమమై యున్నది. శైలియు మనో హరముగా నున్నది. 'పురంధ్రీణాం చేతః కుసుమసుకుమారం హి భవతి' అని భవభూతి చెప్పియున్నాఁడు. స్త్రీల మనస్సులు పూవులు వలె మెత్తని వని దీనియర్థము. వారి హృదయములవలెనే వారి మాటలును దేనెలో తేటలవలెఁ దియ్యనై యుండు టాశ్చర్యముగాదు. ఈ నవలయందలి మాటల పొందికలు మిక్కిలి యందములై మధుర ములై పాఠకమహాశయులకు నానందము గలిగించు ననుట యతి శయోక్తి గాదు. వీరు గ్రంథ మంతయు గ్రాంథికశైలినే వ్రాసిరి గాని, పలుతావుల సంధులు కలుపవలసినచోటఁ గలుపక, వాక్యమధ్యములం దచ్చు లచ్చులట్లె యుంచుట కేమికారణమో తెలియదు. రెండవ కూర్పునం దైన వారు సవరించిన మిక్కిలి బాగుండును. రసపూరితమై భావగర్భితమైన యీగ్రంథ మాంధ్రలోకమందలి పాఠకమహాశయు లకు సర్వవిధముల నానందకరమై యుండు నని తలంచెదను. ఈ కాంతామణు లిరువురు నింక నిట్టి గ్రంథము లనేకములు రచియించి

మాతృభాషాసేవయుఁ దన్మూలమున నాంధ్రభాషాసేవయుఁ జేసి, తోడి పడంతులకు మార్గదర్శినులై కృతకృత్యు లగుదురు గాక యనియు సర్వశ్రేయోదాయకుఁ డగు పరమేశ్వరుఁడు వీరి యుద్యమమును గొనసాగించుగాక యనియుఁ గోరుచున్నాను.

రాజమహేంద్రవరము,
29—2—33.

ఇట్లు,
చిలకమర్తి లక్ష్మీనరసింహము.



# ౧

కళ్యాణపురపు మ్యునిసిపాలిటీయందు పదునెనమండ్రు సభ్యులుకలరు. వీరిలో చదువుకొన్నవారి సంఖ్య ఎక్కువగా నుండుటవలన వేశ్యలను ఊరిబైటకు పంపివేయు తీర్మానము నెగ్గునని శర్మకు చాల నమ్మక ముగా నుండెను. ఆయన ఇదివరకే సభ్యుల నందరను కలసుకొని వారికీ తీర్మానము విషయమై నచ్చచెప్పి వారి సంశయముల నన్నిటిని దీర్చెను. కాని ఈ సభ్యులయందు తనకు వ్యతిరిక్తులు గలరని ఆతడు భయపడుచుండెను. ఈ వ్యతిరేకులు గొప్ప వ్యాపారస్థులు, ధనవం తులు పలుకుబడి కలవారు. అందువలన వారు మిగిలిన సభ్యులను కూడ తమవైపున కెక్కడ త్రిప్పుకొందురో యని శర్మ భీతిల్లు చుండెను హిందూసభ్యులయందీ విరోధిపక్షమునకు బలభద్రరావు నాయుడు నాయకుడు. మ్యునిసిపాలిటీయందు నలుగురు మహమ్మ దీయ సభ్యులు కూడ కలగు. వీరికి హాజీహస్సేను నాయకుడు. ఈ విషయమై నారాయణదాసు పనిచేయుచున్నంతవరకు వీ రెవ్వరును ధకలు పుచ్చుకొనలేదు. కాని శర్మయు మరికొందరు మ్యునిసిపల్ సభ్యులును ఈ యుద్యమమునందు చేరగనె ఉద్యమము విరోధులకు కంటకముగా నుండెను. ఈ విషయమైన తీర్మానము త్వరగానే వచ్చునని తలచి ప్రతి పక్షులు తమ పక్షమును బలపరుచుకొను ప్రయత్నములో నుండిరి. ఒకనాడు హాజీసాహేబు ఈ విషయమై మాట్లాడుటకు మిగిలిన ముగ్గురు సభ్యులను కలసుకొనెను. హాజీ సాహేబునకు చాల పలుకుబడి కలదు. ఆతడు వారి సంఘమునకు నాయకుడు. మౌలానా తేగాలి పెద్దమసీదునకు ధర్మకర్త. న్యాయ ధర్మములు కలవాడు. మునిషీఅబ్దుల్‌వఫా ధాన్యపుమరలకు నూని

మరలకు యజమాని. పెద్దపెద్ద షాపులు కూడ కలవు. హాకీమ్ శహారత్ ఖాను సుప్రసిద్ధవైద్యుడు. ఈతని మనస్సు చాల ఉదారమై నది. మంచి ఆలోచనకలవాడు.

హాజీ—మ్యునిసిపాలిటీలో నొక క్రొత్త తీర్మానమును పెట్టబోవు చున్నారు. విన్నారా? వీరికి మంచి విషయమే దొరకినది. పిచుక పైని బ్రహ్మాస్త్రము వేసిన ట్లున్నది. ఈ విషయమై మనము చాల పనిచేయవలెను. హిందువులు వారి వేదములందు వేశ్యల కనుకూల ముగ అనేక ఉదాహరణలను జూపగలరు. కనుక అటువంటివారిని జేరదీసిన మన పక్షము బలమగును!

అబ్దు. వ—చెడ్డవారిని శిక్షించుటకు మంచివారిని రక్షించుటకు మన మెవ్వరము? అది అల్లాపని. ఈ తీర్మానము చాల అన్యాయము గ నున్నది. మనము ప్రయత్నముచేసి వీరిని ఏలాగైనను ఓడించి వేయవలెను.

హా. శ—ఈ తీర్మానము నాకు చాల సమ్మతముగ నున్నది. నిజముగ నాకే అధికారమున్న ఈ వేశ్యలను హిందూదేశమునుండే తగిలివేయుదును. నిశ్చయముగ వీరు సంఘమునకు వేరుపురుగుల వంటివారు. కలరామనుష్యులను రెండుగంటలలో జంపును. ప్లేగు రెండు రోజులలో జంపును. కాని వీరు మనుష్యులను పీల్చి, పీల్చి పిప్పిచేసి మరీ చంపుదురు. మున్షీఅబ్దుల్‌వఫాగారు, వేశ్యలు సంఘ మునకు అలంకారమువంటివారని తలచుచున్నారు. కాని నిజముగ వీరు కాలసర్పములవంటివారని నా యుద్దేశము. వారి చూపుల యందును, మాటలయందును కూడ విష మున్నది. ఎంతమంది కుల స్త్రీలు వీరివలన నాశనమగుచున్నారు? ఎంతమంది జమీందా రులు వీరివలన ఫకీరు లగుచున్నారు! ఈ వేశ్యలలో కొందరు మన వారు కూడ నున్నారని చెప్పుటకు చాల విచారముగా నున్నది.

మౌ-తే.—ఆ వేశ్యలు తాము ముసల్‌మానులమని చెప్పుకొనుట తప్పు కాదు కాని ఇస్లాము వారిని మంచిమార్గములోనికి దెచ్చుటకు ప్రయత్నించకపోవుట విచారకరము. ఏ కారణము వలననైనను నొక స్త్రీ చెడువాడుక పడిన ఇస్లాము వారిని ఎన్నటికిని క్షమించదు. మనలో మహానుభావులు కొందరు వారిని చేరదీసి డబ్బు పెట్టుచుండుటవలన వారు మత్తెక్కి తమంతవారు లేరని విఱ్ఱవీగుచున్నారు. వీరు డబ్బిచ్చి అట్టివారిని చేరదీయుచుయెడల వారికి మత్తుదిగి, తమదుర్దశకు తాము చేసిన పాపములకు దుఃఖింపకమానరు. కాని ఎంత పశ్చాత్తాపపడిన ఏమి లాభము? తిరిగి వారిపిల్లలను వేశ్యలనుజేసి వారివలన తమజీవనోపాధిని కల్పించుకొనుట తప్ప వారికి వేరుమార్గములేదు. ఈ విధముగ అంతులేకుండ ఎప్పటికినీ ఆ లాగున జరుగుచునే యుండును. కాని ఆ పిల్లలకే సంసారులకువలె పెండ్లిండ్లుచేసిన ఈ చెడువృత్తి అక్కడితో నశించి దేశము బాగుపడగలదు. ఇతరప్రయత్నము లెన్ని చేసినను ఏమియు, లాభములేదు.

హాజీ.—దయచేసి బాగుగ నాలోచించి మాట్లాడండి. అది ఎన్నటికిని జరుగని పని.

ఈ విధముగ ఎవరికి తోచినట్లు వారు మాట్లాడిరి. అప్పటికప్పుడే అర్ధరాత్రి యయ్యెను. అక్కడితో ఎవరియిండ్లకు వారు వెళ్ళిపోయిరి. ఈ చర్చవలన విశేషలాభ మేమియు కలుగలేదు. వారు తమమనస్సునందే పక్షము ను ఆమోదించుటకు స్థిరపరచుకొని వచ్చిరో ఆ పక్షమునే అవలంబించి మాట్లాడిరి. ఇదివరకు హాజీసాహెబునకు వారందరు తనపక్షమునే చేరెదరని నమ్మకముగా నుండెను కాని ఇప్పుడా విశ్వాసము పోయెను.

ఈ ప్రస్తావనకు విరోధులైన హిందూసభ్యులు ముసల్‌మానులీ విషయమై చర్చించుచున్నారని విని దాని పర్యవసానమును వినుటకు

చెవులు నిక్కపొడుచుకొని నిరీక్షించు చుండిరి. కాని వారికి ముసల్మానుల యాశ ఒక్కసారి నిరాశయయ్యెను. మిగిలిన సభ్యులందరు పదునలుగురు. భలభద్రరావు నాయుడు చైర్ మెన్, డాక్టర్ శ్యామలరావు వైస్ చైర్ మెన్, సుబ్బయ్యసెట్టి, నరసింహం శ్రేష్టి వ్యాపారస్థులలో పెద్దలు. కృష్ణశర్మ, బారిష్టర్ సివరామ్, సూర్యారావు, రామారావు వకీళ్లు. ప్రొఫెసర్ శంఖరరావు కాలేజీప్రిన్సిపాలు. భగవంతరావు కంట్రాక్టరు. రాజారామదేవు జమీందారుడు. ప్రభాకరరావు "దేశసేవ" పత్రికాసంపాదకుడు. వెంకటాచారి ఆయుర్ వేదవైద్యుడు. జేమ్సు వెంకటరావు ఇంగ్లీషు కంపెనీల ఏజెంటు. బలభద్రిరావు నాయుడు రిటైర్డు డిప్యూటీకలక్టరు. ఆ తనికి చాల భూవసతియు, వడ్డీవ్యాపారమును కలవు. సుబ్బయ్యసెట్టి కా పట్టణమునందు చాల బట్టలకొట్లును, వేరు శెనగ వ్యాపారమును కలవు. నరసింహం శ్రేష్టికి పెద్దబజారులో చాల మేడలును, వడ్డీవ్యాపారమును కలవు. ఈ ముగ్గురు మహానుభావులును, సూర్యారావును కృష్ణశర్మ తీర్మానమునకు వ్యతిరేకులు. ప్రభాకరరావు, శంఖరరావు, శివరామ్, రామారావు ఈ తీర్మానమునకు అనుకూలురు. శ్యామలరావు, రామదేవు, జేమ్సు వెంకటరావు ఏ పక్షమున చేరెదరో నిశ్చయములేదు. ఇరుపక్షముల వారును కూడ వీరిసహాయమును ఆశించు చుండిరి. ఇరుపక్షముల జయాపజయములును వీరియందే ఆధారపడియుండెను. వెంకటాచారి తాను ఏ పక్షమునను జేరనని స్పష్టముగా జెప్పివేసెను. భగవంతరావు సుబ్బయ్యసెట్టి ధనసహాయముపైని ఆధారపడియుండెను. గనుక ఆ తడు వారిపక్షములోని వాడే.

కృష్ణశర్మ పెండ్లినుండి ఇంకను తిరిగి రాలేదు. బలభద్రరావు నాయుడు తనపక్షమును బలవరచుకొనుట కిదియే మంచిసమయమని తలచి ఈ సభ్యుల నందర నొకనాడు తనఇంటికి ఆహ్వానించెను. దీని

ముఖ్యోద్దేశ్యము డాక్టర్, దేవప్రభృతులను తనవైపునకు త్రిప్పుకొనుట కే.

ప్రభాకరరావునకు ముసల్మానులన్న బద్ధవిరోధము. కనుక నీతీర్మానమునందు హిందూముసల్మానుల వివాదములకు సంబంధముకలదని చెప్పి, ఆతనిని తమవైపునకు త్రిప్పుకొనుటకు నాయుడు పక్షమువారు ప్రయత్నించుచుండిరి.

నర-శ్రే—మన ముసల్మాను సోదరులీ విషయమున చాల ఉదారతను జూపించుచున్నారు. కాని దీనియందొక గూఢమైన రహస్యమున్నది. "ఒక దెబ్బతో రెండుపనులు" అనుమార్గమును వారవలంబించి యున్నారు.

సు-సె—నాకు పోల్టిక్సు (రాజకీయవిషయములు) అన్న నిష్టము లేదు. అందువలననే నేనటువైపునకు వెళ్ళను. మ్యునిసిపాలిటీలో వడ్డీవ్యాపారము విషయమై ప్రస్తావన వచ్చినప్పుడు ప్రభాకరరావు దానికి వ్యతిరేకముగ పనిచేసెను. సూర్యారావు దానిగురించి వివరించి చెప్పుచు, ప్రస్తుత తీర్మానమునకును, అర్థిక విషయమునకును సంబంధము జూపుచు ప్రభాకరరావును తమ పక్షమునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించుచుండెను. ప్రభాకరరావు వికతాసుడై, "మీరునన్ను గందరగోళ స్థితిలో బెట్టుచున్నారు. నన్నుద్ధరించు భారము మీది" యని చెప్పుచున్నట్లు బారిష్టర్ సివరామ్‌వైపు జూచెను. శివరామ్ నిర్భయుడు. ఖరాఖండీ మనిషి. అతడు సుబ్బయ్యసెట్టి, సూర్యారావులవైపు జూచుచు మీరొక సంఘ విషయమును హిందూ ముసల్మానుల వివాదములలోనికి మార్చ జూచుట చాల విచారముగా నున్నది. వడ్డీ తీర్మానము వచ్చినప్పుడు కూడ నిటువంటి విభేదమునే కల్పించినారు. ఇటువంటి మతవిషయమును వివాదములలోనికి దింపుటవలన హిందూ సాహుకారులకు లాభ[illegible]ండ

వచ్చునేమో కాని ఇందువలన జాతికెంత హానికలుగునో చెప్ప నలవి కాదు. ఈ తీర్మాన మామోదింపబడినచో హిందూసాహుకారుల కధిక నష్టము కలుగవచ్చును. కాని ముసల్మానులకు కూడ దీని డక్కా తగులకమానదు. పెద్దబజారులోను హైకోర్టులోను కూడ ముసల్మానులకు చాల కొట్లున్నవి. విరోధములను ప్రతివాదముల వంకబెట్టి ముసల్మాను సోదరుల సందేహించుట చాల పొరబాటు. వారీ విషయమై చేసికొన్న నిశ్చితము నిజముగ సంఘలాభము కొరకే. కాని దీనివలన హిందువులకు ఎక్కువ హానికలిగిన అది వేరు సంగతి. ఇందువలన ముసల్మానుల కెక్కువ నష్టము కలిగినను వారి నిశ్చితాభిప్రాయమును మార్చుకొనరని నేను నమ్మెదను. ఈ తీర్మానము సాంఘిక దురాచారములను తొలగించుటకే పెట్టబడినదని మీరు ఉదార హృదయముతో ఆలోచించిన ఎడల దీని నామోదించుటయందు మీ కేమియు అభ్యంతర ముండకూడదు. ఎంత ధననష్టమైనను వప్పుకొనవలెను. సదాచరణకంటె ధన మెక్కువ కాదు.

ప్రభా—(ధైర్యము తెచ్చుకొని) నేనును ఈవిషయమునే చెప్పదలచుచున్నాను. కొద్ది ధననష్టముతో నొక దురాచారము తొలగిన ఆ నష్టమును మనము సంతోషముతో భరింపవలసినదే. దేశ దుస్థితిని బాపుటకు ఎందరు దేశాభిమానులు తమ సౌఖ్యములను, ధనార్జనను విడిచిపెట్టి దేశసేవకు లగుటలేదు ?

రా-దే—(ప్రభాకరరావువైపు జూచుచు) రావుగారు! మీరు మీ పత్రికా సంపాదకత్వములోనే మునిగిపోవుచున్నారు. మీరు మీ జీవితమును ఆనందముగా గడపుటకు సమయమెక్కడ? కాని మావంటి వారికి ఉబుసుపోవుటకు ఏదైనను ఒకమార్గ ముండవద్దా? సాయంత్రము టెన్నిసు ఆటతో గడచి పోవును. ఎండవేళ పండుకొనుట యందును, ప్రొద్దుట ఆఫీసరులను కలసుకొనుట యందును

గుఱ్ఱపుస్వారీ చేయుటయందును కాలయాపన మగును. కాని రాత్రి పది గంటలవరకు కాలము గడుపుట యెట్లు? మీరిప్పుడు వేశ్యలను పట్టణమునుండి వెలుపలకు పంపివేయ వలసినదని తీర్మానమును పెట్ట బోవుచున్నారు. రేపు మ్యునిసిపాలిటీ సరిహద్దులలో, వారి యను మతి లేనిదే మేళములు, పాటకచ్చేరీలు జరిపించ కూడదని తీర్మా నము పెట్టిన మావంటివారి జీవితమే దుర్భరమై పోవును.

ప్రభా—(నవ్వుచు) టెన్నిసు, సంగీతసభలు నాట్యములు తప్ప, కాలక్షేపమగుటకు మీకు మరియొక యుపాయములేదా? కొంత సేపు గ్రంథపఠనయందు కాలము గడుప కూడదా?

గా. దే—చదువు మావంటివారికి నచ్చదు. పుస్తకములలోని పురుగు లగుటకు మాకిష్టములేదు. జీవితసాఫల్యమునకే విషయ ములు జరుగునో వాటిగురించి మేమిప్పుడే తెలిసికొన్నాము. ఫ్రాన్సు, స్పెయిను దేశములయొక్క నాట్యములను మేమెరుగుదుము. మీరు వాటిపేరులనైనను విని యుండరు. నేను పియానొమీద రాగాలాపన చేసిన దొరలుకూడ సిగ్గుపడవలసినదే. ఇంగ్లీషు పద్ధతులు నాగరికతలు గురించి మాకు బాగుగ తెలియును. సోలాహ్యాట్ ఎప్పుడు పెట్టు కొనవలెనో, చత్రా నెప్పుడు చుట్టుకొనవలెనో నాకు బాగుగ తెలి యును. మేము పుస్తకములనుకూడ అప్పుడప్పుడు చదువుచుందుము. మాగదియందు ఎన్ని బీరువాలతో పుస్తకములున్నవో మీరు జూచిన తెలియగలదు. కాని మేమా పుస్తకముల కంటుకొనిపోము. ఈప్రస్తావనల బాధ్య మాప్రాణములు పోవుచున్నవి.

దేవుయొక్క హాస్యమర్మోక్తులను, ఇరుపక్షములవారును కుతూ హలముతో వినుచుండిరి.

డా. శ్యా—(దేవువైపు జూచుచు) నేనీ విషయమై లెజిస్లేటివు కౌన్సిలునందు ప్రశ్నలను వేయబోవుచున్నాను. దానికి గవర్నమెంటు

తగిన సమాధాన మిచ్చువరకు నాయుద్దేశమును ప్రకటింప జాలను.

ప్రొ. శే—మీప్రశ్నలకు గవర్నమెంటు జవాబు చెప్పకపోయిన?

డా. శ్యా—జవాబుల నిచ్చినను, ఇవ్వకపోయినను ప్రశ్నలు వేయుట మనవిధి. ఇంతకన్న మనమేమి చేయగలము?

బలభద్రరావునాయుడి కిప్పుడు తనపక్షము గెలుపొందునను నమ్మకము బాగుగ నుండెను. డాక్టరుకాక మిగిలిన పదిహేడుగురు సభ్యులలో తొమ్మండుగురు తమపక్షమునకే ఓటు చేయునట్లుండెను. అందువలన తాను ఛైర్ మెన్ విధిప్రకారము తటస్థముగా నుండవచ్చునని ఆతడు తలచెను. ఆతడీ ప్రస్తావనను తర్కించుచు ఇట్లు గంభీరోపన్యాసము గావించెను.

"సాంఘిక విప్లవమునందు నాకు విశ్వాసములేదు. సంఘమునం దవసరములైన మార్పులను మనయంతట మనము జేసికొనుటయే యుత్తమమని నాఅభిప్రాయము. విదేశయాత్ర, జాతిభేదము, భోజన పానాదుల యందనవసరపు కట్టుబాట్లు మొదలగు నివియన్నియు సమయానుసారముగా మారుచునే యుండును. ఈవిషయమై సమాజమును స్వేచ్ఛగా వదలిపెట్టవలెనని నాఅభిప్రాయము. ప్రజలందరు ఏకగ్రీవముతో వేశ్యలు నగరమధ్యమున నుండుట కొప్పుకొనని యెడల ప్రపంచమునందేవ్యక్తి దానినడ్డుపెట్టగలడు?"

(నాయుడు భావపూర్ణమైన స్వరముతో) "మనకుత్తమ సంగీత శాస్త్రమున్నదని గర్వము కలదు. ఇటలీ, ఫ్రాన్సుదేశములయొక్క సంగీతశాస్త్రమునందు ప్రవీణత గలవారుకూడ భారతీయగానము నందే ఎక్కువ భావము, రసము, ఆనందము, శాంతి మొదలైనవి కలవని స్థిరపరచినారు. కాని కాలగతి ఎట్లున్నది? దేనిమూలమును త్రవ్వినసంఘమునందు కొద్దిగా సంస్కరణ జరుగునని తలంచుచున్నారో అట్టి సంగీత సంస్థ, పవిత్ర స్వర్గీయధనమునకు అగ్రస్థా

నము వహించియున్నది. ఏమీ ? మీరీసంస్థను నాశమొనరించి మీపూర్వులార్జించిన యీ అమూల్యధనమును నేలపాలొనర్చె దరా ? నేను మనయందు నిలచియున్న జాతీయ, ధార్మిక భావములయొక్క కీర్తి ఈసంగీతమునుండియే కలుగుచున్నదని మీరెరుగరా ? అట్లు కానియెడల నేడు రామకృష్ణ శివులయొక్క నామములనైనను మీరెవ్వరెరిగి యుండరే. మనహృదయములనుండి జాతీయ భావములను తొలగించుటకు మనపరమ శత్రువు సహితము ఇంతకన్న మంచిసాధనమును ఉపయోగించ జాలడు. వేశ్యలవలన సంఘమునకు హాని కలుగుటలేదని నేను చెప్పను. ఏమాత్రము తెలిసినవాడైనను ఇట్లు చెప్పుటకు సాహసింపడు. రోగనివారణ మందువలన యగును గాని చావు వలనకాదు. దురాచారములు ఉపేక్షోసిద్ధయుల వలన తొలగ జాలవు. దయాజ్ఞాన ప్రబోధముల వలన అవినశించును. స్వర్గమును జేరుటకు తిన్ననైన మార్గములేదు. మధ్య వైతరిణీ నదిని దాటకతప్పదు. మహాత్ముల ఆశీర్వాదముల వలన స్వర్గమున కెగిరి పోవచ్చుననుట ఎంత హాస్యాస్పదమో, వేశ్యలను పట్టణములనుండి తొలగించుటవలన భారతదేశముయొక్క దుఃఖదారిద్రములు తొలగి అది స్వర్గతుల్యమగు ననుటయు నంతహాస్యాస్పదమే.''

౨

గట్టిగా తట్టి లేపుటవలన, సోమరి నిద్రనుండి మేల్కొని ఇటు నటు జూచి ఎట్లు నిద్రపోవునో ఆప్రకారమే కోపవిచారములు చల్లారగనే నరసింహారావు తన కర్తవ్యమును మరచిపోయెను. అతడు తనలో, "నే నిక్కడ నుండుటవలన రామనాథమున కేమంత ఎక్కువకష్టము?

నేను తినున దగ్గనేరు బియ్యమే కదా." యని అనుకొనెను. కాని ఆరోజునుండియు అతడు నీచసహవాసమును మాత్రము మానుకొనెను. ఈపాటి మాటకు నూరు విడచిపోవుట నవసరమని అతడు తలచెను. ఇప్పు డాత డెల్లప్పుడును వీధియరగుపైని కూర్చుని దారివెంట వచ్చిపోవు స్త్రీలను పరికించి చూచుచుండును. రామనాథముయొక్క ప్రతి వాక్యమునకును తల నూపుచుండును. భోజనము చేయునప్పు డెంత వడ్డించిన నంతయె తినును గాని మా రడుగుటలేదు.

సుశీలయొక్క వివాహవిషయమై రామనాథ మే సలహా నడిగినను అతడు సరళభావముతో, "మాకు మీరే సర్వమును. మీ కెట్లు తోచిన నట్లే చేయండి." యని జవాబు చెప్పుచుండును. డబ్బు తెచ్చువా డతడే గనుక అంతయు అతని ఇష్టానుసారమే జరుగవలెనని నరసింహారావు తన మనస్సును సమాధానపరచుకొనుచుండెను.

కాని రామనాథము తన బావమరదియొక్క కఠినపుమాటలను మరచిపోలేదు. గాయముమీద వెన్న వేసిన అప్పటికి బాధ శాంతించినను తిరిగి కొంతసేపటికే బాధ ప్రారంభమగును. నరసింహారావుయొక్క పశ్చాత్తాపవచనములు రామనాథమునకు వెంటనే మరపునకు వచ్చెను గాని అతని కృతఘ్నపుమాట లాతని చెవులయందు ప్రతిధ్వనించుచునే యుండెను. ఆతడు నిద్రింప బోవుచుండగా కామేశ్వరమ్మ ఆతనితో, "నరసింహారావుగారు ఇందాక మీతో ఎందుకు దెబ్బలాడుచున్నారు." అని అడిగెను.

రామ—(విచారముతో జూచుచు) నా కీర్తిని కొనియాడుచున్నారు. 'నీవే నా నాశనమునకు కారకుడవనియు, నాభార్యను బలవంతముగ చంపివేసితివనియు, ఒక పిల్లను నూతిలో ద్రోసితివనియు, రెండవపిల్లను బాధించుచున్నావనియు' నానామాటలు నాడినాడు.

కామే.—ఏమీ! మీనోట్లో నాలుక లేదా? ఇంటింటికి పోయి ముష్టి అడుక్కోకుండా వారిని చేరదీసి, నానాబాధలు పడి పోషించు చున్నందు కిదా ఫలము? ఇన్నిరోజులు ఇనిస్పెక్టరీ జేసినప్పటికి మా వదిన నక కుంకుమభరిణ యైనను నాకు పంపలేదు. నాకగ్గరే యీ మాటలంటె నోరు పిగలకుండ జబాబు చెప్పియుందును. చెట్టంతేసి పిల్లలను మీంద కూర్చోబెట్టి ఇంకా సిగ్గులేక మాట్లాడడంకూడాను. వీళ్ళవల్లే, సుభ్రముగా ఫకీరులమైపోయినాము. ఇప్పుడు మా కొచ్చిన కీర్తియిది. ఇప్పుడేనా ఎక్కడకైనను పోకూడదా? ఇక్కడెందుకు పీఠం వేసుకొని కూర్చోడం?

రా-నా.—ఇప్పుడు వెళ్ళిపోతాననే అంటున్నాడు. అందుకొరకే కమల పై విలాసము నడిగినాడు.

కామే.—ఐతే ఆక కూతురి నెత్తిమీద కూర్చుంటాడు కాబోలు? అయ్యో చేతకానివాడా!

రా-నా.—లేదు. ఎందుకలా చేస్తాడు? నాలుగైదురోజు లుంటాడు.

కామే.—అవెక్కడి మాటలు? ఇప్పుడత డేపని చెయ్యలేడు. వెళ్ళి వాళ్ళ నెత్తిమీద సవారీ ఔతాడు. కాని వక్కరోజేనా అక్కడ నిర్వహింపగలడేమో చూదాం ఇప్పటివరకు రామనాధము ఆమెతో కమల సంగతి జెప్పలేదు. స్త్రీలవద్ద ఏసంగతియు దాగదనియు, నీసంగతి నామెతో చెప్పిన తప్పక నలుగురికీ తెలిసిపోవుననియు ఆతని భయము. కామేశ్వరమ్మ ప్రేమతో మాట్లాడినప్పుడు ప్రసన్నుడై అన్నికష్టసుఖములతోపాటు కమల సంగతిని గూడ చెప్పుటకు సిద్ధపడుచుండును. కాని పర్యవసానమును తలచి వెనుకకు తగ్గుచుండును. కాని ఈరోజున నరసింహారావుయొక్క కృతఘ్నత, కామేశ్వరమ్మ యొక్క స్నేహవచనములు, రామనాధము శంకలను తీర్చివేసెను.

మనస్సునందు మరి, రహస్యము దాగినది కాదు. కాలువయందు నిలచిన వస్తువు నీటిప్రవాహమువలన పై కెట్లు కొట్టుకొని వచ్చునో ఆవిధముగ నతడు కమల సంగతంతయు కామేశ్వరమ్మతో జెప్పి వేసెను. ఆతనికి అర్ధరాత్రప్పుడు మెళకువ రాగానె తాను జేసిన తప్పు స్ఫురించెను. కాని నోరు జారిపోయినది. కామేశ్వరమ్మ ఈ సంగతి నెవ్వరితోను జెప్పనని ఖరారుజేసెను. కాని ఆమె గుండెలలో పెద్దబరువువలె నుండెను. ఏపని చేయుటకు ఆమెకు తోచుటలేదు. ఇంతవరకు సంగతి తనతో జెప్పక దాచెనని మగనిపై మనస్సులో చికాకుపడుచుండెను. ఆమెకు కమలపై అసహ్యముగాని, కోపము గాని, సానుభూతిగాని, లేదు కాని కేవల మొక వింతసంగతిని జెప్పు టకు మానవహృదయముయొక్క దుర్బలతను జర్చించుటకు సమ యము దొరకినది. విద్యవలన స్త్రీ చెడిపోయినదని చెప్పుట కెంత మంచి ప్రమాణము దొరకినది? ఆమె ఈ సంతోషమును తన మనస్సు నందు ఎక్కువరోజులు ఇముడ్చుకొనలేకపోయినది. ఇది అసంభవము. ఐనప్పటికి ఎట్లో ఆమె మనస్సును బిగపట్టుకొనెను. ఒకరోజున పాపయ్యసిద్ధాంతి భార్య కనకమ్మ వీరింటికి వచ్చి కామేశ్వరమ్మతో, "అక్కా! ఈరోజున ఏకాదసికదా? గోదావరిస్నానమునకు వచ్చె దవా?" యని అడిగెను. కామేశ్వరమ్మకు కనకమ్మకు చాల స్నేహము.

కామే—రావలెననే ఉన్నది. మా గుమ్మములో ఒక ఎమదూత దావరించినాడు. అతనినుండి ఎక్కడకు వెళ్లడానికి వీలులేకుండా యున్నది.

కన—అక్కా? ఇతని సంగతి నీతో ఏం చెప్పను. చెప్పుకోడానికి సిగ్గు. మా మొగవాళ్లే వింటే బుఱ్ఱ బద్దలకొట్టేవాళ్ళే. నిన్న మా పెద్దపిల్లవద్ద ఏం కూనిరాగాలు తీశాడో ఈవాళ ప్రొద్దుటే వాళ్ళిద్దరు

నవ్వుతూ మాట్లాడుతూ ఉండగా చూశాను. అక్కా! నీదగ్గర దాపరిక మెందుకు? ఏమైనా కొంప మునుగుతే గంగలో దిగవలసిన దే. ఇతని కొచ్చిన ఏళ్లెవరికి వచ్చాయి? కొంచమైనా సిగ్గు లజ్జా లేదు. మాపిల్ల మీ కమలకన్న ఒకటి రెండేండ్లేకదా పెద్ద. తన కూతురి లాంటిదానితో ఆలా హాస్యాలాడవచ్చునా? ఆతని కామాత్రమేనా బుద్ధి ఉండవద్దూ? సిద్ధాంతిగారు వింటే ఆతని నెత్తురు కళ్ళచూడందే విడిచిపెట్టరు. నీతో కనక చెప్పుతున్నాను. అతనిని చాటుగా పిలచి నాలుగు చీవాట్లు పెట్టి బోధపరచి చెప్పు.

ఇక కామేశ్వరమ్మ నిలువలేకపోయినది. ఆమె కమల సంగతంతయు వన్నెలు చిన్నెలు పెట్టి కనకమ్మతో చెప్పివేసెను. ఇతరులు మనతో తమ రహస్యములను చెప్పినప్పుడు మనము కూడ వారివద్ద ఏరహస్యమును దాపజాలము.

మరునాడు పాపయ్యసిద్ధాంతి తన కొమార్తెను అత్తవారింటికి పంపివేసి, నరసింహారావుపై తన కసిని ఏలాగైనను తీర్చుకొనుటకు నిశ్చయించెను.

## 3

మోహనుని వివాహమూ మరునాడే. విష్ణువర్ధనమునుండి పెండ్లివారు వైభవముతో రామవరమునకు తరలివెళ్ళిరి. విష్ణువర్ధనమునుండి రామవరమునకు పదిక్రోసుల దూరము కలదు. మధ్య గోదావరి దాటవలెను. పెండ్లివా రందరును పడవలపై నెక్కిరి. కాని పడవవారితో బేర మెంతకును కుదిరినది కాదు. గోపాలశాస్త్రి వారిమీద చికాకు పడుచు కేకలు వేయసాగెను. కృష్ణశర్మ ఆ దరిద్రపు పడవవారిని

జూచి జాలిపడి వారికి లాభముగా నుండునట్లు బేరమును కుదిర్చి అన్నగారిని సమాధానపరచెను. ఈ పెండ్లివారందరును రామవరము చేరుసరికి మధ్యాహ్నమైనది. శాస్త్రిగారి గుమాస్తా లదివరకే వెళ్ళి విడిదిలో నన్ని సదుపాయములుచేసి పందిళ్ళు పాకలు వేయించి సిద్ధముగా నుండిరి. ఈ సరంజామంతయు జూచి పెండ్లివారు మేళములు మొదలైనవాటితో గొప్పగా తరలివచ్చుచున్నారని యూరిలో పెద్ద పుకారుగా నుండెను. ఆ రాత్రియే లగ్నము. పెండ్లివారు బ్యాండుమేళముతోను గ్యాసులైట్లుతోను చిత్రవిచిత్రములైన బాణాసంచాలతోను గొప్పగా ఊరేగి లగ్నమునకు వచ్చిరి. లాంఛనములన్నియు జరిగిన తర్వాత వధూవరులకు మంగళస్నానములు చేయించి పీటలమీద కూర్చుండబెట్టిరి. రామనాధము నడుమునకు అంగవస్త్రము బిగించుకొని యూపిరి తరగకుండ తిరుగుచు, పెండ్లివారిని, పెండ్లికి వచ్చిన యితర పెద్దమనుష్యులను మర్యాదచేసి పందిరిలో కూర్చుండబెట్టుచుండెను. స్త్రీలు మంగళగీతములను పాడుచుండిరి. పెండ్లిలో కొందరు యువకులు ఆ స్త్రీలలో నెవరు సౌందర్యవతులో యని ఓరజూపుల చూడసాగిరి. స్త్రీలు వారిలో వారు నవ్వుకొనుచు వచ్చిన వారిలో పెండ్లికొడుకున కేన రేటునంటి చుట్టములో వారిలో వారు చెప్పుకొనుచు గుసగుసలాడుచుండిరి. వీధిలో బ్యాండుమేళము వాగుచుండెను. పురోహితులు గొంతుకలు బొంగురుపోవునట్లు మంత్రములు చదువుచుండిరి. చిన్నపిల్లలు తమ యీడువారితో నాడుకొనుచు చేసిన పిండివంటలను తెచ్చుకొని తినుచు, పెద్దవాళ్ళ కాళ్ళలో పడుచు అల్లరి చేయుచుండిరి. నిద్రవేళయగుట వలన చంటిపిల్లలు తల్లులకొరకు కేడ్చుచుండిరి. ఈ విధముగా నొకరిమాట యొకరికి వినపడకుండ పెండ్లివారిల్లు అతి సందడిగా నుండెను.

కామేశ్వరమ్మ మాత్రము చిన్నబోయి విచారముగా నుండెను.

ఆమె తనలో "ఈ సంబంధము మా కాంతానికైన నెంత భాగుం డును?" అని యనుకొనుచుండెను. వారిలో వియ్యంకు డెవ్వడో తెలిసికొనుటకు కనకమ్మ ఆతృతపడుచుండెను. నరసింహారావు అల్లునకు కాళ్ళు కడుగుచుండెను. పళ్ళెములో నెన్ని రూపాయలున్నవో యని గోపలశాస్త్రి పరికించి చూచుచుండెను. పెరటిపందిరిలో బ్రాహ్మణులు గాడీలమీద వండుచుండిరి. పిల్లలు నౌకర్లు భోజనములు చేయుచుండిరి. గోపాలశాస్త్రి పెండ్లిపీట కెదురుగా ఠీవిగా కూర్చుని యుండెను. ఒకవైపు సుబ్బయ్యశాస్త్రిగారు వీణమీద కళ్యాణిరాగ మాలాపన జేయుచుండిరి. పెండ్లిపందిరియందు మనుష్యులు క్రిక్కిరిసి యుండిరి. సానిమేళ మింకను రాలేదేమని వారిలో వారు గుసగుసలాడుచుండిరి. ప్రతివారును వారి రాకకై ఆతృతపడుచుండిరి. చివరకు వారు నిరాశులై, "ఏమి దరిద్రపు పెళ్ళివారు? సానిమేళమైనను తీసికొనివచ్చుటకు గతిలేక పోయినది కాబోలు? వట్టి పిసినిగొట్టువాళ్ళలాగు కనబడుచున్నారు. ఇంత పంది రెందుకు వేసినట్లు? పేరు గొప్ప వూరు దిబ్బ అన్నట్లుంది వీరి సంగతి." అని ఆక్షేపణగా ఎవరికి తోచినట్లు వా రనసాగిరి. క్రమముగా నీమాటలు శాస్త్రి చెవులలో కూడ పడెను. ఆతడీ నిందను భరింపలేక తమ్మునిపై చిరాకుపడుచుండెను. శర్మ యీ నిందావాక్యములు విని అన్నగారి యెదుటపడుటకు భయపడుచుండెను.

ఇంతలో కొందరు పోకిరీవాళ్లు పందిరిపై రాళ్ళు రువ్వుటకు ప్రారంభించిరి. వైద్యనాథము నలుగురను తీసుకొని ఆ తుంటరులను బెదరించుటకు పరుగెత్తెను. ఆ పందిరిలో కొందరా తుంటరులను తిట్టసాగిరి. అటు పరుగెత్తువారు, ఇటు పరుగెత్తువారు కొట్టువారు తిట్టువారు కలిసి పందిరిలోనంతయు అతి గడబిడగా నుండెను.

ఇంతలో నకస్మాత్తుగా నొక దీర్ఘకాయుడు తలనిండ జడలతోను,

ఒంటినిండ భస్మముతోను, చేతియందు త్రిశూలముతోను సాక్షాత్ శివునివలె నక్కడ ప్రత్యక్షమయ్యెను. అతని కండ్లు మంటలవలె ప్రజ్వరిల్లుచుండెను. ముఖ మొక విధమైన తేజస్సుతో ప్రకాశించు చుండెను. ఈతని రాకవలన పందిరియంతయు నొక్కసారి నిశ్శబ్దమై పోయెను. అక్కడ నున్నవా రందరు నీమహాత్ము డెవ్వడో, ఎక్కడి నుండి వచ్చునో యని విస్మయపడసాగిరి.

సాధువు త్రిశూలమును పైకెత్తి తిరస్కారస్వరముతో "ఆహా! ఎంతవిచారకరము? సాని మేళము లేకపోవుటవలన నీ మహానుభావులం దరకు నిరుత్సాహముగా నున్నది కాబోలు? ఏమీ? కల్యాణిరాగము మీకు రుచించుట లేదా? ఒకరికిని చెవులున్నట్లు కనపడదు. అంద రూకూడ వేశ్యలకొరకే ఆతృతపడుచున్నారు. 'వేశ్యను చూపెదవా? బుజ్జపగుల కొట్టుకొనెదవా?' యన్నట్లున్నది మీ వైఖరి? పదండి. నేను నాట్యమును చూపెదను. దేవతానాట్యమును జూచెదరా! చూడండి చెట్లయాకులపై చంద్రకిరణము లెంతసొగసుగా నాట్యము చేయుచున్నవో? ఇటుచూడండి. చెరువులోని కమలములయందు నీటి బిందువు లెట్లు నాట్యము చేయుచున్నవో? అటుచూడండి. అడ వులయందు నెమళ్లు తమసొగసైన పింఛములను విప్పి యెంతఅంద ముగా నాట్యముచేయు జేయుచున్నవో? ఏమీ! ఈ దేవతానాట్య ము మీ కింపుగా లేదా? సరే. నడవండి. పిశాచములయొక్క నా ట్యము జూపెదను. మీ పొరుగున నున్న దరిద్రులగు రహితులు జమీందారులచేత చెప్పుదెబ్బలు తిని యెట్లు నాట్యమాడుచున్నారో? మీ దరిద్ర సోదరులయొక్క అనాధబాలులు ఆకలికి తాళజాలక ఎట్లు నాట్యమాడుచున్నారో? మీ యింటియందు చూడండి. మీ వితంతు సోదరీలయొక్క కండ్లయందు శోకముతో కూడిన నీటిబిం దువు లెట్లు నాట్యమాడుచున్నవో? ఈ నాట్యము జూచుటకు కూడ

మీా కిష్టములేదా? ఐతే మీా మనస్సు నొక్కసారి పరికించి చూడండి. కపటము, మోసము, దౌర్జన్యము యెట్లు నాట్యమాడుచున్నవో?

ఈ ప్రపంచమంతయు నృత్యశాలయే. దీనియందు మనుష్యులు వారి వారిస్థితికి తగిన నాట్యమాడుచున్నారు. ఏమీా, ఈ నాట్యము జూచుటకు మీాకు కండ్లులేవా? రండి శంకరునియొక్క తాండవనృత్యము జూపెదను. కాని, అయ్యో! ఆ నృత్యము జూచుటకు మీాకు యోగ్యతలేదే. మీా వంటి కామాతురుల కటువంటి నాట్యముజూచి యా నందించుట కదృష్టమెక్కడ? హా! మూర్తీభవించిన యజ్ఞానులారా! నాట్యము పేరెత్తుటకు మీాకు సిగ్గులేదా? మీారు బాగుపడ దలచిన యీా దురాచారములను రూపు మాపుడు. విషయవాంఛలను విడిచిపెట్టుడు. వేశ్యాప్రేమనుత్యజింపుడు. అని ఘోషించెను. అక్కడి వారందరు నిర్ఘాంతపోయి మహాత్మునియొక్క ఉన్మత్తవాక్యములను శ్రద్ధతో వినుచుండిరి. ఇంతలో ఆయోగి యదృశ్యుడయ్యెను. ఎదురుగా నున్నమామిడి తోపునుండి యింకను ఆ మధురగానము వినబడుచునే యుండెను. రాత్రియందు చింతారూపమైన నొక నిద్రాసాగరము నందెట్లు విలీనమై పోవునో ఆ విధముగానె క్రమక్రమముగా అంధకారమునందు ఆ గానము కూడ విలీనమై పోయెను. ఆ సాధువు యొక్క ఆ కస్మికాగమనము, ఆ తని తేజస్స్వరూపము, ఆయలౌకికోపదేశము ప్రజలలో నొకవిధమైన భయాందోళనలను కలిగించెను. పెండ్లికి వచ్చినవారిలో కొందరు నిష్కారణముగా నిక్కడకు వచ్చితిమని పశ్చాత్తాపపడుచు తమ తమయిండ్ల దారినిబట్టిరి. కొందరు సత్పురుషులామహాత్ముని వెనుక పరుగెత్తిరి. కాని యా తడు వారికెక్కడను కనుబడలేదు.

గోపాలశాస్త్రి పందిరిలో మధ్యను పెట్టె దగ్గర పెట్టుకొని కూర్చుండెను. గుమాస్తాలు లగ్నమునకు కావలసిన మధువర్కములు, పసుపు కుంకుమ పండ్లు మొదలైనవి పళ్ళెములలో సర్దుచుండిరి. శర్మ అన్న ప్రక్కనే కూర్చుండి ఆయన పురమాయించు పనుల గుమాస్తాలచే చేయించుచుండెను. శాస్త్రి పెండ్లికుమార్తెకు పెట్టు నగలను, దక్షిణాల కివ్వవలసిన సొమ్మును లెక్క జూచుచుండెను. ఇంతలో వైద్యనాథము గోపాలశాస్త్రివద్ద కొగుర్చుకొనుచు పరుగెత్తుకొని వచ్చి "అయ్యా! చాలా అనర్థము వచ్చినది. మనము తిన్నగా మంచిచెడ్డలు తెలుసుకొనకుండ యీ సంబంధమును కుదుర్చుకొంటిమి."

గోపా—(ఆతృతతో) ఏమి? ఏమి వచ్చినది? ఏమి టాఅనర్థము?

వైద్య—ఇప్పుడే ఈ గ్రామనివాసి యొకడు నన్ను కలుసుకొని వీరి గుట్టంతయు బయలుపెట్టినాడు. దానితో నామీాది ప్రాణములు మీాది కెగిరిపోయినవి.

గో-శా—ఏమిా? వీరిది మర్యాదావంశం కాదా?

వైద్య—వంశము మంచిదే. కాని వీరి సంగతంతయు చాల అనర్థముగా నున్నది. పెండ్లికుమార్తె తండ్రి మొన్ననే జెయిలునుండి వచ్చినాడట. ఆమె అక్క వేశ్యయై కళ్యాణపురపు బజారువీధిలో మేడ పుచ్చుకొనియున్నదట. పేరుపడ్డ వేశ్య కమలాబాయి, ఈపెండ్లికుమార్తెకు ఖాసా అక్కనట!

ఈమాటలు వినగానే గోపాలశాస్త్రికి మిన్ను విరిగి మీాద పడినట్లయ్యెను. అతడు తేరిపార జూచుచు, "ఈ సంగతులు చెప్పినవాడు వీరి విరోధి కాడుకద? కార్యములకు విఘాతములు కలిగించుట కిటు

వంటి అబద్ధములు, అపవాదములు కిట్టనివారు పుట్టించుచుండుట మామూలు సుమండీ!"

శర్మ—ఔను. ఆలాగే ఐవుంటుంది.

వైద్య—ఈ చెప్పిన యాతడు వీరి ముఖముముందే యీ సంగతులన్నీ నిర్భయముగా చెప్పగలనని యంటున్నాడు.

గో-శా—మొదట నేను యీపిల్ల రామనాథం కూతురనుకున్నాను.

వైద్య—కాదు. యీపిల్ల యాతని మేనకోడలు మీకు జ్ఞాపకమున్నదో, లేదో, ఇదివరకొక పోలీసు యినస్పెక్టరుమీద పెద్ద కేసైంది. ఆ యినస్పెక్టరే యీపిల్ల తండ్రి. ఈతడు జెయిలునుండి విడుదలై రెండుమూడు నెలలు మాత్రమే ఐంది.

గోపాలశాస్త్రి తలపట్టుకొని మతిలేనట్టు "అయ్యో దేవుడా! మమ్మలి నెక్కడినుండి యెక్కడకు తీసుకునివచ్చి చిక్కులలో పెట్టినావు?"

శర్మ—ఐతే, యిప్పుడు రామనాథంగారిని పిలిపించి కనుక్కుందాం.

ఇంతలో రామనాథమే యేదో సంగతి మాటలాడుటకు వీరి వద్దకు వచ్చెను. ఆతనిని జూచి శాస్త్రి మండిపడుచు "ఏమయ్యా! మహానుభావుడా! మీకొచ్చిన కళంకమును మా నెత్తిని పులుముటకు మాకంటె నీవప్రపంచములో మీకెవ్వరూ కనబడలేదా?"

పిల్లికి పట్టుబడ్డ యెలుకవలె రామనాథము వణకుచు దీన భావముతో, చేతులు జోడించి, "శాస్త్రిగారు! మావల్ల యేమపరాధము వచ్చినది?"

గో-శా—నువ్వు చేసిన పనికి బుఱ్ఱ బద్దలుకొట్టినా పాపములేదు. గుడిశేటిదాని చెల్లెలను మాకంటగట్టి మా వంశమును నాశనము

చేయ దలచితివా? ఇంకా సిగ్గులేక తెలియని వానివలె యే మపరాధము చేసితినని యడుగుచున్నావు?

రామ—(డగ్గుత్తికతో) శత్రువులు, మిత్రులు అంకరకు ఉంటారు. ఎవరైనను కిట్టనివా రపవాదలు పుట్టించిన మీవంటివారు నమ్మవచ్చునా? ఈ సంగతు లెవరు చెప్పితిరో వారిని నా ముఖముముందు చెప్పమనండి.

శర్మ—ఔను. అది బాగుంది. అయ్యా వైద్యనాథంగారు! ఆ చెప్పిన మనిషెవరో వేగిరం పిలిపించండి.

గో-శా—(తమ్మునివైపు కోపముతో జూచుచు) నువ్వెందుకు మధ్య నడ్డంగా వస్తావు? (రామనాధంతో) మీ శత్రువే యీసంగతి చెప్పి యుండవచ్చును. ఐనా యీ సంగతి నిజమో? అబద్ధమో? ముందు మీరు చెప్పండి.

రామ—ఏసంగతి?

గో-శా—ఇదేను. కళ్యాణపురపు వేశ్య కమలాభాయి పెండ్లికుమార్తెకు ఖాసా అక్క అవునా? కాదా? అన్న సంగతేను.

రామనాధము ముఖము వెలవెల బారెను. ఆతడు సిగ్గుచే తల వంచుకొని కళ్ళు తేలవేయుచు, "శాస్త్రిగారు......అనిమాత్ర మే యనెను. కాని మరి యాతని నోటమాట వచ్చినదికాదు.

గో. శా—(గర్జించుచు) స్పష్టముగా నెందుకు చెప్పరు? ఈసంగతినిజమా? లేక అబద్ధమా?

రామనాధ మెంతప్రయత్నించినను, "అయ్యా!" అనుట తప్ప మరి ఒకమాట ఆతనినోటినుండి వచ్చుటలేదు.

ఇప్పుడు గోపాలశాస్త్రి సందేహమంతయు పూర్తిగా తీరిపోయినది. క్రోధాగ్ని రగిలిపోవుచుండెను. కండ్లవెంట నిప్పులు రాలుచుండెను. ఒడలు గడగడ వడక సాగెను. ఆతడు రామనాధము వైపు

తీక్షణముగా జూచుచు, "నీకు బ్రతుకుమీద ఆశయున్న యెడల నాకళ్ళయెదుటనుండి లేచిపో, ఛీ! నీచుడా! దగుల్ భాజీ! ఇంత మోసమా? నలుగురిలో తగుదునని తలయెత్తుకుని యేలాగు తిరుగుచున్నావు? ఛీ చండాలుడా! నీయింట్లో పచ్చిమంచినీళ్ళయినను త్రాగను. నీపిల్లను నీమెడకే కట్టుకో."

ఇట్లు కేకలు వేయుచు పీటలమీద కూర్చున్న మోహనుని రెక్క పట్టుకుని లేవనెత్తి విడిదెకు తీసుకొనిపోయెను. అతని వెనుకే తక్కిన మొగపెండ్లివారు స్త్రీపురుషులందరు వెళ్ళిపోయిరి. వాళ్లు వెళ్ళిన తర్వాత రామనాధము శర్మ చెయ్యి పట్టుకొని "బాబుగారు! ఏలాగైనను అన్నగారిని మీరే సమాధానపెట్టాలి, లేకపోతే యిక నేను నలుగురిలో తలయెత్తుకొని తిరగలేను. కమల సంగతి మీరెరిగే యుందురు. ఆదౌర్భాగ్యురాలే మాకుటుంబమునకు కళంకము తెచ్చిపెట్టినది. దైవేచ్ఛ ఆలాగున్నది. ఆకప్పబడ్డవన్నియు త్రవ్విన నేమిలాభము? నేనీసంగతి దాచక యేలాగుబయలు పెట్టగలనో తమరే శెలవియ్యండి. ఇప్పుడీ పిల్లకు పెళ్ళిచెయ్యక తప్పదు. అందువలన సంగతి దాచకపోతే యేలాగౌతుంది. మీతో నిజము చెప్పుచున్నాను. మీసంబంధము నిశ్చయమైన తర్వాతే నాకీసంగతి తెలసినది.

శర్మ—(విచారముతో) ఈసంగతి అన్నగారి చెవులపడకపోయిన ఏయుల్లరి యాటంకము లేకుండ వివాహము జరిగిపోయి యుండును. ఐనా మీశెలవు ప్రకారం మిప్పుడేపోయి ఆయనను సమాధానపరచుటకు ప్రయత్నించెదను. కాని ఆయన ఒప్పుకుంటారని మాత్రము నాకు నమ్మకంలేదు.

గోపాలశాస్త్రి విడిదిలో నౌఖర్లను గుమాస్తాలను సామానంతయు సర్ది ప్రయాణమునకు త్వరగా సిద్ధము కమ్మని పెద్దగొంతుకతో

కేకలు వేయుచుండెను. మోహానునితో నీసంగతంతయు జెప్పుటవలన ఆతడుకూడ తనబట్టలను సర్దుకొనుచుండెను. జానికమ్మ ఒక మూల పెండ్లివారిని తిట్టుచు కండ్లు తుడుచుకొనుచు, నౌఖర్లమీద కేకలు వేయుచు నానాగడబిడ చేయుచుండెను. సుభద్రమ్మ మొగమింత చేసుకొని మతిపోయినట్లొక మూలనిలువ బడెను.

ఇంతలో కృష్ణశర్మవచ్చి వినయముతో, "అన్నయ్యా! తొందర పడకండి కొంచెము ముందువెనుక లాలోచించి మరీ పని చెయ్యవలెను. మోసమే జరిగిపోయినది కాని యీవిధముగా తిరిగి వెళ్ళిపోతే నలుగురిలో మరింత నగుబాట్లు కావా?

మోహానుడు పినతండ్రివైపు హేళనగాను, గోపాలశాస్త్రి హేళనగాను చూడసాగిరి.

శర్మ—మరి ముగ్గురు నలుగురిని కనుక్కొని వారేమంటారో చూద్దాం.

గో. శా—ఏమంటున్నావు? ఎరగెరిగి త్రాచుపామును మెడకు చుట్టుకోమన్నావా?

శర్మ—దీనివలన నగుబాట్లేనా తగ్గుతాయి.

గో. శా—నువ్వింకా కుఱ్ఱవాడివి. నీకేకష్టసుఖాలు మంచిచెడ్డలు ఏం తెలుస్తాయి? వెళ్ళి ప్రయాణం సరంజాం చేయించు. ఎల్లకాలం వంశానికి కళంకంవచ్చేకంటె యీనగుబాట్లే నయం.

శర్మ—ఆపిల్ల గతేమౌతుందో కొంచెం ఆలోచించండి ఇందులో ఆపిల్ల తప్పేమున్నది?

గో. శా—(మండిపడుచు) నువ్వు వట్టిమూర్ఖుడిలాగున్నావు. మరి మాట్లాడక సామాను సర్దించు రేపేదేనా చెడ్డపేరువస్తే కట్నాని కాశపడ్డానని నువ్వే అంటావు. ఇటువంటి వ్యవహారములలో నీప్లీడరీ యుక్తులు పనికిరావు.

శర్మ—(దీనముగా జూచుచు) నేను మీయాజ్ఞను ధిక్కరింప జాలను. కాని ఆపిల్ల గతేమగునో యని విచారముగాయున్నది.

గో. శా—నువ్వు నిష్కారణముగా నాకు కోపము తెప్పించు చున్నావు ఆపిల్లకు నేనేకళంకము తెచ్చిపెట్టానా? ఆపిల్ల అదృష్టం యేలాగుంటే ఆలాగు జరుగుతుంది. దానితో నాకేమీ ప్రసక్తి లేదు.

శర్మ—(నిరాశతో) వీరింటికి కమల గాకపోకలేమియు లేవుట. వీరామెను బహిష్కరించినారట.

గో. శా—నాకు కోపం తెప్పించవద్దని యిదివరకే చెప్పినాను. నాతో నీలాటి మాటలు చెప్పాటకు సిగ్గులేదా? గొప్పసంస్కర్తవు బయలుదేరావు. సానిదాని చెల్లెలిని నాకొడుక్కి చేసుకోమంటావా? ఛీ ఛీ, నీబుద్ధి బుగ్గైనట్లున్నది. నీకు మతిలేదా?

కృష్ణశర్మ సిగ్గుతో తలవంచుకొనెను. ఆతడు తనలో, "అన్నయ్య చెప్పినట్లు చేయక తప్పదు." అని యనుకొన్నను ఆపిల్లసంగతి తల చుకొన్న మనస్సుండబట్టినదికాదు. మరియొకసారి ప్రయత్నించి చూచెదనని సాహసముతో, "కమలాభాయి యిప్పుడావృత్తినిమాని విధవాశ్రమములో చేరినది."

కృష్ణశర్మ తల వంచుకొనియే యీ మాటలను జెప్పుచుండెను. అన్నవైపు కన్నెత్తి జూచుట కాతనికి సాహసము లేకుండెను. ఈ మాటలాతని నోటినుండి వచ్చినవెంటనే శాస్త్రి మరి కోపము పట్టజాలక తమ్ముని ఒక్క దెబ్బవేసి వెనుకకు తోసివేసెను. కృష్ణశర్మ వళ్ళు దులుపుకొనుచు నెమ్మదిగా లేచి చూడగా గోపాలశాస్త్రి కోపమున గడగడ వణకుచుండెను. శర్మకు తన అన్నచేత యిటు వంటి దెబ్బలు తినుటకిదియే మొదటి పర్యాయము. బాల్యావస్థయం దెంత పెంకితనము చేసినను శాస్త్రి తమ్ముని పల్లెత్తు మాటయైనను

అనలేదు. శర్మ చిన్న పిల్లవానివలె కళ్ళవెంట నీళ్ళు కార్పసాగెను. ఆతని మనస్సునందు క్రోధము లేదు. కాని తననంత ప్రేమించు అన్నగారికింత కోపము తెప్పించితినికదా? యని ఆతనికి దుఃఖముగా నుండెను. ఇది నిజముగా హృదయమునందు మండుచున్న అగ్నిజ్వాల. ఇది లజ్జావమానముల యొక్కయు, ఆత్మవిచారము యొక్కయు ప్రత్యక్షస్వరూపము. హృదయమునందు మండుచున్న శోకసాగరము యొక్క కెరటము. మోహను డొక్కదాటున పినతండ్రిని లేవనెత్తి తండ్రివైపు జూచుచు, "మీకు వెఱ్ఱెత్తినదా యేమిటి?" యని కోపముతో ననెను.

ఇంతలో నలుగురు అక్కడచేరి "సంగతేమిటి? ఎందుకు తిరిగి వెళ్ళిపోవుటకు ప్రయాణమగుచున్నారు? రెండు వంశముల మర్యాదా నిలువబడేటట్టు మరీ ఆలోచించండి. ఇప్పుడిద్దరి మర్యాదా ఒక్కటే? ఇచ్చి పుచ్చుకొనుటలో యేమైన పొరబాట్లున్న మీరు సహించవలెను. దేవుని దయవల్ల మీకేమీ కొదువ లేదుకదా? వీరిచ్చునదే పాటి? అది మీకొక లక్ష్యమా?" ఈ మాటలకు గోపాలశాస్త్రి యేమియు జవాబు చెప్పలేదు.

విడిదెలో అతి గడబిడగా నుండెను. సంగతేమిటని ఒకరినొకరు ప్రశ్నించుకొనుచుండిరి. గుమ్మములో మనుష్యులగుంపంతకంత కెక్కువ కాసాగెను. ఆడ పెండ్లివాలూరు వారందరును విడిదెలోనికి వచ్చివేసిరి. వారిలో కొందరు రామనాధముతో, "అయ్యా! పెండ్లి వారు తిరిగి వెళ్ళిపోవుటకు కారణమేమి?" అని అడుగసాగిరి. రామనాధము వారికి తగినజవాబు చెప్పక పోవుటవలన వారందరు శాస్త్రి వద్దకు వెళ్ళి వినయముతో, "అయ్యా! మావల్ల యే మపరాధము వచ్చినది? మీకేశిక్ష విధించినను వప్పుకొనెదము. కాని మీరిట్లు తిరిగి వెళ్ళిపోవుట న్యాయముకాదు. మాకు బంధువులలోను, స్నేహి

తులలోను చాల తలవంపు లైపోవును" అని ప్రార్థింపసాగిరి.

గో-శా—మీ రామనాథమునే అడగండి అతడే మీకు తగిన జవాబు చెప్పును. అని మాత్రమే వారికి జవాబు చెప్పుచుండెను.

నరసింహారావు పెండ్లికుమారుని జూచినప్పటినుండియు సంతోషముతో పొంగిపోవుచుండెను. ముహూర్తము దగ్గర పడుచున్నదనియు, పెండ్లివారెందు కలిగి వెళ్ళిపోయిరో యనియు అత డనుకొనుచుండగా నింతలో కొందరు పరెగెత్తుకొని వచ్చి ఆయన కీసంగ తంతయు జెప్పిరి. అతడు వారిని, "పెండ్లివారెందుకు తిరిగి వెళ్ళిపోవుచున్నారు? రామనాథ మేమైనను జగడము తెచ్చిపెట్టినాడా?" అని యాతృతతో నడిగెను. "రామనాథముగారు కూడ నక్కడనే యున్నారు. ఆయన పెండ్లివారిని బ్రతిమాలుచున్నారు. అంతకన్న మా కేమియు తెలియదు." అని వారు బదులు చెప్పిరి.

నరసింహారావు పగర్చుకొనుచు విడిదెకు పరుగెత్తెను. త్రోవలో నాతడు తన సహచరులతో, "ఇది పిల్లల బొమ్మలాట అనుకొన్నారు కాబోలు? ఇది బొమ్మలపెండ్లి కాదు. సంబంధమిష్టము లేకపోయిన పెండ్లికెందుకు తరిలి రావలెను? చూస్తాను వీరేలాగున తిరిగి వెళ్ళిపోతారో? నెత్తురు ప్రవహింప జేసెదను. నాకురిశిక్ష యైననుసరే. కాని నామజా వీరికి చూపనిదే విడిచిపెట్టను." అనిచెప్పుచు విడిదెచేరి, గర్జిత స్వరముతో, "గోపాలశాస్త్రిగారెక్కడ నున్నారు! అయ్యా! తమరొక్కసారి పైకి దయచేయించండి." అని గట్టిగా పిలచెను.

గోపాలశాస్త్రి యీ గర్జనను విని బైటకువచ్చి ధృఢత్వముతో "అయ్యా! యేమి చెప్పదలచుకొన్నారో చెప్పండి" అని ప్రశ్నించెను.

నర—తమరెందుకు తిరిగి వెళ్ళిపోవుచున్నారు?

గో-శా—మా యిష్టం. మేము వెళ్ళిపోవుచున్నాము. మాకీసంబంధం ఇష్టంలేదు.

నర—ఈ వివాహం జరుగక తప్పదు. మీరు తరలివచ్చి వివాహం పూర్తి కాకుండా ఏలాగు తిరిగి వెళ్ళిపోగలరు ?

గో-శా—మీరేమిచేస్తే చెయ్యండి. కాని మేమీ సంబంధం చేసుకోము.

నర—ఐతే, దీనికి కారణ మేమిటి ?

గో-శా—కారణ మేమిటో మీకు తెలియదా ?

నర—తెలసినట్లైన మిమ్ముల నెందుకడుగుతాను ?

గో-శా—ఐతే, రామనాథంగారి నడగండి తెలుస్తుంది.

నర—నేను మిమ్మలినే యడుగుచున్నాను కనుక మీరే చెప్పండి.

గో-శా—ఎందుకు గుట్టు బయలు పెట్టమనెదరు ? మిమ్ములను సిగ్గుపరచుట నాకిష్టములేదు.

నర—సరే. బోధపడినది. నేను జైలునుండి వచ్చినానని కాబోలు. దానికికూడా శిక్ష ? మీన్యాయము చాలా బాగున్నది.

గో-శా—ఈయొక్క కారణమువల్ల మేము తిరిగివెళ్ళిపోవడంలేదు.

నర—ఐతే, రామనాథం కట్నమిచ్చుటలో మీ కేమైన లోపము చేసినాడా ?

గో-శా—మేమంత నీచులము కాము.

నర—ఐతే, ఇంకా యేమిటి కారణం ?

గో-శా—నన్నడుగవద్దని చెప్పుచున్నాను కానా ?

నర—మీరు చెప్పక తప్పదు. పెండ్లికి తరలివచ్చి తిరిగి వెళ్ళిపోవడం చిన్నపిల్లలాట అనుకున్నారా ? మీరు ధైర్యముగా నున్నారు కాని ఇక్కడ నెత్తురునడి పారక మానదు.

గో-శా—మాకాభయము లేదు. మేమిక్కడ చచ్చిపోయినా సరే కాని మీ పిల్లనుమాత్రం చేసుకోం. మామర్యాద పోగొట్టుకొనుటకు మే మిక్కడకు రాలేదు.

నర—ఐతే, మేము మీకంటె నీచులమా?

గో-శా—ఔను. మాకంటె నీచులే.

నర—దీనికేమైన ప్రమాణ మున్నదా?

గో-శా—ఆహా, యున్నది.

నర—ఐతే దానిని చెప్పుటకు మీరెందుకు సందేహించు చున్నారు?

గో-శా—సరే, వినండి. తర్వాత నన్ను మాత్రం దూషించకండి. మీ పెద్దకూతురు కమలాభాయి అనగా యీపిల్ల స్వంతఅక్క చెడి పోయినది. మీ కిష్టమైన కళ్యాణపురపు సానివీధికి పోయి చూడండి.

నరసింహారావు అవనమ్మకముతో, "ఇది వట్టి యబద్ధము" అని అనెను. కాని ఒక్క క్షణములో తాను రామనాధమును కమల చిరునామా యడుగగా ఆతడు చెప్పకుండ తప్పించుకొనుటయు, క్షణక్షణమునకు కామేశ్వరమ్మ మర్మభేదకములైన మాటలతో తన్ను దెప్పుచుండుటయు, ఆతనికి జ్ఞాపకమునకు వచ్చి, యీసంగతి నిజమేయని తోచెను. అప్పుడు సిగ్గుచేత ఆతనితల వంగిపోయెను. ఈ అవమానమును భరింపలేక ఆతడు తెలివితప్పి క్రింద పడిపోయెను. ఇరుపక్షములవారు పందలకొలది అక్కడ చేరిరి. వారందరుకూడ బ్రమాస్పడి అట్లే నిలువబడిపోయిరి. కాని ఒక్కరైనను యీవిషయమై నోరు మెదపుటకు సాహసింపలేక పోయిరి.

అర్ధరాత్రి కాగానే మొగపెండ్లివారందరు తిరిగి వెళ్ళిపోయిరి. ప్రొద్దుటినుండియు కడు సందడిగానున్న విడిదె అంధకార బంధురమై నిశ్శబ్దముగా నుండెను.

నారాయణదాసు కమలను వితంతుశరణాలయమునందు ప్రచ్ఛన్నముగా నుంచెను. కార్యనిర్వాహక సభ్యుల కొక్కరికైనను, ఈసంగతిని తెలియనివ్వలేదు. ఆశ్రమవాసులతో నీమె కూడ వితంతువనియే జెప్పెను. కాని సూర్యారావువంటి రసికులవద్ద నీ రహస్య మెన్ని రోజులో దాగలేదు. అతడు ప్రయత్నముచేసి కమల దాసీని పిలిపించి, ఆమెవద్ద కమల ఆ చోకీని కొంతవరకు లాగెను. ఈసంగతిని తన మిత్రుల కందరకును కూడ తెలియజేసెను.

ఆ మరునాటినుండియు వారి కృపాదృష్టులు ఆశ్రమమువైపు ప్రసరింపసాగెను. బలభద్రరావునాయుడు, సుబ్బయ్యసెట్టి, సూర్యారావు మొదలైనవారు తరచుగ వచ్చుచుండిరి. ఈ మహానుభావుల కిప్పుడ ఆశ్రమముయొక్క సుభ్రతను గురించియు, సామానుల సౌకర్యమును గురించియు ఆర్థికస్థితిని గురించియు, ఆశ్రమనిర్వహణమును గురించియు, అద్భుతమైన శ్రద్ధ కలిగెను. వీ రందరు రాత్రింబవళ్లు శరణాలయాభివృద్ధిని గురించియే ఆలోచించుచుండిరి.

నారాయణదా సిప్పుడు పెద్ద సందిగ్ధావస్థలో పడిపోయెను. ఒకప్పుడాతడు తనలో, "ఈఆశ్రమముయొక్క కార్యనిర్వాహకమునకు రాజీనామా ఇచ్చివేయుదునా? ఈఆశ్రమమంతా నాతోనేయున్నదా ఏమిటి? కమిటీయం దీవనిని నిర్వహింపగలిగినవా రెందరో యున్నారు. వారి కెట్లుచితముగ దోచిన నట్లే ఈ యాశ్రమమును నడిపించెదరు. నేను నాకండ్లతో నీ అత్యాచారములను జూడ నవసర ముండదు."

మరియొకొక్కప్పుడు, "ఈ దురాచారులను గట్టిగా చీవాట్లు పెట్టెదను. తరువాత సంగతిమాట ఆలోచింపవచ్చు." అని ఊహించుకొనుచుండును.

కాని మనస్సు స్థిమితపరుచుకొని ఆలోచించి, వీరి సంగరను మంచి మాటలాడి పనులు చేయించుకొనుటయే యుత్తమమని ఆతనికి దోచెను. అవసరము వచ్చినప్పు డతడు విధిలేక వారితో మాట్లాడు చుండును. వారి ప్రస్తావనను ఉపేక్ష చేయుచు, మీ రిక్కడకు తరచుగ వచ్చుచుండుట అమర్యాదగా నున్నదను భావమును చూచాయగ వారి కతడు తెలియజేయుచుండెను. కాని తమ అవసర మున్నప్పు డితరుల మందలింపుల నిట్టివారు లక్ష్యపెట్టరు. వా రతిమర్యాదగ నటించుచు, ఆశ్రమాభివృద్ధిని కోరుచుండువారివలె పనిచేయుచుండుట వలన, ఆ కపటమూర్తులవద్ద నారాయణదాసు బుద్ధి ఏమియు పనికి రాకుండెను. ఒకనా డుదయము నారాయణదాసీవిషయమై ఆలో చించుచు, ఆశ్రమమునందలి తన కచ్చేరీగదియందు కూర్చొని యుం డగా, ఆశ్రమగుమ్మమువద్ద నొక గుఱ్ఱపుబండి వచ్చి ఆగెను. సూర్యా రావు, రామశాస్త్రి దానినుండి దిగిరి. నారాయణదాసు వారిని జూచి నిర్ఘాంతపోయెను. ఇదివరకు వచ్చువారితోనే తంటాలు పడు చుండగా వీరు కూడ వచ్చి పడిరి. వీరిని గట్టిగా చీవాట్లు పెట్టి వెను కకు తగిలివేయవలెనని అనుకొనెను, గాని తొందరపడుట మంచిది కాదని తలచి వెనుకకు తగ్గెను.

సూర్యా—అయ్యా! నారాయణదాసుగారు! నమస్కారము. మీరు సుస్తీగానున్నట్టు కనబడుచున్నారే?

రా. మ—పాపం పనితో నొక్కలాగు కొట్టుకొనిపోవుచున్నారు. మీముఖం సుభ్రముగా వాడిపోయినది. ధర్మకార్యంకదా? మాకు కూడా మీపుణ్యం కొంచం పంచండి. మీ రేపనిపురమాయించిన ఆపనిని చేతులు కట్టుకొని చేయుటకు సిద్ధముగా నున్నాము. మాస్నేహితు డొకడు కొన్ని రకముల లేసుల నమూనాలు పంప మని వ్రాసినాడు. షాపులలో నట్టివి దొరకినను, నిక్కడ కొన్న

యెడల ఆశ్రమమునకే ఆలాభము కలుగునని తలచి, వచ్చినాను. దయచేసి ఇక్కడ తయారగుచున్న రకములను నాకు చూపించండి.

నారా—ఇక్కడివారు లేసుపనులు చేయడంలేదు.

సూర్యా—దయచేసి యొక్కసారి లోపలకువెళ్ళి కనుక్కోండి. ఇక్కడివారట్టి పనులు చేయగలరని నానమ్మకము. ఇప్పుడు మీరు పని తొందరలో నున్నారు. కాబోలు ? ఫరవాలేదు. మరియొకసారి వచ్చెదము. మీరు మీజీవితమును సీసత్కార్యముకొరకు ధారపోయుచుండగా మరియొకసారి రావడమునకేనా మాకు కష్టం ?

నారా—మీదయకు చాల సంతోషముగా ఉన్నది. కాని ఇటువంటి పనులిక్కడ చేయకూడదని కమిటీవారు నిశ్చయపరచినారు. కనుక మీరు కోరిన వస్తువులను సమకూర్చ జాలనని చెప్పుటకు విచారముగా ఉన్నది.

ఇట్లుచెప్పిన నారాయణదాసు లేచి నిలువబడెను. ఇప్పుడీ యిద్దరు పెద్దమనుష్యులకు తిరిగి వెళ్ళిపోవుటతప్ప మరియొక యుపాయము కనబడలేదు. వారిద్దరు తమలో నారాయణదాసును తిట్టుచు బండి నెక్కిరి.

ఇంకనూ వారి బండిచప్పుడు వినబడుచునే యుండెను. ఇంతలో సుబ్బయ్యసెట్టి మోటారువచ్చి ఆగెను. సెట్టి శీఘ్రితో బండీనిదిగి, నారాయణదాసుతో షేక్‌హేండుచేసి, "దాసుగారు ! నాటకం విషయమై మీరేం ఉద్దేశించారు ? శకుంతల నాటక మన్నిటికన్నా బాగా ఉంటుంది. దీనిని ఇంగ్లీషువారు తప్పక ఇష్టపడెదరు. తప్పకుండా ఇదే వేయించండి."

ఒక్కొక్కప్పుడు సంధిగ్ధావస్థలో ఎంత ఆలోచించినను సరియైన సమాధానము తోచదు. "ఈసెట్టిపీడ యేలాగున వదలించుకొనుట" యని ఎంత ఆలోచించినను నారాయణదాసున కుపాయము తోచ

కుండెను. ఇట్లు తంటాలు పడుచుండగా ఆకస్మాత్తుగా ఆతని కొక యుపాయము తోచెను.

నారా—అయ్యా! సెట్టిగారు! ఈనాటక మాడుటకు సిద్ధపరుచు కొనలేదు. నేనీవిషయమై పెద్దకలక్టరు సలహాను దీసికొంటిని. ఆతడీ నాటకమాడుటకు శెలవియ్యలేదు. రాజకీయములన్న మీరేమి యర్థము చేసికొనుచున్నారో నాకేమియు బోధ పడడంలేదు. మాటల సందర్భములో ఈరోజున దొరగారిని ఆశ్రమమునకు వార్షిక సహాయము చేయుమని అడుగగా నేను రాజకీయ విషయములయందు సహాయము చేయ జాలనని ఆతడు చెప్పివేసెను. నేనాతని మాటలు, విని ఆశ్చర్యపడి, మీరు ఆశ్రమమును ఏ యుద్దేశముచేత రాజకీయ సంస్థగా తలచుచున్నారని ప్రశ్నించితిని. నేను దీనికేమియు జవాబు చెప్ప జాలనని మాత్రమే ఆయన జవాబు చెప్పెను.

ఈ మాటలను వినినతోడనే సుబ్బయ్యసెట్టి ముఖము వెలవెల బారెను.

సు-సె—ఐతే దొరగారు ఈ యాశ్రమమును కూడ రాజకీయము గనె తలచుచున్నారా?

నారా—ఔనండీ! ఆయన ఈమాటను స్పష్టముగానే జెప్పి వేసెను.

సు-సె—ఆతని యుద్దేశమాలా యున్నప్పుడిక్కడకు వచ్చి పోవు వారిని తప్పక కనిపెట్టుచుండవచ్చును.

నారా—ఔనండి. కాక మరేమిటి? కాని దీనివల్ల మనకొచ్చిన భయమేమిటి? సంఘమునందు అభిమానము గలవారిట్టి మాటలకు భయపడెదరా?

సు. సె—లేదండీ. నేనా సంఘాభిమానులలోనివాడగాను. రామ లీలోత్సవమును కూడ వీరు రాజకీయసంస్థగా దలచిన, దానిని కూడ

ఆపుచేయించివేసెదను. రాజకీయమన్న పేరు వినిన నావళ్లు గడగడ వణకును. మీరు మా ఇంటికి వచ్చి యొకసారి చూడండి. ఒక్క భగవద్గీత పుస్తకమైనను లేదు. బజారునుండి ఏవస్తువు దెచ్చినను ఆకు పొట్లములలోనే తెమ్మని నౌఖర్లకు కఠినముగా ఆజ్ఞాపించినాను. ప్రాతవార్తాపత్రికలను గూడ పొట్లములతోనైనను మా యింటికి తేనివ్వను. శివాజీయొక్క పురాతనపట మొకటి మా గదియందుండెను. దానిని కూడ తీసి పెట్టెలో దాచివేసితిని. అయ్యా! దయచేసి నాకు సెల వియ్యండి.

ఇట్లు చెప్పి సుబ్బయ్యసెట్టి మోటారువైపు తొందరగాపోయెను. నారాయణదాసు తనలో, నవ్వుకొనుచుండెను. ఆతనికి మంచి యుపాయమె దోచినది. కాని దీనివలన ఎన్ని అబద్ధము లాడవలసి వచ్చెనో అను సంగతియే ఆతడు ఆలోచించలేదు. ఈ సేవాపరాయణుడు తన స్వంత విషయమే అబద్ధమాడుటయన్న క్రోశెడుదూరము పరుగెత్తును. కాని జాతీయకార్యములందు అవసరము వచ్చినప్పుడు దీని సహాయమును పొందుటకు కొంచమైనను సంకోచింపడు.

సుబ్బయ్యసెట్టి వెళ్ళిపోవగనె చందారిజిస్టరు దీసి చందాను వసూలుజేయు నిమిత్తమై బయలుదేరుటకు ఆతడు లేచెను. కాని అత డింకను గదిలో నుండగనె బలభద్రరావునాయుడు మోటారు బైసికిల్ మీద వచ్చుచుండుట ఆతడు జూచెను. కోపముచే నారాయణదాసు వడలు మండిపోవుచుండెను చేతిలోని రిజిష్టరును బల్లమీదకు విసరివేసి దెబ్బలాడుటకు సిద్ధమయ్యెను.

బలభద్రరావునాయుడు సైకిల్ దిగి నారాయణదాసుతో, అయ్యా! నేను నిన్నను పంపిన మొక్కలు నాటించినారా? అవి ఏలాగున్నవో జూచుటకు వచ్చాను. మామాలీని పంపమంటె పంపుతాను. వాడు బాగా నాట గలడు.

నారా—(విచారముతో) లేదండి, మీమామూలీని బంప నవసరము లేదు. వాడా మొక్కల నిక్కడ నాటలేడు.

బ. నా—ఏమి? ఎందుకు నాటలేడు? మామూలీవచ్చి తప్పకుండ అంతా సరిచెయ్యగలడు. ఈరోజునే నాటించండి. లేకపోతే మొక్కలుఎండిపోతాయి.

నారా—ఎండినా సరే. పచ్చగా నున్నసరె. వాడుమాత్రం వాటినిక్కడ నాటజాలడు.

బనా—నాటడానికివీలు లేకపోతే ముందే ఎందుకు చెప్పివేసినారు కారు? నేనెంతో ప్రయత్నంచేసి కలకత్తానుండి తెప్పించాను.

నారా—అవిగో వరండాలోనే పడియున్నాయి. మీతో పట్టించుకు వెళ్ళండి.

బలభద్రరావునాయుడు శౌర్యముగల మనిషి. మామూలుగా చాల వినయ విధేయతగ నుండునుగాని ఎవరైనను కొంచెము నిర్లక్ష్యముగ మాట్లాడిన కోపముతో మండిపోవును. అతడు నిర్భయుస్థుడు. వ్యవహారస్థుడు. ఈకారణములవలన అతడన్న ప్రజలకు చాల గౌరవము. చాల విస్వాసము. న్యాయము విషయమై అతడెన్నడును వెనుకంజవేయుడు. తన స్వార్థముకొరకు, సన్మానము కొరకు ప్రజలను హింసింపడు. డాక్టర్ శ్యామలరావు ఎడల ప్రజలకింత విస్వాసములేదు.

నారాయణదాసుయొక్క ఈ నిర్లక్ష్యపు మాటలవలన ఆతనికి చాల కోపమువచ్చెను. కాని దానిని పైకి కనబడనీయక అణచుకొని నారాయణదానుతో, "ఈ రోజున మీరెందు కింత చీదరగ నున్నారు?"

నారా—నాకు తియ్యనిమాటలు చేతకావు.

బ. నా—తియ్యనిమాటలాడడం చేతకాకపోయిన ఫరవాలేదు. కబ్జమాత్రం ఎత్తకండి.

నారా—నాకు నీతులు బోధపరచనక్కరలేదు.

బ. నా—నేను కూడ కార్యనిర్వాహకసభ్యులలో నొకడనని మీ రెరుగరా ?

నారా—అహా తెలుసును.

బ. నా—నేను తలచిన అధ్యక్షుడను కూడ కాగలను.

నారా—ఆఁ. సందేహ మేమి ?

బ. నా—నేను దేనికీ కూడ సహాయులోప మెప్పుడు చెయ్యలేదు.

నారా—ఈ పాతసంగతులన్ని జ్ఞాపకము చేయుట కవసర మేమిటి ?

బ-నా—నేను తలచిన ఈ యాశ్రమము ఒక్క నిమిషములో పడిపోవును.

నారా—అది మాత్రము అసంభవము.

బ-నా—కార్యనిర్వాహక సభ్యు లందరు నా కనుసంజ్ఞలపై మెలగెదరు.

నారా—నిజమే కావచ్చు.

బ-నా—ఒక రోజులో దీని పేరుప్రతిష్ఠలు లేకుండ చేసి వేస్తాను.

నారా—అదిమాత్రం మీ తరంకాదు.

బ-నా—మీరు ఏ యసరా జూచుకొని ఇంత గర్వపడుచున్నారు?

నారా—దేవుని ఆసరా జూచుకొని.

నాయుడు ఆశ్రమమువైపు కోపముతో జూచుచు సైకిలునెక్కి వెళ్ళిపోయెను గాని అతని బెదరింపులను నారాయణదాసు కొంచమైనను లక్ష్యము చెయ్యలేదు. ఆశ్రమ విషయమై నాయుడు తక్కిన సభ్యులతో నేమియు జెప్పడని అతని నమ్మకము. వారితో నీ సంగతి జెప్పిన తన మర్యాదయే పోవునని అతని భయము. ఇంకను తన గొప్పను నిలుపబెట్టుకొనుటకు మెంబరులవద్ద ఆశ్రమమును పొగడును.

కాని ఈ కోపాగ్ని మాత్రము ఎన్నటికైనను రగులక మానదు. అభిమానము, అవమానము నెన్నటికిని మరువదు. ఈ సంశయముల తోచినప్పటికి నారాయణదాసు మనస్సు కొంచమైనను చలించలేదు. సరికదా తన కర్తవ్యమును సరిగా నెరవేర్చ గలిగితినను సంతోష మును, ఈ విషయమై తా నెందుకింత విళంబము చేసితి నను పశ్చా త్తాపమును కలిగెను. ఈ సంతోషమును పట్టజాలక అతడు ఉపాసుగ పాట పాడసాగెను.

ఇంతలో కృష్ణశర్మ వచ్చుచుండుట అతడు జూచెను. అప్పుడే ఏడ్చిఏడ్చి కండ్లు తుడుచుకున్నట్లతని ముఖమునందు విచారమును, నిరాశయు ప్రకటితము లగుచుండెను. నారాయణదాసు ముందునకు వచ్చి, శర్మను కౌగలించుకొని, "జబ్బుపడినారా? పోలిక పట్టలేకుండా ఐ పోయినారు.

కృ-శ—సుస్తీ ఏమీలేదు. కాని మనస్సేమీ స్థిమితంగా లేదు.

నా రా—వివాహ మనుకూలముగా జరిగినదా?

కృ-శ—(నేలవైపు జూచుచు) ఒక అమాయకపు బాలిక యొక్క జీవితమును నాశనము జేసి వచ్చితిమి. ఆ పిల్ల కమలాబాయి చెల్లెలే. ఈసంగతి తెలిసీ తెలియడంతోనె మాఅన్నయ్య ఎవరు చెప్పినా విన కుండా పీటలమీాది పెండ్లికొడుకును లేవదీసికొనివచ్చారు. వారు కన్యా దానము చేయుటకు సిద్ధపడుచుండగా ఈఅవాంతరము వచ్చినది.

నా రా—(దీర్ఘనిశ్వాసము విడిచి) చాలా అన్యాయ మైపోయినది. మీరు మీ అన్నయ్యగారిని సమాధాన పరచలేక పోయినారా?

కృ-శ—నా చేతనైనంత తంటాలు పడ్డాను. కాని ఏమీ లాభము లేకపోయింది.

నా రా—పాపమా పిల్లగతి యేమగునో, కమల ఈసంగతి విన్న చాల దుఃఖపడును.

కృ-శ——ఇక్కడి విశేషములేమిటి? కమల వచ్చినతర్వాత ఆశ్రమములో ఏమి గడబిడ పుట్టలేదుకదా? ఇక్కడి వారందరు ఆమెను నీచముగ జూచుచున్నారు కాబోలు?

నారా——ఆ సంగతి బయలుపడిన ఆశ్రమ మింరోజునే ఖాళీయగును.

కృ-శ——ఐతే కమల ఇప్పుడక్కడ ఏవిధముగా నున్నది?

నారా——ఆశ్రమములో ఎన్నాళ్ళబట్టో యున్నట్లుగ అతి జాగ్రత్తగా మెలగుచున్నది. తన మంచి నడవడివలన పూర్వపు అపఖ్యాతిని పోగొట్టుకొనవలెనని ఆమె నిశ్చయించుకొనునట్లు తోచుచున్నది. ప్రసన్న వదనముతో అన్నిపనులను జేయుటకు తయారగుచుండెను. మిగిలిన స్త్రీలింకా నిద్రించుచుండగనె తాను ముందుగా లేచి అన్నిగదులు శుభ్రపరచును. కొందరు వితంతువులకు కుట్టుపని నేర్పుచున్నది. కొందరకు భగవత్కీర్తనలు నేర్పుచున్నది. అక్కడి వారందరును కూడ ప్రతి విషయమునను ఆమె సలహానే పుచ్చుకొనుచుందురు. ఆశ్రమములో ఇప్పుడామెదే రాజ్యముగా నున్నది. ఇట్లామె ప్రవర్తించునని నేనెన్నడును అనుకొనలేను. ఇప్పుడామె పురాణకాలక్షేపము కూడ ప్రారంభించినది. ఆమె మనస్థితి ఎట్లున్నదో దేవునికే ఎరుక. కాని పైకి జూచుటకు మాత్రము ఆమె ఇప్పుడు పూర్తిగా మారిపోయినట్లగపడుచున్నది.

కృ-శ——లేదండీ. దాసుగారు! ఆమె స్వభావముచేత చెడ్డ స్త్రీ కాదు. ఆమె పూర్వము మా యింటికి తరుచుగా వచ్చుచుండేది? మా వాళ్ళెప్పుడును ఆమె తెలివితేటలకు, మంచితనమునకు మెచ్చుకొనుచుండెడివారు. చెడు సహవాసము, అనాదరణ మొదలైన పరిస్థితులామె నీస్థితికి దెచ్చినవి. నిజ మాలోచించిన మన పాపఫలమే ఆమె అనుభవింపవలసి వచ్చినది. ఐతే మ్యునిసిపల్ వ్యవహారము

లెన్నున్నవి! భలభద్రరావునాయుడు నుకేదైన స్తోత్రమెత్తు యెత్తి నాడా ఏమిటి?

నారా—ఆతడు గడబిడ చేయకుండ ఊరుకొనే రకమా? ఒక్క లాగ ఈ విషయమై తిరిగి పనిచేస్తూయున్నాడు. రెండుమూడు రోజుల క్రిందట సభ్యుల నందరను తన ఇంటికి ఆహ్వానించాడు. నన్ను కూడ పిలచినాడు కాని నేను వెళ్ళలేదు. వాళ్ళవైపే బలముగా నున్నట్లు కనబడుచున్నది. ఇప్పడిమట్టుకు వారికి మనకు వోట్లు సమానముగానే వచ్చేటట్లు అగపడుచున్నది. అదికాక వారికి చైర్మెన్ వోటు ఎక్కువ?

కృ-శ—ఐతే మనము అధమం మరి రెండువోట్లైనా ఎక్కువ సంపాదించాలి. సంపాదించగలమని మీకేమైనా ఆశ ఉన్నదా?

నారా—నాకేమీ ఆశగాలేదు.

కృ-శ—మీా కవకాశ మున్నయెడల నాతో నొక్కసారి దయ చెయ్యండి. డాక్టరుగారిని, భగవంతరావును ఒక్కసారి చూచివద్దాం.

నారా—సరే బయలుదేరండి. నేను సిద్ధముగానే యున్నాను.

## ౬

డాక్టరుగారి బంగాళా అక్కడకు దగ్గరగానేయున్నను వారు మోటారుమీాదనే బయలుదేరిరి. వారి బంగాళాకు కాలినడకను వెళ్లుట క్షేమకరము కాదు. త్రోవలో నారాయణదాసు కృష్ణశర్మ ఊరిలో లేనప్పుడు జరిగిన సమాచారమంతయు జ్ఞాపకమువచ్చినట్లు చెప్పి తన చాతుర్యమును వెల్లడించెను. శర్మ యీసంగతులన్నియు విని విచార స్వరముతో, "ఐతే మనమిప్పుడు మరీ జాగ్రత్తగా మెలగాలి. లేని

యెడల ఆశ్రమ నిర్వాహణమును వారేవహించుటకు ప్రయత్నించెదరు. నాయు డిప్పటి కూరుకొన్నను, ఎప్పటికైన నీరహస్యమును బయలు దీయక మానడు."

నారా—ఏం చెయ్యను. మరి నేనీయత్యాచారమును చూచి సహించ లేక పోయాను నాఒళ్లు మండిపోయినది. పైకి జూచుటకు వీరు విద్వాంసులు, బుద్ధిమంతులు, సద్వర్తనులే కాని లోపల అంతా విరుద్ధమే. నాదగ్గర నేస్వత్వతో పనులు చేయించుకొను సామర్థ్యమే యున్న యెడల నాయుడితో నీదెబ్బలాట లేకపోయే యుండును.

కృ-శ—ఇది యెప్పుడో యొకప్పుడు రావలసియున్నది. ఇదికూడ నాకర్మఫలమే. ఇంకా ఏమేమి చిక్కులు రానున్నవో? పండ్లెను డి తిరుగ వచ్చినప్పటినుండియు నామనస్సు చాలా ఆందోళనగా నున్నది. ఆకలివేయదు. దాహము వేయదు. రాత్రి ఒక్కసారైనను నిద్ర పట్టదు. ఎల్లప్పుడు ఆ బాలిక గతియేమగునా? యన్న విచారమే మనస్సును బాధించుచుండును. ఆశ్రమ భారము కొంతమీద పెట్టుకొన్న నీసంగతి మరపునకు వచ్చునేమో? ఎంత తలయెత్తుకొని తిరుగుదామన్న అంతకంతకు క్రిందకే అణగి పోవుచున్నాను.

ఇట్లు వీరు మాట్లాడుకొనుచుండగా బండి డాక్టరుగారి బంగాళా వద్దనాగెను. అప్పుడు పగలు పదిగంటలయ్యెను. డాక్టరుముందు సావడిలో కూర్చొని తనపెద్దకుమార్తె మిస్. కాంతం శ్యామలరావుతో చతురంగము నాడుచుండెను. మేజాపైని రెండు జాతికుక్కలు కూర్చుని ధ్యానముతో నాటను జూచుచుండెను. వాటికి విసువు పుట్టినప్పుడు పంజాతో ఆబలగమును యిటునటు త్రోసివేయుచుండెను. మిస్. కాంతం, వాటి పెంకెతనమును జూచి నవ్వుచు ఇంగ్లీషు భాషలో "యు-నాటీ!" అని తట్టుచుండెను. మేజా కెడమవైపున పడక కుర్చీలో కూర్చుని రామారావు మధ్యమధ్య మిస్. కాంత

మున కాటలో సలహా నిచ్చుచుండెను.

ఇంతలో మన మిత్రులిద్దరును అక్కడకు వచ్చిరి. డాక్టరు లేచి వారిద్దరితోను "షేకుహేండు" చేసి సత్కరించెను. కాంతంవారివైపు పోరకంటితో జూచి, మేజాపై నున్న వార్తాపత్రికను దీసి చదువసాగెను.

డా. శ్యా—(ఇంగ్లీషుతో) మిమ్మలిని కలుసుకోవడం నాకు చాలా సంతోషంగా నున్నది. దయచేస్యాంకి మీకు మిస్. కాంతంతో పరిచయం చేస్తాను.

పరిచయమైన తర్వాత మిస్. కాంతం వారిద్దరితోను "షేక్ హేండు" చేసి నవ్వుచు, "నాన్నగా రిప్పుడే మీ సంగతి చెప్పుచున్నారు. మీ పరిచయం కావడం నాకు చాలా సంతోషముగా నున్నది." అని పలికెను.

డా. శ్యా—మా కాంతం యీమధ్యనే ఊటీనుండి వచ్చినది. వీళ్ళ స్కూలు చలికాలంలో మూసివేస్తారు. అక్కడి స్కూలు యేర్పాట్లు చాలా బాగున్నవి. ఈమె ఇంగ్లీషు బాలికలతో బోర్డింగులోనే ఉన్నది. లేడీప్రిన్సిపాలు ఈమె తెలివితేటలు మెచ్చుకొనుచు నిప్పుడే యుత్తరం వ్రాసినది. కాంతం! మీ లేడీప్రిన్సిపాలు వ్రాసిన యుత్తరము వీరి కొకసారి చూపించు. మిస్టర్. శర్మ! మీరు మా కాంతం యింగ్లీషు మాట్లాడడం చూస్తే నిజంగా ఆశ్చర్యపోతారు. (నవ్వుచు) ఈమె ఇంగ్లీషు ఉచ్చారణలో నాకు కూడ తప్పులు దిద్దుతూ ఉంటుంది.

కాంతం సిగ్గుపడుచు ప్రిన్సిపల్ వ్రాసిన ఉత్తరమును శర్మకు జూపెను. ఆయన దానిని చదివి, కాంతంతో, "మీరు లాటిన్ కూడ చదువుచున్నారా?" యని ప్రశ్నించెను.

డా. శ్యా—(ఆ మాటనందుకొని) ఈసారి లాటిన్ పరీక్షయం

దీమెకు మెడలు (పతకము) కూడ వచ్చినది. నిన్న క్లబ్బులో నీమె టెన్నిస్ ఆటను జూచి ఇంగ్లీషు స్త్రీలు కూడ ఆశ్చర్యపోయారు. అన్నట్టు మీరు మొన్న నాయుడుగారింట్లో జరిగిన సమావేశమునకు వచ్చినట్టులేదే ?

శర్మ—లేదు. అప్పుడు నేను మా గ్రామమునకు వెళ్ళియుంటిని.

డా. శ్యా—మీ తీర్మానమునుగురించే చర్చ జరిగినది. మీరీ తీర్మానమును తొందరపడి కౌన్సిలులో పెట్టవద్దని నా అభిప్రాయము. ఇంకా అది నెగ్గుటకు తగిన బలము కనబడదు.

రామా—ముసల్మానుసభ్యులు మీకు సహాయము చేసెదరని నాకు నమ్మకముగా నున్నది.

శర్మ—(డాక్టరుతో) మీ సహాయమే నిజముగా నున్నయెడల నీతీర్మానము నెగ్గుటలో సందేహ మేమియులేదు.

డా. శ్యా—నాకీ తీర్మానమునందు పూర్తియైన సానుభూతి యున్నది. కాని నేను గవర్నమెంటుచే నామినేటు చేయబడ్డ సభ్యుడనని మీ రెరుగరా ! గవర్నమెంటీ విషయముల నామోదించెదరో లేదో తెలుసుకొనేవరకు నే నిటువంటి సంఘ విషయములలో నెటు వైపు నా ఉద్దేశమును వెలిబుచ్చజాలను.

నారా—(తీవ్రస్వరముతో) ఈ మొదరు పడవిధమున మీవాక్ స్వాతంత్ర్యమునకు విరోధము కలిగినప్పుడు నీకది వెంటనే రాజీనామా యిచ్చుటయే మేలు.

వారు ముగ్గురు కూడ నారాయణదాసుయొక్క యీ అనవసరపు ప్రసంగము విని ఆతనివైపు తీక్షణముగా జూచిరి. రామారావు మర్మసూచకముగా, "రాజీనామా నిచ్చిన నీసన్మానమంతయు ఎట్లు వచ్చును ? గవర్నరుజనరల్‌తో సమానముగా నెట్లు కూర్చొన గలరు ? ఆనరబుల్ మెంబరని యెట్లనిపించుకొనగలరు ? గొప్పగొప్ప

దొరలతో "షేక్ హేండు" చేయు భాగ్య మెట్లు కలుగును ? గవర్న మెంటువారిచ్చు బిరుదుల కాహ్వానింపబడు గౌరవ మెట్లబ్బును ? చెన్నపట్నం ఢిల్లీ షికార్లెట్లు కొట్టగలరు ? తమ వక్తృత్వచమత్కార మెట్లు ప్రదర్శింపగలరు ? ఈ సంగతులన్నియు కూడ నాలోచించండి." అని నవ్వుచు పలికెను. ఈ మాటలు విని నారాయణదాసు సిగ్గుపడెను. దానును తీసుకొనివచ్చుట పొరపాటని శర్మ మనస్సులో చాల నొచ్చుకొనెను.

డా. శ్యా—(గంభీరస్వరముతో) ఇటువంటి గొప్పలకొరకే మెంబరు పదవుల కాశించెదరని సాధారణపు మనుష్యు లనుకొనెదరు. కాని యిదెంత వ్యాపకమో వా రెరుగరు. ఈ మెంబర్లెంత యాలోచింపవలసియున్నది ? దీనికొరకెంత పరిశ్రమ చేయవలెను ? ఎంత ధనము ఎంత సమయము వినియోగింపవలెను ? వీటి యన్నిటికి ప్రతిఫలము. "నేను దేశసేవ చేయగలుగుచున్నానుగదా !" యను సంతోషము తప్ప మరేమున్నది ? ఈ సంతోషము కూడ లేకపోయిన యీ మెంబరు పదవుల కెవ రాశించెదరు ?

రామా—ఔను, ఇందులో సందేహ మేమున్నది ? డాక్టరుగారు బాగా శెలవిచ్చినారు. ఎవరిమీద నీవ్యాపకమునో వారికే యీ కష్టసుఖములన్నియు బాగా తెలియును.

ఇంతలో పదకొండు గంటలయ్యెను. డాక్టరు లేచుచు శర్మతో "నా భోజన సమయమైనది. నాకు శెలవియ్యండి వెళ్ళుచున్నాను. సాయంత్రం మళ్ళీ కలుసుకుందాము."

శర్మ—తమరవశ్యము దయచేయవచ్చును. (తనలో) కొంచెము భోజన మాలస్యము కాగానే ఈత డింత తొందరపడిపోవుచున్నాడు. ఇటువంటివాడు దేశముకొరకేమిపని చేయగలడు ? దేశసేవకులమని చెప్పుకొనగలరు; కాని కొంచెమైనను కష్టమున కోర్చలేరు.

అక్కడినుండి వీరు భగవంతరావింటికి వెళ్ళిరి. ఆతడెండలో పడకకుర్చీలో పండుకొని చుట్ట కాల్చుచుండెను. ఆతని చిన్నకుమార్తె వడిలో కూర్చుని ఆపొగను పట్టుకొనుటకు మాటి మాటికిని చేతిని జాపుచుండెను. ఆతని కెదురుగా నేలపైని చాలమంది మేస్త్రీలు, కూలీలు కూర్చుని ఉండిరి. భగవంతరావు శర్మను చూడగానే లేచి నమస్కరించెను.

భగ—నిన్న సాయంత్రమే తమ రూరినుండి దయచేసినారని విన్నాను. ప్రొద్దుటే తమ దర్శనమునకు రావలె ననుకున్నాను. కాని యీ పనితొందరలనుండి తీరుబడి యైనదికాదు. ఈ కంట్రాక్టరుపని చాలా చీదరైన పని. ఇప్పటి ఇంజనీయరు సాహేబు నాపనిని పసందు చేయక ప్రతీ విషయంలోనూ చీదర పడుతూనే వుంటాడు. ఒక వంతెనను కంట్రాక్టుకు తీసుకున్నాను. ఇది బాగులేదని అదిబాగులేదని అప్పుడే ఆవంతెనను మూడుసార్లు పడగొట్టించాడు. లాభమేమి టీలాగుచేస్తే మాకుమిక్కిలి నష్టమే వస్తుంది. అతి కర్కోటకుడు. ఆతని ననేవాళ్ళెవరు? అన్నట్టు మొన్న మన మెంబర్ల సమావేశ మైనట్టు తమరు వినే ఉంటారు.

కృ-శ—ఆఁ. విన్నాను. ఆ సంగతులు వినగానే చాలా విచార మైనది. ఇప్పుడు మీమీదే ఆశపెట్టుకుని యున్నాను. ఈ సంస్కరణ విషయమై మీ యుద్దేశమేమి?

భగ—ఇది కేవల ముపయోగమైనదని చెప్పుటయేగాక నాకు హృదయపూర్వకముగా మీకు సహాయము చేయవలెనని యున్నది. కాని నాయుద్దేశమునకు నేను స్వతంత్రుడను కాను. నేను స్వార్థమున కమ్ముడు పోయినాను. నన్ను గ్రామఫోను రికార్డే అనుకోండి. నన్ను వారు యేది చేయమన్న అది చేయుటతప్ప మరియొక విధముగ నడుచుకొన జాలను.

శర్మ—కాని స్వార్థముకన్న సంఘసేవయే ఉత్కృష్ట మైనదని మీరు ఒప్పుకొనరా ?

భగ—ఆహా ! దీనిని సిద్ధాంత రూపముగా నప్పుకొనుచున్నాను కాని ఆచరణలో పెట్టుటకు శక్తిలేదు. నా వ్యవహార మంతయు సుబ్బయ్యసెట్టి సహాయముమీదనే ఆధారపడి యున్నదని తమ రెరిగే యుందురు. అతనికి కోపము తెప్పించిన నట్టైన నా వ్యవహారమంతయు నాశనమగును. నాకు సంఘములో జరుగుచున్న మర్యాద యంతయు నీ కంట్రాక్టు వలననేకదా ? నేను విద్యావంతుడను కాను. వీరి సహాయమువలననే నా వ్యవహారము గుట్టుగా జరిగిపోవుచున్నది. నే నే మాత్రం నాయిష్టప్రకారం నడచినా వీరు నన్ను నేతిలోని ఈగను తీసి పారవేసినట్లు చేయుదురు. మీరే చెప్పండి ఈ పట్నంలో నన్ను నమ్మి వడ్డీలేకుండా వేలకొలది రూపాయలు బ్బులెవరిస్తారు ? పిల్లల గలవాడిని. కేవలము నా యింటిఖర్చులే నెలకు రెండువందల రూపాయిలగును. సంఘసేవయందు కష్టములను సహించుటకు నేను సిద్ధముగా నున్నాను గాని నాభార్యా పుత్రుల నెట్లు నిరాధారులను జేయగలను.

మనము మన విధులను నెరవేర్చుట కిష్టములేనప్పుడు ఆ దోషములనుండి తప్పించుకొనుట కెదుటివారు నోరెత్తలేకుండ అనేక యుక్తులను పన్నెదము. అటువంటి సమయమందు సంకోచము విడిచి మన రహస్యములను కూడ బయలుపెట్టకుందుము. భగవంతరావు హృదయమునం దీభావములే పనిచేయుచుండెను. శర్మ యాతని యాశలేదని తలచి, “ఇటువంటి స్థితిలో నిమ్మలి నెట్లు బలవంత పెట్టగలను ? నాకింక ఒక్కవోటు మాత్రమే కావలసి యున్నది. అది సంపాదించుట కేమైన నుపాయము చెప్పగలరా ?” అని యడిగెను.

భగ—రామదేవుగారింటికి వెళ్లండి. దేవుని దయవలన మీకా వోటు రావచ్చును. బలభద్రరావునాయుడు ఆయనమీద మూడు వేలకు దావా తెచ్చినాడు. అది నిన్ననే డిక్రీ కూడా అయినది. రాజుగారి కిప్పుడు నాయుడిమీద చాలా కోపముగా నున్నది. సందు దొరుకుతే కసి దీర్చుకొనుటకు చూస్తున్నాడు. ఆయనను లోబరచుకొనుట కింకొక ఉపాయము కూడ జెప్పెదను. ఆతని నిప్పుడే ఏదో యొక సభ కధ్యక్షునిగా చెయ్యండి. సరి ఇక నాతడు మీ చేతిలోని వాడే.

శర్మ—(నవ్వుచు) ఉపాయం చాలా బాగున్నది. ఇప్పుడే వారింటికి కూడా వెళ్లుచున్నాను.

రెండుఝాములైనప్పటికి శర్మ కాకలి, దాహము అనిపించలేదు. ఆతడు వెంటనే కారుమీద బయలుదేరెను. రాజుగారి బంగాళా నదియొడ్డున నుండెను. దానిని చేరుటకు పూర్తిగా నొకగంట పట్టినది. బంగాళాయని పేరే కాని శుభ్రత యేమియు లేదు. సొగసు లేదు. పేరునకు దానిచుట్టు తోటకలదు కాని దానిలో నొకపూలమొక్కయైనను లేదు. వరండామీద యెన్నోరకముల కుక్కలు కట్టబడి యుండెను. ఇంటికి దగ్గరగానే గుఱ్ఱపుసాల. అతనికి వేటయన్న మిక్కిలి సరదా. అందుచేత తరచుగా నాతడు వేటకుబోవుచుండును. ఇప్పుడాతడు తనగదిలో కూర్చుని వీణ వాయించుచుండెను. గోడల నిండ పులిచర్మములు దుప్పికొమ్ములు మొదలైనవి తగిలింపబడి యుండెను. ఒకవైపు పిస్తోళ్లు, బల్లెములు కత్తులు వేలాడుచుండెను. ఇంకొకవైపున బల్లమీద పెద్ద గడియారము "టిక్కు" "టిక్కు" మనుచుండెను. శర్మ గదిలోనికి రాగానే రాజాతని జూచి గతుక్కుమనెను. గదియంతయు అతి అసహ్యముగాను చిందరవందరగాను ఉండెను. రాజు వెంటనే లేచి శర్మకు ప్రేమతో స్వాగతమిచ్చుచు,

"శర్మగారు! దయచెయ్యండి. తమదర్శనమే దుర్లభమై పోయినది. గ్రామమునుండి యెప్పుడు దయచేసినారు?"

శర్మ—నిన్ననే వచ్చినాను.

రా. దే—ముఖము చాలా వాడిపోయియున్నది. జబ్బు చేసినదా?

శర్మ—లేదు మీదయవల్ల ఆరోగ్యముగానే యున్నాను.

రా. వి. దే—కొంచెం ఫలహారం పుచ్చుకొండి, తెప్పిస్తాను.

శర్మ—అమ్మాయ్యా! భుజించినంతే ఇప్పుడు ఫలహారం చెయ్యజాలను. వీణమీద సాధకము చేయుచున్నారా?

రా. దే—ఔను. నాకు వీణంటే చాలాసరదా. హార్మోనియ మన్నా పియానా అన్నా నాకు తలనొప్పి. ఈ ఇంగ్లీషు వాయిద్యములువచ్చి మనసంగీతమును నాశనము జేసినవి. ఇప్పుడిది విమర్శనమై యెల్ల ప్రతిచోటను చర్చలు జరుగుచున్నవి. ఈనాటకాలు వచ్చినతర్వాత ఉన్న శాస్త్రంకూడా చెడిపోయినది. ఎవరుచూచినా రాగాలాపన చేసేవారే. ఇంక కొన్నిరోజులలో ధనుర్వేదమువలె యిదికూడ నశించి పోవునేమో యని భయముగా నున్నది. సంగీతమువలన హృదయము నందు పవిత్రోద్దేశ్యములు పుట్టును. ఈసంగీత ప్రచారము తగ్గిన కొలదీ మనము భావశూన్యుల మగుచున్నాము. దీనివలన సాహిత్యము కూడ చెడిపోవుచున్నది. ఏ దేశమునందు భారత రామాయణాది మహాగ్రంథములు రచియింపబడినవో ఆ దేశమునందిప్పుడు సాధారణ నవలలకుకూడ అనువాదమునే ఆశ్రయించవలసి వచ్చుచున్నది. త్యాగరాజువంటి మహాపురుషులు జన్మించిన మనయాంధ్రదేశమందు సంగీతము నశించుటెంత శోచనీయము? బంగాళా, ద్రావిడ దేశము లందు సంగీతమింకను పూర్తిగ నశింపనందున అక్కడి భావోద్దేశము లంత నశింపలేదు. మనసాహిత్యములో అనువాదములు తప్ప స్వతంత్రగ్రంథములంతగా లేకపోవుటవలన నాకు చదువుట యందాసక్తి

కూడఁబోవుచున్నవి. ప్రపంచమునందే సాహిత్యము నింతదరిద్రస్థితిలో నున్నదనుకోను. ఇంగ్లీషునుండిగాని, బంగాళీనుండిగాని రెండుమూడు పుస్తకముల కనువాదమును జేసి తమంత భాషాసేవకులు లేరని కొందరు గర్వపడుచుందురు. ఒక మహాశయుడు కాళిదాసునాటకములను తర్జుమా చేసి తాను ఆంధ్రకాళిదాసునని తలఁచి యానందించును.

రాజాకు సాహిత్యమునందింత పరిచయము కలదని తెలిసి శర్మ చాల చాల యాశ్చర్యపడెను. ఈతనికి "టెన్నిసు" ఆట, వేట తప్ప నితర విషయములం దభిమానము లేదని శర్మ యిదివరకు తలచెను. తాను సాహిత్యమున కపరిచితుఁడైనను, తన లోపమును రాజాముందు ప్రకటింపలేదు. ఈ సంగతులన్నియు బోధపడినట్లు చిరునవ్వు నవ్వుచు, "రెండువైపులా సబబులు కలిగినటువంటి విషయమును మీరు ప్రారంభించినారు. దీని విషయమై వాదించుట కిప్పుడు నాకు తీరికలేదు. నే నిప్పుడు మరియొక పనిమీద వచ్చితిని. మొన్నటి మ్యునిసిపల్ మెంబర్ల సమావేశమందు మీరు నాయుడిపక్షము నవ లంబించినట్లు తెలియవచ్చినది. నిజమేనా!"

రామదేవి మాటలు విని పకపక నవ్వసాగెను. అతని నవ్వు గది యంతయు ప్రతిధ్వనింపసాగెను.

రా-దే—ఈసంగతి మీరెవరివలన విన్నారు? నిజంగా చెప్పండి!

ఈ నవ్వుయొక్క అర్థము తెలియక కృష్ణశర్మ తెలతెల్లపోయెను. ఆతడు తన్ను హేళనచేయుటకట్లు నవ్వుచున్నాడని తలచి, కొంచెము విసువుతో, "అందరూ చెప్పుచున్నారు. ఎవరి పేరని చెప్పను."

రా. వి. దే—(ఇంకా గట్టిగా నవ్వుచు) ఐతే మీరీ మాటలు నమ్మివేశారా?

శర్మ—(మరింత చీదరతో) నమ్మకపోవుటకు నాకేమియు కారణము కనపడలేదు.

రా. వి. దే—నాకు ఘోరాన్యాయముచేయుటయే కారణము మీ తీర్మానము బలపరచుటకు నా శాయశక్తులు వినియోగించితి ననియే నేను నమ్ముచున్నాను. ప్రతిపక్షులతో విరోధము వచ్చునని కూడ నేను వెనుదీయలేదు, ఇప్పుడు మ్యూనిసిపాలిటీలో సాధారణోపన్యాసములైనను అర్థము చేసుకోలేని మహానుభావులు మెంబర్లుగా జతపడినారు. ఇది యెంత విచారకరము ? ఇట్టివారు చేరకుండ మనము ప్రయత్నము చేయవలెను. శర్మగారు ! మీ కింతవరకు శ్రమ యిచ్చినందుకు క్షమించండి. మీ తీర్మానమును హృదయపూర్వకముగా నే నామోదించుచున్నాను.

కృష్ణశర్మ కిప్పుడు దేవు మాటలయందు విశ్వాసము కలిగెను.

శర్మ—(నవ్వుచు) ఈ చెప్పినవా రందరు మోసపోయినవా రిది తెలివితక్కువ ఆలోచనే కాని, ప్రభాకరరావుగారు మోసపోవడం మాత్రం నమ్మశక్యము కాకుండా యున్నది.

ఎల్లప్పుడు పత్రికగొడవలో కొట్టుకొనిపోవుచుండుటవలన యాతని బుద్ధికూడ మందగించిపోయినదేమో !

కృష్ణశర్మ కిప్పుడు గొప్ప జయము కలిగినంత సంతోషము కలిగెను. రాజు ప్రేమాదరములు మాటలనేర్పు ఆతనిని వశము జేసుకొనెను.

౨

చాల సంవత్సరములు కష్టపడి సంపాదించిన సొమ్ముతో నిల్లు భూములు కొనవలెనని ఉత్సాహపడుచు పెట్టె తెరచి చూడగా అందులో నొక్క దమ్మిడీయైనను కనబడకపోయిన మనసెట్లు వ్యాకుల

ముగా నుంచునో ఆవిధముగనె ఇప్పుడు మోహానుని మనస్సుండెను. స్వతంత్రాలోచన, విద్య, సత్సహవాసము, అనుభవములపై నాధార పడి యున్నది. మోహానునివద్ద నిటువంటి గుణము లేవియు లేవు. ఆతని ఉద్దేశములతి చంచలములు. ఆతడు కమల నెంత ప్రేమించి నను, తన జాతి పోవునను భయమువలన ఆమె ఎంత బలవంత పెట్టి నను అమె చేతి మంచినీళ్లైనను త్రాగలేదు. అట్టి స్థితిలో కమల చెల్లెలను పెండ్లియాడి, తన వంశమునకు కళంకము తెచ్చుకొనుట కెట్లు సమ్మతించును ?

మన సంఘాచారములయందు ధార్మిక విషయములయందు నొక విధమైన అభిమానము కలిగినప్పుడు మనస్థితి ఎట్లుండునో అట్లే ఇప్పుడు మోహానుని స్థితియుండెను. అట్టి సమయములో వాటియందు మనకేమియు లోపము కనబడదు. మన ఆచారములకు విరుద్ధముగా మంచి ప్రసంగములను వినునప్పుడు మన మనస్సునందు విశాల భావ మొందుకుదయింపదు; మునుపటివలె ఆడవాండ్రు నదిస్నాన మునకుగాని, ఇరుగు పొరిగిండ్లకు గాని వెళ్లుట మోహానున కిష్ట మిష్టము లేకుండెను. ఇంటిలో ఆడువాండ్రు గట్టిగా మాట్లాడిన ఆతడు లోపలకు వెళ్ళి తల్లిని మందలించు చుండును. సుభద్రమ్మకు తన అత్తగారి ఖాయిదాయైన నింత కఠిన మనిపించలేదు. ఇప్పుడతని బుద్ధి సంకుచితమై పోయెను. ఆగ్రామములో నొక బ్రాహ్మణుడొక స్త్రీని లేవదీసికొని వచ్చి ఇంటిలో పెట్టుకొనుటయు, గ్రామవాసు లందరు అతనిని వెలివేసి అనేక బాధలు పెట్టుటయు, ఆ బాధలు పడ లేక ఆబ్రాహ్మణుడా స్త్రీని ఇంటినుండి తగిలివేయుటయు, మోహాను డిదివరకు చూచియుండెను. ఆతడు నిశ్చయముగా కమలను ప్రేమించు చుండెను. కమలను ప్రేమించవచ్చును గాని ఆమె నీడయైనను ఇంటి వైపు రాకూడదని అతని లౌకికశాస్త్ర సిద్ధాంతము. ఇప్పటివరకతడు

కమల ఇంట్లో మంచినీళ్లైనను త్రాగలేదు. తన వంశమర్యాదను, సంఘాచారములను, తానెంత కష్టపడియైనను నిలువబెట్టవలెనని అతని సిద్ధాంతము. ఒక కులట బంధుత్వమువలన తన వంశమునకుకళంకము, నింద వచ్చునని తలచుకొనుటకు కూడ అతనికి అసహ్యముగ నుండెను. విడిదియందు కృష్ణశర్మ మాటలను విని, మోహనుడు అధీరుడగుచుండెను. తన తండ్రి అతనిమాటల కెక్కడ లొంగిపోవునోయని అతడు భయపడుచుండెను. తన పినతండ్రి విషయమై ఎందుకింత పట్టుదలగా నున్నాడో అతనికి బోధపడకుండెను. తన పినతండ్రి యనిన మాటలే మరియొక రనిన, మోహనుడు వారికి తగినట్లు జవాబు చెప్పియుండును. కాని అతనిమీద ఉన్న గౌరవమువలన నేమియు అనలేక పోయెను. సమయము దొరికినప్పుడు తన పినతండ్రితో వాదించవలెనని మోహనునికి చాల కోరికగా నుండెను. అతని తార్కికశక్తి ఎప్పుడు నింత ఉత్తేజితము కాలేదు. ఈ తర్కవితర్కములు జరిగిన, అతడు తన పినతండ్రితో తప్పక దెబ్బలాడియే యుండును. కాని గోపాలశాస్త్రియొక్క కఠినత్వము అతని యొక్క ప్రతివాదపుకోర్కను సానుభూతిలోనికి మార్చివేసెను.

ఈ ఆశలన్నియు నిరాశ లగుటవలన మోహనుని ఆశాపూరిత హృదయము తిరిగి కమలవైపు పరుగెత్తెను. విషయ వాసనను రుచిచూచిన హృదయమిప్పుడు అంధకారములో నుండుట కిచ్చగింపదు. అతడు పల్లెటూరిలో నుండలేక తిరిగి కళ్యాణపురము వచ్చివేసెను. కాని ఇక్కడకు వచ్చినతర్వాత నతడు పెద్ద సందిగ్ధావస్థలో పడిపోయెను. జరిగిన సంగతంతయు కమలకు తెలిసిపోయిన దేమోయని అతనికి సంశయముగా నుండెను. అతడు తనలో "కమల పెండ్లివారింటికి వచ్చియుండదు. తప్పకుండ వారామెను బహిష్కరించి యుందురు. కాని ఈ వివాహముయొక్క సమాచార మంతయు ఆమెకు

తెలిపియుండురు. అందువలన ఆమె నాతో సరిగా మాటలాడ దేమో! ఒకవేళ తిరస్కారమును కూడ చేయవచ్చును." అని అనుకొనెను.

కాని సాయంత్రము పడగనె అతడు బట్టలు మార్చుకొని గుర్రము మీద బజారువైపునకు బయలు దేరెను. ప్రేమసంఘటన యొక్క ఆనంద పూర్ణ కల్పనలయందు నీసంశయము లన్నియు మాయమై పోయెను." కమలయుండగా ఏమిమాట్లాడుదును? నేనామెకేమి జవాబు చెప్పుదును? ఒకవేళామె కీసంగతులేమియు తెలియక, నేను వెళ్లగనె ప్రేమతో ఆలింగనము చేసికొని, నీవుచాల కఠినాత్ముడవు అని అనునేమో?"

ఈ కల్పనలాతని ప్రేమాగ్నిని మరింత రగుల్కొలిపెను. అతడు గుఱ్ఱమును పరుగెత్తించి యొక్కనిమిషములో బజారువీధిని చేరెను. ఆటలాడు పిల్లవాడు పాఠశాల గుమ్మములోనికి వచ్చి కూడ లోపలకు పోవుటకు భయపడునట్లు మోహనుడు సానివీధికివచ్చి కూడ నొక్కసారి వెనుకకు తగ్గెను. అతని ప్రేమాకాంక్ష మందగించెను. అతడు నింపాదిగ కమల మేడ అగుపడునట్లొక వైపునకు పోయి అక్కడనుండి ధ్యానముతో ఆ మేడవైపు జూచెను. ఆ యింటితలుపు మూసి తాళము వేయబడి యుండెను. అది చూడగనే ఆతని హృదయమునందు పెద్ద బరువు దిగినట్లయ్యెను. డబ్బు తనవద్ద లేకపోయినను పిల్లలపోరు పడలేక బొమ్మలు కొనుటకు బజారునకు వెళ్లి, దుకాణము మూసియుండుట జూచి అతడెంత సంతోషించెనో అట్లె మోహనుడు కూడ సంతోషించెను.

కాని అతడిల్లు చేరగనె తన యుదాసీనతకు చాల పశ్చాత్తాప పడెను. వియోగబాధతో కూడ నతనికి నిరాశ యెక్కువగుచుండెను. ధైర్యమేమియు నిలువకుండెను. రాత్రి అందరుభోజనములైన

నిద్రించిన తర్వాత ఆతడు నెమ్మదిగా లేచి సానివీధివైపు బయలుదేరెను. చలికాలముగుటవలన చలి బాగుగ వేయుచుండెను. చంద్రుడు మేఘముల చాటునుండి తొంగిచూచుచు గాభరాపడు మనుష్యునివలె వేగముగా పరుగెత్తుచుండెను. మోహనుడు సానివీధి వరకు తొందరగా పోయెను. కాని అక్కడ చేరగనే అతని కాళ్ళకు సంకెళ్లు తగిలించినట్లయ్యెను. కాళ్లుచేతులువలె అతని ఉత్సాహము కూడ చల్లబడిపోయెను. "ఇటువంటి సమయమునందు నేనిక్కడకు వచ్చుట చాల హాస్యాస్పదము. ఇప్పుడు కమల ఇంటికివెళ్ళిన ఆమె ఏమనుకొనును! ఆమె నౌకరులు కూడ నిద్రించి యుందురు. నాపిలుపునకు పలుకువారెవ్వరు. నేనింత తెలివితక్కువగ ఇప్పుడిక్కడకెందుకు వచ్చితినో నాకే ఆశ్చర్యముగా నున్నది. నాబుద్ధి ఏమైనది అని విచారించుచు ఆతడింటికి బయలుదేరెను.

మరుసటి సాయంత్రమతడు తిరిగి కమల ఇంటివైపు బయలుదేరెను. కమల చూచి పిలచిన వెళ్ళవలెననియు, లేనియెడల ఇంటికి వచ్చివేయవలెననియు అతడు మనస్సులో నిశ్చయించుకొనెను. "ఆమె నన్ను పిలుచుటయే ఆమెకు నాయెడల అనుమానము లేదనుకొనుటకు తార్కాణము. లేకపోయిన ఆమె నన్నెందుకు పిలుచును?" కొంతదూరము నడచిన తర్వాత "ఆమె నన్ను పిలచుటకు, నేను వచ్చుచున్నానని ఆమె కలగన్నదా! అదికాదు. నేనే ఆమెవద్దకు వెళ్ళవలెను. ఆమె నన్నెప్పుడూ కోపపడజాలదు. ఆమె కొకవేళ కోపమువచ్చిన నేను సమాధానపరచజాలనా! చేతులు జోడించి, ఆమె కాళ్ళపై బడెదను. నాకన్నీళ్ళతో ఆమె మనోమాలిన్యమును కడిగివేసెదను. ఆమెకు నాపై నెంతకోపము వచ్చినను, నాప్రేమ చిహ్నమును తన హృదయమునుండి పెరికివేయ జాలదు. ఆహా! ఆమె తన కమల నేత్రములను నీటితో నించి నావైపు జూచిన నేనామె

కొరకేమిచేయ జాలకుండును? ఆమె హృదయము నందేమైన విచార మున్న యెడల దానిని తొలగించుటకు నాప్రాణమునైనను అర్పించుటకు సిద్ధముగా నున్నప్పుడు ఆమె నాఅపరాధమును క్షమింపదా!" కాని అతడు సానివీధి చేరగనే ఈకల్పనలన్నియు నిలచి పోయెను తిరిగి "ఆమె నన్నుజూచి తనలో, ఓహో! ఈయన పెద్ద జమీందారునివలె బయలుదేరినాడు? ఎంతకపటుడు? ఎంతధూర్తుడు? అని అనుకొనునేమో!" ఈసంగతులు స్ఫురించగనే కాళ్లు కట్టుబడినట్లయి మరి ముందుకు వెళ్ళలేకపోయెను.

ఈప్రకారము చాలరోజులు గడచిపోయెను. రాత్రింబగళ్లు ఈప్రేమకల్పనలతో గట్టిన యిసుక మేడలు సాయంసమయమందు సానివీధి ఎదుట, అవిశ్వాసమను గాలిచే పడిపోవుచుండెను.

ఒకనాడాతడు క్వీన్సుపార్కువైపు బయలుదేరెను. ఆపార్కునందు పెద్ద పందిరివేయబడి యుండెను. అనేకులు ఆపందిరిక్రింద కూర్చొని ప్రొఫెసర్ శంకరరావుగారియొక్క ఉద్రేకపూరితమైన ఉపన్యాసమును శ్రద్ధతో వినుచుండిరి. మోహనరావుకూడ గుఱ్ఱము దిగి శ్రద్ధతో వినసాగెను. "నిజముగ వేశ్యలవలన మనకు చాల హాని కలుగుచున్నది. వారు సంఘమునకు వేరుపురుగులవంటివారు నేనింత వరకు నేలాగో రక్షింపబడితిని. లేనియెడల నాస్థితి ఏమై యుండునో? వీరిని తప్పక పట్టణమునుండి బయటకు పంపివేయవలసినదే. వీరు బజారునందు, పట్టణపుమధ్యయందు లేనిఎడల నేను కమలాబాయి యొక్క మోహజాలమునందు చిక్కుకొనకపోయియే యుందును." అని మోహనుడు తన మనస్సునందు అనుకొనెను.

మరుసటి దిన మాతడు తిరిగి పార్కువైపు వెళ్లెను. ఈ రోజున అబ్దుల్ వఫాసాహెబు భావపూర్ణమైన ఉపన్యాస మిచ్చుచుండెను. మోహనుడు దానిని కూడ శ్రద్ధతో వినెను. "నిస్సంశయముగ

వేశ్యలవలన మనము చాల నుపకారమును పొందుచున్నాము. వీరు లేని ఎడల మన దేవతలను స్తుతించువారే లేకపోయియుందురు. ఈతడు చెప్పినమాటలు నిజమే. వేశ్యాగృహములే హిందూమహమ్మదీయులు సఖ్యముతో కలుసుకొనుటకు తగిన స్థలములు. ఇక్కడ ద్వేషమనుమాట ఉండదు. ఈ జీవనసంగ్రామమునుండి కొంతసేపు విశ్రాంతిపొందుటకును, మనస్సునందుండు కలతలను, దుఃఖములను, మరచిపోవుటకు నివియే తగిన స్థలములు. వీని పట్టణమునుండి తగిలివేయుట వీరికే కాక సంఘమునకంతకును అన్యాయము చేసినట్లగును.'' అని మోహనుడు అనుకొనెను.

కొన్ని దినములకీ యుద్దేశములు కూడ మారిపోయెను. వాటికి స్థిరత్వము లేకుండెను. స్వతంత్రముగ నాలోచించుటకు మోహనునికి శక్తిలేదు. ఆ విషయమందైనను మంచిచెడ్డల నెంచుటకు, మంచిని స్థిరపరచుటకు ఆతనికి సామర్థ్యము లేకుండెను. అందువలన ఏవైపు ఎవరు యుక్తిగ జెప్పిన, ఆతని మనస్సావైపునకు తిరిగిపోవుచుండెను.

ఆ రోజున "కృష్ణశర్మగారుపన్యాస మివ్వదరని'' నోటీసులో మోహనుడు జూచెను. మోహనుడు మూడు గంటలైనప్పటినుండియు ప్రయత్నపడి, నాలుగు కొట్టగనె తిలక్ మైదానమునకు వెళ్ళెను. అప్పటి కింకను చాలమంది ప్రేక్షకులు చేరలేదు. కొందరింకను జంబుకానాలు పరచుచుండిరి, మోహనుడు గుడ్డముదిగి వారికి సహాయము చేయుచుండెను. ఐదుగంటలు కొట్టునరికి ఆ స్థలమంతయు ప్రేక్షకులచే నిండిపోయెను. ఇంతలో కృష్ణశర్మ మోటారులో వచ్చుచుండుట జూచి, మోహనుని గుండె దడదడ లాడసాగెను. మొదట తేగాలీ రచించిన పద్యములను బారిష్టర్ శివరామ్ చదివెను. తర్వాత నారాయణదాసు లేచి ఉపన్యాసమును ప్రారంభించెను. ఆతని వక్తృత్వమునందు ముఖ్యమైన సంగతులున్నను, మృదుత్వముగాని సొగసుగాని

లేదు. ఐనను ప్రజ లాతని ఉపన్యాసమును శ్రద్ధతో వినుచుండిరి. ఆతనియొక్క త్యాగమును దేశసేవయు వారి కాతనియందంత గౌరవమును కలిగించెను. దాహముగా నున్నప్పుడు కుండనీళ్ళెంత ఆప్యాయముగ నుండునో ఆతని పొడిమాటలే వారికంత ఆప్యాయముగ నుండెను. చివరకు కృష్ణశర్మ లేచెను. ఏదోయొక అసాధారణపు సంగతి జరుగుచున్నట్లు మోహనుని గుండెలు దడదడ కొట్టుకొనుచుండెను. శర్మ ఉపన్యాసము కరుణారస పూర్ణముగను, ఆకర్షణీయముగను, ఉండెను. భావసరళముగను, మృదువుగను ఉండి మనస్సులను మోహింపజేయుచుండెను. ఉపన్యాసమునందు మధ్యమధ్య చెప్పు భావపూరితములైన విషయములను విని మోహనుని ఒడలు గగుర్పొడుచుచుండెను. శర్మ ఇట్లు చెప్పుచుండెను. "వేశ్యలను అసహ్యించుకొనుటవలన వారిని ఊరిబైటకు పంపివేయుమని ఈతీర్మానముయొక్క ఉద్దేశము కాదు. వారి నసహ్యించుకొనుటకు మనకేమి అధికారమున్నది? అట్లసహ్యించుకొనుట ఘోర అన్యాయము. మన సాంఘిక దురాచారములే, మనచెడు ప్రవర్తనలే, మన చెడుకోరికలే ఈవేశ్యలను సృజింపజేసినవి. ఈసానివీధి మనకలుషిత జీవనముయొక్క ప్రతిబింబము. మన పైశాచికాచారములయొక్క సాక్షాత్కారము. మనము ఏముఖము పెట్టుకొని వారి నసహ్యించుకొనెదము? వారి యవస్థచాల శోచనీయముగ నున్నది. వారిని మంచి మార్గమునకు తీసుకొనివచ్చుటయే మన ముఖ్యకర్తవ్యము. వారి దుర్వాసనలకు దూరముగా నూరిబైట నున్నప్పుడే బాగుపడగలరు. మనసాంఘిక దురాచారము లగ్నివంటివి. ఈయభాగ్యరాండ్రు తృణములవంటివారు. అగ్నిని శాంతింపజేయుటకు కోరినయెడల ఈతృణములను దానినుండి దూరముగా నుంచుటకు ప్రయత్నింపుడు. అప్పుడు అగ్ని దానంతటదియే చల్లారిపోవును." మోహనుడు తన్మయుడై

ఈయుపన్యాసమును వినుచుండెను. ప్రక్కనున్నవారీ యుపన్యాసము జరుగుచున్నప్పుడు కూడ నొక్కరొక్కరే లేచి వెళ్ళిపోవుటజూడ, అతనికి చాల నాశ్చర్యముగా నుండెను. వారియందు చాలవరకు, వేశ్యలను నిందించుట, వేశ్యాప్రియులను హేళన జేయుట, వినుటకు కుతూహలపడి వినుటకు వచ్చినవారే. వారికి కృష్ణశర్మయొక్క ఈయుదారత అసంగతముగ దోచుచుండెను.

౨

మోహనునకు ఉపన్యాసములు వినుటయం దిప్పుడు చాల నుత్సాహము పుట్టెను. ఎక్కడ ఉపన్యాసములు జరుగునని తెలసినను, అతడు తప్పక అక్కడ హాజరగుచుండెను. రెండుపక్షముల వాదనలు నెలంతరుబడిని విని, వాటిపై తర్కవితర్కములు జేయుచుండుట వలన అతని కిప్పుడు తన ఉద్దేశములను స్థిరపరచుకొను యోగ్యత కలుగసాగెను. ఎవరైనను క్రొత్తసంగతులు చెప్పుటతోడనె అత డిప్పుడు లొంగిపోవుటలేదు. వాటి నిజానిజములు కనుగొనుటకు ప్రయత్నించుచుండును. సాధారణముగ నుపన్యాసములయందు మాటలయాడంబరమేగాని విషయము తక్కువే యనియు, చెప్పిన యుక్తులనే మార్చిమార్చి చెప్పుచుందురనియు, అనుభవమువలన అతనికి బోధపడెను. అతనియందు సమాలోచనదృష్టి ఉత్పన్నమయ్యెను. చివరకు మోహనరావు తన పినతండ్రి పక్షమునే అవలంబించెను. అతడెల్లప్పుడును తమ పక్షముయొక్క బలమును వృద్ధిపొందించుకొనుటకే ఆతృతపడుచుండెను. ప్రతిపక్షముయొక్క మంచి నడవడిని ఆమోదించునంతటి యుదారత అతనియందు లేకుండెను.

ఈ తీర్మానమునకు వ్యతిరేకముగ నున్నవారందరును కూడ విషయ లోలురని అతని యుద్దేశము. ఈ భావము లాతనిని సానివీధివైపై నను అడుగుపెట్టకుండ జేసెను. పార్కునందుగాని, బజారునందుగాని, వేశ్యను జూచిన, వారి నక్కడనుండి తగిలివేయవలెనన్నంతకోప మాతనికి కలుగుచుండెను. అతని ఇష్టమేయైన ఎడల ఈపాటి సాని వీధిని భూమట్టము జేయించివేసి యుండును. మేళము లాడించువారు, జూచువారు కూడ అతని దృష్టికి నీచులుగ కనబడుచుండిరి. ఇటు వంటివారిని కలుసుకొన్నప్పుడు నిరసనగ మాటలాడుచుండును. అతని మనస్సునం దింకను సంశయము లున్నను, ఈ తీర్మానమును మనస్సా మోదించెను. ఇందువలన అతడు తన సంశయములను అణచివేసు కొనుటయే యుచితమని తలచెను. సంశయములను పైకి ప్రకటించిన తన పక్షము ఎక్కడ దుర్బలమగునో యని అతని సందేహము. కమల ఇంకను అతని హృదయమునుండి తొలగిపోలేదు. ఆ ప్రేమకల్పనల వలన అతని హృదయ మిప్పటికిని చలించుచునే యుండెను. కమల యొక్క సౌందర్యమూర్తి అతని దృష్టిపథమునుండి ఇంకను తొలగి పోలేదు. ఈ చింతలనుండి తప్పించుకొనుట కాతడు ఒంటరిగ కూర్చుం డుట మానివేసెను. తెల్లవారఝామువనే లేచి స్నానమునకు నదికి వెళ్లును. రాత్రి పది, పదకొండువరకు ఏదో యొక పుస్తకమును చదువుచునో, సభలకు వెళ్లుచునో, కాలము గడుపుచుండును. కాని ఇంత ప్రయత్నము చేయుచున్నప్పటికిని కమల మరపునకు రాకుం డెను. ఆమె నానా వేషములు ధరించుచు అతని హృదయ నేత్రముల ఎదుట ప్రత్యక్షమగుచుండును. ఒక్కొక్కప్పు డాతనిపై కోపగించు కొనుచున్నట్లును, ఒక్కొక్కప్పుడు బ్రతిమాలుచున్నట్లును, ఒక్కొ క్కప్పుడు ప్రేమతో అతని భుజముపై చెయ్యివేసి నవ్వుచున్నట్లును తోచి మోహామున తన్మయు డగుచుండును. కాని ఇంతలోనే అతడు

నిద్రనుండి మేల్కాంచినట్లు మనస్సును సముదాయించుకొని ఈ యాలోచనలనుండి తప్పించుకొనుచు "బాబయ్యగారిప్పు డెందు చేతనో చాల విచారముగ కనబడుచున్నారు. ఆయన ముఖమునం దొక్కసారియైనను నవ్వు కనబడుటలేదు. ఆయన కేమి సుస్తీగా నున్నదో కాని వెంకటస్వామి మందుకూడ తెచ్చుచున్నాడు". అని ఇట్లనుకొనుచుండగనె కమల ఆతని హృదయమునందు ప్రత్యక్షమయి కన్నీటిధారలతో "మోహనరావు! నీ విట్లు చేయుదువని నే నెన్నడును అనుకొనలేదు. నీవు నన్ను, నీచురాలననియు, వేశ్యననియు, అనుకొనుచున్నావేమో? కాని నే నెన్నడును నీ ఎడల వేశ్యగా ప్రవర్తింపలేదు. నీకు నా ప్రేమసంపత్తిని మాత్రమే అర్పించితిని. నీ దృష్టియందు దానికి కొంచమైనను విలువలేదా?" అని ప్రశ్నించుచున్నట్లుతోచును. వెంటనే మోహనుడు తిరిగి తెలివి తెచ్చుకొని ఆ సంగతులను మరచిపోవుటకు ప్రయత్నించుచుండును. ఆతడొక యుపన్యాసమునందు మనుష్యుని జీవితము తన చేతియందే యున్నదనియు, దానిని తన ఇష్టము వచ్చినట్లు త్రిప్పుకొన గలడనియు, దీనికి సాధనము చెడుతలంపులు, అశ్లీలపు మాటలు, మనస్సునకు తెచ్చుకొనకుండుటయే యనియు, నొకవేళ అట్టివి తోచినను, వాటిని బలవంతముగ తొలగించుకొని, ఉత్కృష్టభావములతోను, మంచి ఆలోచనలతోను మనస్సును పవిత్రముగా నుంచుకొనుటయే యనియు, అని వినియుండెను. మోహను డా సిద్ధాంతముల నెల్లప్పుడును మనస్సునం దుంచుకొనుచుండెను. వీటి మననమువలన మోహనుని మనస్సునకు సంతోషము కలుగుచుండెను. ఇందువలననే ఆతడు తన భావములను పవిత్రముగా నుంచుకొనుటకు ప్రయత్నించుచుండెను. "మన చెడుతలంపులు మనల నీజన్మమునందే గాక పునర్జన్మమునందు కూడ అధఃపతితులనుజేయు" నని వేలకొలది ప్రజ లా యుపన్యాస

మునందు వినియుండిరి కాని చాలమంది ఆ మాటల నప్పుడే మరచి పోయిరి. దరిద్రునకు బంగారము దొరకిన ప్రాణప్రదముగ రక్షించుకొనునట్లు, సరళ హృదయుడగు మోహనుడీ అమూల్యములైన ఈ విషయములను మనస్సునందు పదిలముగ నుంచుకొనెను. మోహనుడీదినములలో ఆత్మపరివర్తనమను అలలలో నీదులాడుచుండెను. త్రోవలో ఏ స్త్రీవైపైనను తన దృష్టిపడిన అతడు తన్ను దాను తిరస్కరించుకొనుచు, "క్షణమాత్రపు నేత్రానందముకొరకు నీవు నీ జీవితమును సర్వనాశనము మొనరించుకొనెదవా ?" యని తన మనస్సునకు బోధించుకొనుచుండును.

ఒకనాడు మోహనుడు నదీస్నానమునకు వెళ్లుచుండగ బజారునందు వేశ్యల సమూహము కనబడెను. వారు పాటకచేరీనుండి వచ్చుచుండిరి. మోహనుడీ దృశ్యమును జూచి చకితుడయ్యెను. ఇటువంటి లావణ్యము, సౌందర్యము, శృంగారము, ఆ తడెన్నడును జూడలేదు. జరీ పట్టుబట్టలయొక్క ఇటువంటి అనుపమదృశ్యము, శృంగారము, మెరపులవలె నిటువంటి అద్భుతరూపములు అతనికి నూతనముగ నుండెను. అతడు తనమనస్సును ఎంత నిరోధించినను ఆగినదికాదు. విద్యార్ధినెలల తరంబడిని పరిశ్రమచేసి, పరీక్షనిచ్చిన తర్వాత ఆమోదప్రమోదములలో మునుగునట్లు మోహనుడా సౌందర్యమూర్తులను నొక్కసారి తనివిదీర జూచెను. అతడొక్క పర్యాయము జూచుటవలన తనివి దీరలేదు. తాను స్నానమునకు వెళ్ళుచున్నాననుమాటయే మరచిపోయి అదే విధముగ వారివైపు జూడసాగెను. వారు దృష్టిపథమునుండి తప్పిపోవగనే నిద్రనుండి మేల్కొనినట్లు తులుక్కుపడి తనమనస్సును తిరస్కరించుకొనుచు. "నీవు నెలల తరబడిని ఆర్జించిన దానిని నొక్క క్షణములో పోగొట్టుకొంటివి. ఆహా! నేను నా ఆత్మను ఎంతపతనము గావించుకొంటిని ? నే నెంత చపలుడను!" అని విచా

రింపసాగెను. చివరకాతడు తనమనస్సును సమాధానపరుచు కొనుచు, "కేవలమీ చూపువలన పాపాత్ముడ నగుదునా? నేను వీరిని పాపపు దృష్టితో జూడలేదే? నా హృదయము, చెడుతలంపులు లేక పవిత్రముగనే యున్నది. పరమాత్ముని సౌందర్యసృష్టిని జూచి పవిత్రానందమును పొందుటయే మనకర్తవ్యము." అని అనుకొనెను.

ఇట్లాలోచించు కొనుచు ఆతడు ముందునకు నడచుచుండెను. కాని అతని మనస్సున కేమియు సంతుష్టి కలుగలేదు. తనలో "నన్ను నేనే మోసపుచ్చుకొన జూచుచున్నాను. నా వల్ల తప్పువచ్చినది. ఔను నేను అపరాధుడనే. కాని మనస్సుయొక్క ప్రస్తుతావస్థను బట్టి ఈ తప్పు క్షమార్హమని తలచెదను. నేను యోగినిగాను, సన్న్యాసినిగాను, ఒక బుద్ధిహీనుడ నగు మనుష్యమాత్రుడను. ఇంత పెద్ద ధర్మము ను ముందుంచుకొని దానిని పాలింపలేక పోవుచున్నాను. ఆహా! సౌందర్య మెటువంటి వస్తువు? చెడువర్తనము వలన ముఖవర్చస్సు పోవునని పెద్దలనెదరు. కాని ఈ స్త్రీలయొక్క చెడువర్తనము వీరి సౌందర్యమును మరియు వృద్ధిచేయుచున్నది. ముఖము హృదయముయొక్క అద్దమని చెప్పెదరు. కాని ఈ వాక్కుకూడ మిథ్యగానే దోచుచున్నది." అని ఊహించుకొను చుండెను. మోహనుడు తిరిగి మనస్సును సముదాయించుకొని ఈ సంగతులనుండి విరక్తిని బొందుటకు మరియొక విధముగ తర్కింపసాగెను. "ఔను స్త్రీలు మిక్కిలి సౌందర్యవంతులు. కోమలులు. కాని వారు తమపవిత్రగుణములను ఎట్లు దుర్వినియోగపరచు చున్నారు? వారు తమ ఆత్మలను ఎంత అధఃపతనములుగ జేసికొనుచున్నారు? కేవలమీ పట్టుబట్టల కొఱకు, మెరపు నగలకొఱకు వారు తమ ఆత్మలను అమ్ముకొను చున్నారు. ప్రేమజ్యోతిచే ప్రకాశించు కండ్లు, క్రీగంటిజూపులు, కపటముతోను, మోసముతో గూడుకొని యున్నవి నిర్మలవిశుద్ధ ప్రేమ

చే ప్రవహింపవలసిన హృదయము లెంత దుర్గంధవిషయ స్త్రభావము లచే నిండియున్నవి? ఆహా ఎంత అధోగతి?"

ఇట్లుసహ్యించు కొనుటవలన మోహనునకు కొంత మనశ్శాంతి కలిగెను. ఆ తడిట్లు తాపీగా నడచుచు నదియొద్దకు చేరెను. ఈ తర్క వితర్కములవలన ఆ రోజున మా కూలుకంటె ప్రొద్దెక్కెను. అందు వలన ఆ తడు మా మూలుగ స్నానముచేయు రేవునకు వెళ్లలేదు. అక్కడ చాల జనసమ్మర్దముగ నుండునని వితంతు శరణాలయము వైపుననున్న రేవునకు వెళ్ళెను. అక్కడ నిర్మానుష్యముగ నుండును. ఊరునకు కొంచము దూరముగ నుండుటవలన ఆ రేవున కెవ్వ రును రారు.

మోహనుడు నదియొద్దున చేరగనె ఒకస్త్రీ ఆ వైపునకు వచ్చుచుం డుట ఆ తడు జూచెను. మోహనుడామెను కమలయని వెంటనే పోలికపట్టెను. కాని ఆమె ఎంతమారి పోయినది? ఎంతచిక్కిపోయి నది? ఇప్పుడా పొడుగైన జుట్టులేదు. ఆ కోమల శరీరమే కాదు. ఆ నవ్వుచున్నటువంటి గులాబీపెదిమలే కావు. చంచలజ్యోతులవలె ప్రకా శించు ఆ కండ్లేకావు. ఇప్పుడా శృంగారములేదు. ఆ మణిమయా లంకారములు లేవు. ఆమె యొక్క తెల్లనిబట్టను మాత్రమే ధరించి యుండెను. ఆమె ప్రవర్తన యందు గంభీరతయు, ఆమె ముఖమునందు నిరాశావైరాగ్య భావములు ప్రకాశించు చుండెను. ఆమెను జూడ గనె మోహనుడు సంతోషముతో విహ్వలుడై తొందరగ ముందు నకు కొన్ని అడుగులు వేసెను. కాని ఆమె రూపాంతరమును జూచి తాను పొరబడితినేమో? ఈమె కమలగాక కమలను పోలియుండు మరియొకస్త్రీ ఐ యుండవచ్చునని అనుకొనునట్లు ఒక్కసారి వెనుకకు తగ్గెను. ఆ తని ప్రేమోత్సాహమంతయు నొక్కసారి భగ్నమయ్యెను. ఇంత మార్పెట్లు కలిగెనో ఆ తనికేమియు బోధపడకుండెను. అతడు

తిరిగి మరియొకసారి కమలవైపు జూచెను. కమలకూడ నాతనివైపు జూచెను. ఆమె దృష్టియందు ప్రేమకు బదులుగ నొకవిధమైన విచారముండెను. పూర్వపు సంగతులను మరచిపోవుటకు ప్రయత్నించు చున్నట్లును, హృదయమునం దాగి యున్న అగ్ని నిరగుల్ కొలుపుట కిష్టములేనట్లును ఆ దృష్టులయందు గోచరించు చుండెను. మోహను నకు ఆమె తనను దగాకోరునిగను, నీచునిగను స్వార్థపరునిగను తలచు చున్న దేమో యని అనుమానము కలిగెను. తన అనుమానము భ్రమయో, నిజమో తెలిసికొనుటకు అతడు తిరిగి కమలవైపు జూచెను. తిరిగి ఇద్దరికండ్లు కలుసుకొనెను. కాని కలసికలయుట తోడనె చెదరి పోయినవి. మోహనుని అనుమానము స్థిరపడిపోయెను. ఆ నిశ్చయము తోనే అభిమానము కలిగినది. అతడు తన మనస్సును ధిక్కరించు కొనుచు, "ఇప్పు డిప్పుడేకదా నన్ను నేను సముదాయించు కొంటిని. తిరిగి ఇంత వేగమే చెడు తలంపులలో పడిపోవుటయా!"

అతడు మరి కమలవైపు జూడలేదు. ఆమె తలవంచుకొని అతని ముందునుండియే వెళ్ళిపోయెను. ఆమె కాళ్లు వణకుచుండుట ఆ తడు కనిపెట్టెను. కాని అతడక్కడ నుండి యొక్క అడుగైనను కదలలేదు. ఒక్క సంజ్ఞయైనను జేయలేదు. మోహనుడు తన ఆలోచనలను స్థిర పరచుకొనుచు, "నీవు నా నుండి క్రోసుదూరము పరుగెత్తిన, నేను నూరుక్రోసులదూరము పరుగెత్తెదను." అని సగర్వముగా తలచు చుండెను గాని తాను నిర్ఘాంతపడి అక్కడ నుండి కదలలేక పోతిని గదా యనుధ్యానమే లేకుండెను.

కమల దూరముగా వెళ్లిపోయిన తర్వాత ఆమె ఎటువైపు బోవు చున్నదో తెలిసికొనుటకు ఆమె వెనుక ఆతడు మెల్లమెల్లగా పోవు చుండెను. కోరికలముందు వివేకము తలవంచవలసి వచ్చెను.

పెండ్లివారు తిరిగి వెళ్ళిపోయినప్పటినుండియు నరసింహారావు ఇల్లు దాటి పైకి రాలేదు. ఇతరుల ఎదుటపడుటకు ముఖము చెల్లక ఎల్లప్పుడును గదిలోపలనే కూర్చుండి దుఃఖించుచుండెను. దుశ్చరిత్రయగు కమల ప్రపంచ దృష్టియందు అతనిని మర్యాద విహీనునిగ జేసినందున అతడు తల నెత్తుకొన లేకుండెను. అతడీ అవమానమును భరింపలేకుండెను. అతడు నాల్గు సంవత్సరములు ఖైదునందున్నను తానింత పతితుడనైతినని అనుకొనలేదు. ఈ యనుభవ మంతయు తన పాపకర్మ ఫలమేయని అతడు తలచెను. ఈ కళంకమాతని ఆత్మగౌరవమును కూడ సర్వనాశనము జేసివైచినది. అతడిప్పుడు పూర్వపు నీచ సహవాసుల దరికికూడ వెళ్ళలేకుండెను. వారికంటె కూడ తాను నీచుడనని ఆతని యుద్దేశము. లోకులందరు తనను నిందించుచున్నారని తలచుచు "ఇతని కుమార్తెయే" అను సంగతిని తలచుకొనగనే లజ్జావిచార సాగరమున మునిగిపోవుచుండెను. "అయ్యో! ఈ దౌర్భాగ్యురాలు నా వంశమును తగులబెట్టునని ముందే తెలిసిన యెడల దీనిని బలవంతముగ గొంతుక నులిమి వేసియుందును. ఇది చాల అభిమానస్థురాలనియు, సరదాలు కలదియు, భోగములందాశక్తిగలదనియు, గొప్పయింటిలో పడిన బాగుండుననియు తలచితిని. కాని దీని మనస్సింత దుర్బలమైనదని నేనెన్నడును అనుకొనలేదు. ప్రపంచమునందెవ్వరి దినములు సరిగా వెళ్ళుచున్నవి? అందరకును ఆపదలు వచ్చుచునే యున్నవి. గొప్పగొప్ప ఇంటి స్త్రీలు కూడ కర్మవశమున అన్నవస్త్రములకు వాచిపోవుచున్నారు. కాని వారు తమ దుఃఖములను మనస్సునందే ఇముడ్చుకొను చున్నారు. వారు ఏడ్చుచు దినములు

గవుపుచున్నను, ఇతరులవద్ద తమదుఃఖములను వెలిబుచ్చరు. తమ కష్టముల నితరులతో జెప్పుకొనరు. చచ్చిపోవుట కైనను వప్పుకొనె దరు కాని ఇతరులను యాచింపరు. అటువంటివారే నిజముగ సాధ్వీ మణులు. వారు వంశమర్యాదల కొరకు జీవించి దానికొరకే ప్రాణ ముల నర్పించెదరు కాని ఈ దుష్టురాలు, ఈ దౌర్భాగ్యురాలు... దాని భర్త ఎంత పిరికివాడు? లేనిఎడల వెంటనే దాని గొంతుక నులిమివేసి యుండడా? అది ఇంటినుండి కాలు అవతల పెట్టిన తోడనె ఎందుకు గొంతుక నొక్కివేయులేదు? అతడు కూడ నీచుడు. వట్టి దురాచారి, పిరికివాడు అని తోచుచున్నది. అతనికి వంశ మర్యాదయందే అభిమానమున్న నీస్థితి రాకపోయియే యుండును. ఈ యవమానము వలన నతనికి సిగ్గు లేకపోయిన పోవుగాక. నేను మాత్రము దీనిని భరింపజాలను. కమలకు తగినశిక్ష నేను జేసెదను. దానిని ఏ చేతులతో పెంచి పెద్దదానిని జేసితినో ఆ చేతులతోనే దానిమెడ నులిపివేసెదను. దాని ఆటలు, చేష్టలు జూచి సంతోషిం చిన కళ్ళిప్పుడు, దాని రక్తమును జూచినగాని తృప్తినొందజాలవు. పోయిన మర్యాద నుద్ధరించుట కింతకన్న మరియొక యుపాయము కనబడదు. వంశమర్యాదలకు ప్రాకులాడువారు, పాపకర్ముల నెట్లు దండించుదురో దీనివలన ప్రపంచమునకు తెలియగలదు.''

ఇట్లు నిశ్చయించుకొని నరసింహారావు తన యుద్దేశములను నెర వేర్చుకొనుట కుపాయ మాలోచించు చుండెను. కైదునం దున్నప్పు డాతడు హంతకుల చరిత్రలను వినియుండెను. రాత్రింబవళ్ళు సాధా రణముగ వారిలో వారికీ చర్చలే జరుగుచుండెను. కత్తితో ఆమెను పొడిచి చంపి తాను పోలీసువారి స్వాధీన మగుటయే యుత్తమమని ఆతడు తలచెను. "మేజస్ట్రీటు ఎదుట నే నిచ్చు వాఙ్మూలమువలన ప్రజల కండ్లు విడగలవు'' మనస్సునందీ తర్కవితర్కములవలన అతడు

పులకితుడై వాంఛ్ఛాలెట్లిచ్చుటయో ఆలోచించసాగెను. మొదట నాగరికసమాజముయొక్క విలాసములను సూచించెదను. తర్వాత పోలీసువారియొక్క అత్యాచారములను వెలిబుచ్చెదను. దానితర్వాత వైవాహిక దురాచారములను వర్ణించెదను. కట్నములు, లాంచనములు, గురించి వినువారి మనస్సులకు నాటునట్లు వివరించెదను. మన వంశమర్యాదలను పోగొట్టుకొనువారము మనమే యనియు, మన పిరికితనమువలనను, ప్రాణభయమువలనను, లోకనిందభయము వలనను, సంతానప్రేమవలనను, తెలివితక్కువవలనను ఆత్మగౌరవము లేకపోవుటవలనను,ఇటువంటి పాపకార్యములను దాచుచున్నామనియు, అవి బయలుపడకుండ వాటిపై తెరను వేయుచున్నామనియు, దుర్బలాత్మలకు సాహస మెక్కువ యగుటయే దీని పరిణామమనియు, చివరకు విపులముగా వివరించి చెప్పెదను.”

నరసింహారావింతవరకు సంకల్పించినను, ముందు సుశీల సంగతి ఏమగునో యను సంగతిని ఆలోచించలేదు. ఈ యనమాన మితర చింతలకు చోటివ్వలేదు. కుమారుని మృత్యుశయ్యపై వదలిపెట్టి, శత్రువుపై కసిదీర్చుకొనుట కుద్యమించినవానివలెను, పడవపై కూర్చొని తాను వంగుటవలన పడవ మునిగిపోవును ధ్యాసము లేకయే తాను నీటియందు జూచిన పామును జంపుటకు ప్రయత్నించువానివలెను, ఇప్పు డాతని స్థితి యుండెను.

సాయంకాల మయ్యెను. ఆరోజుననే హత్య గావించుటకు నిశ్చయించుకొన్న దినము. ఇప్పు డాతని మనస్సు కొంచము విచారముగ నుండెను. భయంకరకార్యము చేయుటకు ముందు మన స్సెట్లు ఆందోళనగా నుండునో ఆవిధముగనే అతని మనస్సుండెను. కొన్నిరోజుల వరకు క్రోధావేశముచే నుప్పొంగి ఉన్మత్తమైన తర్వాత, విస్తారముగా వీచుగాలి క్రమముగా శాంతించునట్లు, ఇప్పు డాతని మనస్సు కొం

చము సిథిలమయ్యెను. మనస్సుయొక్క ఇట్టి అవస్థయందు ఉదాసీనతయే మిక్కిలి యుపకారి. ఉదాసీనత వైరాగ్యముయొక్క సూక్ష్మస్వరూపము. మనుష్యుడు తన జీవితమును గురించి ఆలోచించుకొనుటకది ఓర్పు నిచ్చును. ఆసమయమునందు పూర్వపువిషయము లన్నియు మనస్సునకు గోచరించును. నరసింహారావునకు తన జీవితమును హాయిగా గడపినప్పటి సంగతులును తాను తన కొమార్తె లిద్దరితోడను షికారు వెళ్లుచున్నప్పటి సంగతులును జ్ఞాపకమునకు వచ్చుచుండెను. తాను కమల నొకసారియు, సుశీల నొకసారియు నెత్తికొనుటయు, వారింటికి వచ్చినతోడనె జగదాంబ సంతోషముతో వారి కెదురుగా పరుగెత్తుకొని వచ్చి పిల్లల నెత్తుకొని ముద్దులాడుటయు అతని కండ్లకు కట్టినట్లుండెను. ఆనంద మనుభవించునప్పటికంటె దానిని జ్ఞాపకమునకు దెచ్చికొన్నప్పుడే ఎక్కువ సుఖప్రదముగ నుండును. మనము చూచునప్పుడు నిర్జనముగా నున్న పర్వతములు, అడవులు, నదీప్రదేశములు కొన్నిరోజుల పిమ్మట, మన స్మరణ నేత్రములకు శాంతిమయములుగను, మనోహరములుగను కనబడి తిరిగి ఆదృశ్యములను జూచుటకు కోరిక పుట్టించుచుండును. నరసింహారావు తన పూర్వజీవితమును తలచుకొని, తలచుకొని దుఃఖవివశుడయ్యెను. అతనికండ్లనుండి నీరు ధారలుగా కారసాగెను. "అయ్యో ఆ యానందమయజీవిత మీ విధముగా ఎంత విషాదమయముగ అంతమగుచున్నది? ఈచేతులతో పెంచిన నా పిల్ల నీచేతులతోనే చంపుటకు సిద్ధపడుచున్నాను."

అతనికిప్పుడు కమలపై జాలికలుగ సాగెను. "పాపమది నూతిలో పడిపోయినది. దానిపై రాళ్ళురువ్వునంతటి నిర్దయుడనా నేను? నాకండ్లకు ఆనందము కలిగించునట్టి నాకమలకే ఇంత అన్యాయము? దానిని సుఖపెట్టుటకు నే నెంత తంటాలుపడితిని!" కాని ఆదయా భావము నరసింహారావు మనస్సునం దెక్కువ కాలముండలేదు. కమల

9

వేశ్య యైనదనుమాట తలపునకు వచ్చినతోడనె ఆతని హృదయము లజ్జావిచారములతో నిండిపోయెను. ఇంతలో రామనాథము అతని వద్దకూర్చొని "నేను ప్లీడరువద్దకు వెళ్ళితిని, తప్పక దావా చెయ్యమని వారు సలహా నిచ్చినారు."

నర—(తులుకక్కువడి) ఏమి దావా?

రామ—పెండ్లిఅంతా అభాసుచేసి తిరిగివెళ్ళిపోయిన ఆపెండ్లివారిపైనే.

నర—దీనివలన నేమిలాభము?

రామ—దీనివలన వారు తిరిగివచ్చి పిల్లను చేసికొనెదరు. లేకపోయిన నష్టపరిహారమునైన నిచ్చుకొందురు.

నర—కాని దీనివలన మరింత చెడ్డపేరు రాదా?

రామ—వచ్చిన చెడ్డపేరేదో రానేవచ్చినది. ఇంకదేనికిభయము? నేను కట్నము వియమున్నై వారికి వెయ్యి రూపాయలు నిచ్చితిని. భోజనములక్రింద నాలుగైదు వందలు ఖర్చైనది. ఈసొమ్మంతా ఎందుకు వదలుకొనెదను? దీని ఒక సంసారపక్షము వానికిచ్చిన, వాడు సంతోషముతో మనపిల్లను జేసికొనుటకు వప్పుకొనును. దీనితో నామహాను భావుల ప్రతాపముకూడ కొంత బయలుపడును.

నర—(పెద్దనిట్టూర్పువిడచి) ముందు నాకు విషమిచ్చి, తర్వాత దావా దాఖలు చెయ్యండి.

రామ—మీరెందుకింత భయపడుచున్నారు.

నర—ఐతే దావా చేయుటకే నిశ్చయించినారా?

రామ—ఆఁ చేయుటకే నిశ్చయించినాను. నిన్నను చాలమంది బారిష్టరులను, ప్లీడర్లను జూచినాను వారందరు ఈ సంగతంతయు విని దావాచేసిన కేసు తప్పక గెలుచుమనని చెప్పినారు. అప్పుడే ఇద్దరు వకీళ్లకు బజానాకూడ నిచ్చినాను.

నర—(నిరాశుడై) సరే. బాగానే యున్నది. ఐతే దావా దాఖలు చెయ్యండి.

రామ—మీరీ విషయమై ఎందుకింత అసంతుష్టిగ నున్నారు?

నర—మీకు సమాధానపడనప్పుడు నేనేమి చెప్పగలను? ఇది వరకు రెండుమూడు గ్రామములకు తెలిసిన సంగతి ఇప్పుడు దేశమంతయు వెల్లడి కాగలదు. కమలను తప్పక సమను జేసి కోర్టునకు పిలపించెదరు. అప్పుడు నా గురించి వీధి వీధిని జెప్పుకొందురు.

రామ—దీనిని గురించి ఎంతని భయపడను? నాకు కూడ నిద్దరు పెండ్లి కావలసిన పిల్లలున్నారు. ఈ కళంకమును నాతలను రుద్దుకొని వారి పెండ్లిండ్లకెందుకు ఆటంకమును కలిగించుకొందును?

నర—ఐతే. మీకేమి కళంకము రాకుండుటకే నీదావా చేయుచున్నారా?

రామ—(సగర్వముతో) మీ రాలాగే అనుకోండి. పెండ్లివారు నా ఇంటినుండి తిరిగి వెళ్లిపోయినారు. కమల నా కొమార్తెయే యని లోకులు భ్రమపడవచ్చును. పట్నమంతటను నాపేరే జెప్పుకొనుచున్నారు. పదివేలకు దావా చేసెదను. ఐదువేలకైనను డిక్రీయైన, ఆసొమ్ముతో సుశీలకు గొప్ప సంబంధమును చేస్తాను. మీకు ఎరుగరా? మంచి వస్తువులో చెడువస్తువు కలసియున్నప్పుడు లోభత్వముచే దానిని తినివేయుట? ఈ సొమ్ముకొజూపని ఎడల సుశీలకు వివాహమగుట ఎట్లు? ఒక విధముగ నాకు కూడ కళంకము వచ్చినది. పూర్వము నాతో సంతోషముగా సంబంధము చేయదలచిన వారిప్పుడు పెద్దమూట చూపనిదే నాతో తిన్నగా మాట్లాడనైనను మాట్లాడరు. ఇదే పెద్ద సమస్యగా నున్నది.

నర—సరే ఐతే దావా దాఖలు చెయ్యండి.

రామనాధము వెళ్ళిపోయిన తోడనె నరసింహారావు ఆకాశము

వైపు జూచుచు "దైవమా! ఇకనైనను నన్ను తీసికొనిపో. ఈయవమానమును నేను భరింపలేను.'' అని దుఃఖింప సాగెను. ఇప్పుడాతనికి అవమానముయొక్క నిజస్థితి గోచరమయ్యెను. పామును జంపుట వలన దాని విషము పోనట్లు, కముల నిప్పును వధించినను, ఈకళంకము పోజాలదని ఇప్పుడాతనికి విదితమయ్యెను. "ఇప్పుడా కేసు జంపుట తెలివితక్కువయేగాని మరేమియు లాభములేదు. పోలీసు లెరస్టు చేయుట, నెలల తరుబడి కోర్టునకు త్రిప్పుట, ఈఅనుభవములన్నియు ఐనతర్వాత ఉరితీయుట. ఇంతకంటె ఎందులోనైనను పడిచచ్చుటయే మేలు. దేని ప్రకాశమువలన నీభయంకర దృశ్యములన్నియు కనబడు చున్నవో ఆదీపమును ఆర్పివేసెదను. అయ్యో! ఈదౌర్భాగ్యురాలు, సుశీలనుకూడ తనతో ముంచివేసినది. పరమాత్మా! నీవే ఆమెను రక్షింపగలవాడవు. యీఅనాధ బాలికకు నీవు తప్ప మరియొక ఆశ్రయములేదు. ఈకండ్లతో దాని దుర్దశను జూడజాలను. నన్ను నీప్రపంచమునుండి వేగముగా తీసికొనిపో.''

కొంతసేపైన తర్వాత నరసింహారావును భోజనమునకు పిలుచుటకు సుశీల వచ్చెను. వివాహదినము తర్వాత నేటివరకు అతడామెను జూడలేదు. అతడామెవైపు కరుణామయదృష్టితో నొక్కసారి జూచెను. ఆ మిణుకు మిణుకు మనుదీపపు వెలుతురు ఆమె ముఖమునందొక విధమైన వర్చస్సు ఆ తనికి కనబడెను. ఆమె కండ్లు నిర్మలాత్మక జ్యోతులవలె ప్రకాశించు చుండెను. శోకముగాని, మాలిన్యముగాని రవంతయు గనబడుటలేదు. మోహానుని జూచినప్పటినుండియు ఆమె హృదయము నందొకవిధమైన సంతోషానుభవము కలుగు చుండెను. ఆ హృదయమునందు నిర్మలభావములయొక్క తరంగములు పొర్లుచున్నట్లును, వాటియందు అద్భుతమైన ఆత్మబల ముదయించు చున్నట్లును ఆ మెకు తోచుచుండెను. ఇది వరకామె తనమేనత్తతో

మనస్సువిప్పి మాటలాడుటలేదు. కాని ఇప్పుడు గంటల తరబడిని ఆమెవద్ద కూర్చొని ఆమెకాళ్ళు పట్టుచు, ఆమెతో కష్టసుఖము చెప్పు చుండును. ఆమె యెడల మునుపటివలె నిర్లక్ష్యమొనర్పక ఆమెను తన తల్లివలె ప్రేమించుచుండెను. ఇప్పుడు సుశీల నీళ్ళుతోడుట, పిండి విసరుట మొదలైన కఠినపు పనులను గూడ సంతోషముతో జేయు చుండెను. ఆమె జీవితమునందిప్పుడు ప్రేమోదయమయ్యెను. మోహ నుని ఆమె కలుసుకొనలేదు. కాని అంతకన్న నుత్తమమైన వస్తువా మెకు లభించినది. అది మోహనుని ప్రేమయే.

నరసింహారావు సుశీలయొక్క ప్రఫుల్లవదనమును జూచి ఆశ్చర్య మునే గాక భయమును కూడ పొందెను. విచారముయొక్క విషము వేదన కన్నీటిద్వారా ప్రకటితముగాక, భయంకరోన్మాదరూపమును ధరించెనని అత డనుకొనెను. ఈ కఠోరవేదనకు తానే మూలకారణు డని ఆమె యనుకొనుచున్నదేమో యని అత డనుకొనుచుండెను. నరసింహారా వామెవైపు విచారదృష్టితో జూచుచు "సుశీలా!" యని పిలచెను. సుశీల "ఏందు" కను భావముతో అతనివైపు జూచెను.

నర—(కుంఠితస్వరముతో) ఇప్పటికి నాలుగు సంవత్సరములనుండి నా జీవితనౌక సుడిగుండములో పడి కొట్టుకొనుచున్నది. ఈ కష్ట కాలము నా సర్వస్వమును నాశనపరచినది. నేనిక నా సంతానము యొక్క దుర్గతిని జూడజాలను. ఇదియంతయు నా పాపకర్మఫలమే యని నాకు తెలియును. మొదటనే, నేను జాగ్రత్తపడియుండిన మీా కీ కష్టములు రాకపోయి యుండును. నేనిక చాల కాలము బ్రతుకను. నీ వెప్పుడైనను నిర్భాగ్యురాలైన కమలను కలుసుకొన్న, ఆమెను నేను క్షమించితినని జెప్పుము. ఆమె యేమి చేసినను ఆదోషమంతయు నాదే. నేటికి రెండురోజులకు పూర్వముపరకు ఆమెను చంపు ప్రయత్న ములోనె యుంటిని. కాని దైవము నన్ను పాపమునుండి రక్షించెను.

నిర్భాగ్యులైన తన తలిదండ్రుల యాత్మలను దయదలచమని ఆమెతో జెప్పె.

ఇట్లు చెప్పుచు నరసింహారావు ఆగిపోయెను సుశీల మౌనముతో నిలువబడి యుండెను. తన తండ్రియం దామెకు మిక్కిలి జాలి కలుగుచుండెను. ఒక్కక్షణమైన తర్వాత నరసింహారావు, "నేను నిన్ను కూడ నొకటి ప్రార్థించుచున్నాను."

సుశీ—ఆయాజ్ఞ ఏమిటో సెలవియ్యండి.

నర—మరేమియు లేదు. సంతోషమును మాత్ర మెన్నడును విడిచిపెట్టకు. ఈ మంత్రమువలన ఎంత కష్టసమయమునందైనను నీమనస్సు చలింపదు.

తన తండ్రి యొక్క సంగతి చెప్పదలచుకొని, సంకోచమువలన ఆ సంగతిని మార్చివేసెనని సుశీల కనిపెట్టెను. అతని మనస్సునందున్న సంగతి ఆమెవద్ద దాగలేదు. ఆమె గర్వముతో తలను పైకెత్తి స్వాభిమాన నేత్రములతో అతనివైపు జూచెను. ఆమెయొక్క ఈ విశ్వాసపూర్ణమైన దృష్టి నోటితో చెప్పుదానికంటె ఎక్కువగ తెలియజేసెను. పాతివ్రత్యమను సాధనము దొరకిన స్త్రీకి మరియొక సాధనముతో అవసరములేదు. దీనియందే సంతోషము, సుఖము, శాంతియు నన్నియు ఇమిడియున్నవి. అని ఆమె మనస్సు ప్రబోధించుచుండెను.

## ౧౦

అర్ధరాత్రి యయ్యెను. అప్పుడు నరసింహారావు ఇంటినుండి బయలుదేరెను. ప్రకృతి సుందరి వృద్ధురాలివలె పొగమంచు అను మోటు

దప్పటిని గప్పుకొని నిద్రావస్థయం దుండెను. ఆకాశమునందు చంద్రుడు ముఖమును దాచుకొని వేగముగా పరుగెత్తుచుండెను. ఎక్కడ కట్లు పోవుచున్నాడో తెలియదు.

నరసింహారావు మనస్సునం దొక తీవ్రమైన కోరిక యుండెను. ఆతనికి సుశీల నొక్కసారి చూచి పోవలెనని బుద్ధిపుట్టెను. ప్రపంచ మునందు తన ఆనందమయజీవితమునకు చిహ్నగా మిగిలినదీ వక్క వస్తువే. నిరాశయను గాఢాంధకారమునందీయొక్క జ్యోతియే అతని మనస్సును తనవైపునకు ఆకర్షించుచుండెను. ఆత డొక్క నిముషము ద్వారమువద్ద నిశ్శబ్దముగా నిలువబడి, పెద్ద నిట్టూర్పు విడచి, ముందు నకు బయలుదేరెను. జగదాంబ ఆకాశమునుండి తనను పిలుచుచున్న ట్లాతని కప్పుడు తోచెను.

నరసింహారావు మనస్సునం దిప్పుడు ఒక ఇచ్ఛగాని, అభిలాషగాని, విచారముగాని లేదు. ప్రపంచమునుండి అతని మనస్సు విరక్తిని పొందెను. ఎట్లైనను నదియొడ్డునకు వేగముగా పోయి, ఆ యగాధ జలములందు విలీనమైపోవుట కాతడు తొందరపడుచుండెను. తన సాహస మెక్కడ నమసి పోవునోయని అతనికి భయముగా నుండెను. తన సంకల్పము ను త్తేజపరచుకొనుట కాతడు పరుగెత్తసాగెను.

కాని కొంత దూరము పోయిన తర్వాత తిరిగి ఆగి ఇట్లాలో చింపసాగెను. "నీటియందు దుముకుట ఏమి కష్టము ? కాళ్లు భూమి మీదనుండి తేలిపోవగనె కథ ముగిసిపోవును." ఇట్లనుకొనగనె ఆతని హృదయ మొక్కసారి కంపించిపోయెను. అకస్మాత్తుగ అతనికి "ఎక్కడకైనను ఫికరులేకుండ ఎందుకు వెళ్ళిపోవగూడదు ?" అను ఆలోచన అతనికి తట్టెను. కాని ఈ మాటలను అతడు తన మన స్సును జేరనియ్యకుండెను. మోహ మాతనిని మోసపుచ్చలేకపోయి నది. అతడు ధార్మిక ప్రకృతి గల మనుష్యుడు కాకపోయినప్పటికి

అదృశ్యమైన ఒక అవ్యక్తభావ మాతని హృదయమును కంపింప జేయుచుండెను. అతడు తన సంకల్పమును దృఢపరుచుకొనుట కీశ్వరుడు దయాళుడనియు, కరుణాసముద్రుడనియు, తన మనస్సునకు విశ్వాసము కలిగించుకొనుచుండెను. ఆత్మ తన్ను తాను మరచిపోయినది. తన సహచరుని ఆటవస్తువును విరచిన తర్వాత నింటికిపోవుటకు భయపడుచున్న పిల్లవానివలె అతని స్థితి యుండెను.

నరసింహారా వీ ప్రకారము నాలుగుమైళ్లు ముందునకు నడచెను. గోదావరినదిని సమీపించుచున్నకొలదియు అతని హృదయావేగము హెచ్చుకాజొచ్చెను. భయముచే మన స్సస్థిరమగుచుండెను. కాని అతడు తన మనోదౌర్బల్యమును, ఆవేగమును, తిరస్కారముచే తొలగించుటకు ప్రయత్నించుచుండెను. "అయ్యో! నే నెంత సిగ్గుమాలినవాడను? ఎంత ఆత్మనూన్యుడను? ఈ ఘోరమైన దుర్దశ ననుభవించుచు కూడ చావునకు భయపడుచున్నాను. ఛీ ఛీ"

ఇంతలో అకస్మాత్తుగ ఎవరో పాట పాడుచున్నట్లు వినబడెను. అతడు ముందునకు పోవుచున్నకొలదియు, ఆధ్వని దగ్గరగా వినబడుచుండెను. ఆ పాడుచున్నాతడు అతనివైపే వచ్చుచుండెను. నిశ్శబ్దముగా నున్న ఆ రాత్రియందు నరసింహారావున కా గానము అత్యంత మధురముగ నుండెను. అతడు ఆ పాటను ధ్యానముతో వినసాగెను. ఆ పాట అంత మధురముగ లేకపోయినను శాస్త్రోక్తముగను, భక్తిరసముగను, ఉండుటవలన నరసింహారావునకు మిక్కిలి ఆనందము కలిగెను. అతనికీ శాస్త్రముయందు మంచి జ్ఞానముకలదు. ఆగానము, దహించుకొని పోవుచున్న ఆతని హృదయమునకు కొంత శాంతిని కలిగించెను.

గాన మాగిపోయినది. క్షణమైన తర్వాత దీర్ఘకాయుడు, జటాధారియు నగు ఒక సాధువు తనవైపునకు వచ్చుచుండుటను నరసింహా

రావు జూచెను. ఆసాధు వాతనిని సమీపించి, అతని పేరును, నివాస స్థలమును అడిగెను. అతని మాటలవలన, నరసింహారావు ముందునకు పోవుటకు ప్రయత్నించుచుండుటను జూచి సాధువు, "ఇటువంటి సమయమందు మీరెక్కడకు వెళ్లుచున్నారు?

నర—అటువంటి పని వచ్చినది.

సాధు—అర్ధరాత్రియందు నదియొడ్డున ఏమిపని యున్నది?

నర—(విసుగుకొనుచు) మీరు ఆత్మజ్ఞానులు కదా! మీకా మాత్రము తెలియదా?

సాధు—నా కాత్మజ్ఞానము లేదు. నేను కేవల మొక భిక్షుకుడను. ఇటువంటి సమయమందు మి మ్మెక్కడకు పోనివ్వను.

నర—మీదారిని మీరు పొండి. నావని కాటంకము కలిగించుటకు మీకేమి అధికారమున్నది?

సాధు—నా కధికారము లేకపోయిన మిమ్ముల నెందుకు ఆపెదను? మీరు నన్ను ఎరుగకపోయి యుండవచ్చును. నేను మీ యుల్లుడను. నా పేరు రామప్రసాదరావు.

నర—ఓహో, మీరు రామప్రసాదరావుగారా? ఎప్పటినుండి ఈ వేషమును ధరించినారు? మిమ్ములను కలుసుకొనవలెనని ఎన్ని రోజుల నుండియో ప్రయత్నించుచున్నాను. మీతో చాల సంగతులు మాట్లాడవలసి యున్నది.

సాధు—ఈనదియొడ్డున నొక వృక్షముక్రిందే నానివాసము. అక్కడకు దయచేసి కొంతసేపు విశ్రాంతి తీసికొనుడు. సంగతులన్నియు అక్కడ మనవిచేసెదను. త్రోవలో వారొకరితో నొకరు మాట్లాడుకొనలేదు. వేగముగా వారా వృక్షమును జేరిరి. ఒకమూల అగ్నిహోత్రము వెలుగుచుండెను. భూమిమీద నొక తుంగచాపపరచి యుండెను. దానిపై నొక మృగచర్మమును, కమండలమును, కొన్ని పుస్తకము

లును, ఉండెను.

నరసింహారావు అగ్నిహోత్రమువద్ద చలికాచుకొనుచు, రామప్రసాదుతో, "మీరు సాధువులుకదా? నిజము చెప్పండి. కమల ఈదుర్గతి కెట్లు పాల్పడినది?

రామప్రసాదు అగ్నిహోత్రపు వెలుతురులో నరసింహారావు ముఖమును పరిశీలించి చూచుచుండెను. అతనికా ముఖమునందు ఆతని హృదయమునందలి భావములన్నియు ప్రకటితము లగుచుండెను. రామప్రసాదు మునుపటి రామప్రసాదు కాడు. సత్సహవాసము, వైరాగ్యము, అతని జ్ఞానమును వికసింపజేసినవి. ఆతడు తనసంసార నాశనము గురించి ఆలోచించుకొలదియు ఆతనికి పశ్చాత్తాపమెక్కు వగుచుండెను. ఆతని అనుతప్త హృదయము కమలయెడ నుదార మగుచుండెను. ఒకసారి వెళ్ళి కమల కాళ్ళపై పడవలెనని ఆతని కప్పుడప్పుడు బుద్ధి పుట్టుచుండెను.

రా. స్వా—ఆమె నాశనమునకు నేనే కారకుడను. ఇదియంతయు నానిర్దయ అమానుష వ్యవహారములయొక్క ఫలము. ఆమె సర్వ గుణసంపన్నురాలే. నిజముగా ఆమె ఒక గొప్పయింటి యజమానురాలు కావలసినది. నావంటి దుష్టుడు, దురాత్ముడు, కఠినుడు ఆమెకు తగినవాడు కాడు. అప్పుడు నాస్థూలదృష్టి ఆమె సద్గుణములను కని పెట్టలేక పోయినది. ఆమె నాపోటు మరి పడలేకపోయినది. కాని ఆమె మనస్సుమాత్రము చెడిపోలేదు. ఆమె నన్ను ఆదరముతో జూచు చుండెడిది. కాని ఆమెయొక్క నడవడి జూచి ఆమె నావద్ద నటించు చున్నదని నాకుసందేహము కలుగసాగెను. ఆమెయొక్క సంతోషము భక్తిగాంభీర్యము నాకు దుర్బోధకములుగ నుండెను. ఆమె నావద్ద వేషములు వేయుచున్నదని తలచితిని. ఆమె చిన్నచిన్న వస్తువుల కొరకు దెబ్బలాడి, ఏడ్చి, అలిగి నన్ను ఎత్తిపొడుపు మాటలాడిన

నాకు అనుమానము లేకపోయి యుండును. ఆమె యున్నతాధర్మము లేనాకు అనుమాన హేతువులయ్యెను. క్రమముగ నాకామె నడవడిపైనిగూడ అనుమానము కలుగ సాగెను. చివరకొక రోజు రాత్రి ఆమె తన స్నేహితురాలింటికి వెళ్లి కొంచము ఆలస్యముగా వచ్చుట వలన, నాసందేహమును నిశ్చయ పరచుకొని, నేనామె నింటినుండి తగిలివేసితిని.

నర—(మాటకడ్డమువచ్చి) అప్పుడు నీబుద్ధి ఏమైనది? నువ్వు నీమూర్ఖత్వముచేత ఎంతపెద్ద కుటుంబమును కళంకిత పరచినావో నీకు కొంచెమైన జ్ఞానము లేకపోయినదా?

రామ—అప్పుడు నాబుద్ధి ఏమైపోయినదో నేనేమి చెప్పగలను? అప్పుడు నాకాయాలోచన లేకుండెను. కాని ఆమె అంతఃకరణ మాత్రము చాల శుద్ధమైనది. పాపకార్యాచరణ యందామెకు చాల అసహ్యము. ఆమెఇప్పుడు వితంతు శరణాలయము నందున్నది. అక్కడి వారందరకు ఆమె యెడల మిక్కిలి గౌరవము. ఆమె నిష్ఠానియమములను జూచిన మిక్కిలి ఆశ్చర్యము కలుగును.

రామప్రసాదు చెప్పిన మాటలను వినిన, తర్వాత నరసింహారావునకు కమలమీాది కోపము కొంత తగ్గెను. కానిసాధారణ వేగముతో ప్రవహించుచున్న జలధార ముందరి అడ్డువలన ఆగి, రెండవవైపునకు మరింత వడిగా ప్రవహించునట్లు, కమలపై ఆతని కోపము తగ్గుచున్న కొలదియు, రామప్రసాదుపై ఎక్కువగుచుండెను. ఆకలితోనున్న సింహము తన వేటజంతువు వైపెట్లు జూచునో ఆప్రకారము నరసింహారావు రామప్రసాదువైపు కోపముతో జూచుచుండెను. ఈతడే తనకుటుంబమును కలంకితపరచెననియు, కమల సర్వనాశనమునకు కారకుడనియు, తలచి, తనలో, “ఈతడిప్పుడు తనదుష్కర్మలకు సిగ్గుపడుచున్నంత మాత్రమున వదలిపెట్టుదునా? కాని ఇతడీ నంగ

తులన్నియు నాతో నెందుకు చెప్పుచున్నాడో ? బహుశా, నేనాతనిని ఏమియు చేయజాలనని అనుకొనుచున్నాడు కాబోలు ? ఇదే నిజమై యుండవచ్చు. కాని యెడల తనతప్పులన్నియు నాయెదుట ఎందుకింత నిర్భయముతో వప్పుకొనును ?" నరసింహారావు రామప్రసాదుయొక్క మనోభావములను గ్రహింపలేక పోయెను. అతడొక్క క్షణమట్లే అగ్ని వైపు జూచి, తిరిగి కఠోరస్వరముతో "రామప్రసాదు! నువ్వు నావంశమును నట్టేట గలపితివి. నాకుమార్తె ప్రాణములను దీసి దానిని సర్వనాశము జేసితివి. ఇన్ని జేసి కూడ నాయెదుట గొప్ప మహాత్ముని వలె గూర్చున్నావు. ఎందులోనైనను పడి చావలేక పోయినావా ?"

రామప్రసాదు తల పైకెత్తలేదు. మౌనముతో నేలపై బొటనవ్రేలుతో రాయుచుండెను.

నర—(తిరిగి) నీవు దరిద్రుడవగుట నీతప్పుకాదు. నీవు నీభార్యనుచితరీతి పోషింపలేక పోయినను నేను నిన్ను నిందింపను. ఆమె మనోభావములను తెలిసికొనలేక పోతివి. ఆమె సద్విచారమును గ్రహింపలేకపోతివి. దీనికికూడ నిన్ను దూషింపను. నువ్వామె నింటి నుండి తగిలివేయుటయే గొప్పతప్పు. ఆమె నెందుకు చంపివేసినావుకావు ? నీకామె ప్రవర్తన విషయమై అనుమానముగా నున్నయెడల ఆమెను వెంటనే నరికివేయువలసినది. నీకంతసాహసము లేనియెడల నువ్వే ఎందుకు చచ్చిపోయినావు కవు ? విషమైనను త్రాగలేక పోయినావా ? నీవామెను చంపివేసియుండిన ఆమెకీ దుర్దశయు, నావంశమునకీ కళంకమును, రాకపోయి యుండునే. మొగవాడినని చెప్పుకొనుటకు నీకు సిగ్గు లేదా ? నీసిగ్గుమాలిన తనమును, పిరికితనమును జూచిన నాకు చాల ససహ్యాముగా నున్నది. తనభార్య పరపురుషునితో పోవుచున్నదని తెలిసికొని ఆమె రక్తమును కళ్ళజూడని వాడు పశువుకన్న అధముడు.

కమల నింటినుండి తగిలివేసితినని జెప్పి, అనవసరపు చిక్కులలో తగులుకొంటినని ఇప్పుడాతనికి బోధపడెను. అతడు తన తెలివితక్కువ తనమునకు మనస్సులోనే విసుగుకొనుచుండెను. ఇంత తిరస్కరింప పడుదునని అతడనుకొనలేదు. ఆతడింత ఉగ్రుడై తనమనస్సు నింత గాయపరచునని కూడ ననుకొనలేదు. అనుతప్త హృదయము సానుభూతితో కూడుకొన్న తిరస్కారమును కోరును గాని, అవమాన సూచకమైన కృతఘ్నత్వమును కోరదు. పండినకురుపు కత్తికోతను సహించునుగాని, రాతిదెబ్బను సహించజాలదు. రామప్రసా దిప్పుడు తన పశ్చాత్తాపమునకు విచారమును పొందుచుండెను. తన పూర్వ పక్షమును సమర్థించుకొనుట కాతనికి ధైర్యము చాలకుండెను.

నర—(గర్జితస్వరముతో) నువ్వు దానినెందుకు చంపివేసినావు? కావు?

రా-ప్ర—(గంభీరస్వరముతో) నా హృదయమంత కఠినమైనది కాదు.

నర—ఐతే ఇంటినుండి ఎందుకు తగిలివేసినావు?

రా-ప్ర—ఆమె నప్పుడు వదలించుకొనుటకు నాకు మరియొక యుపాయము తోచినది కాదు.

నర—(ముఖమును చిట్లించుకొనుచు) విషమును త్రాగలేక పోయినావా?

రా-ప్ర—(ఈ మాటలను సహింపలేక) వ్యర్థముగా ప్రాణమును పోగొట్టుకొందునా?

నర—వ్యర్థముగా జీవించుటకంటె వ్యర్థముగా ప్రాణములను పోగొట్టుకొనుటే మేలు.

రా-ప్ర—నేను జీవించుట వ్యర్థమని మీరనజాలరు. బహుశః రామనాథముగారు మీతో జెప్పియుందురు. నేనీ యాచనావృత్తిచే

సంపాదించిన పదిహేనువందల రూపాయలు సుశీల వివాహవిషయమై నే నాతని కిచ్చితిని. మరియొక సంబంధము కుదుర్చుటకు మరియొక వెయ్యిరూపాయలు తిరిగి ఆ యనవద్దకు తీసుకొని వెళ్ళుచున్నాను.

ఇట్లు చెప్పుచు రామప్రసాదాగి పోయెను. "గొప్పగా నీ సంగతు లన్నియు ఎందుకు చెప్పుచున్నా"నను సంకోచముతో తలవంచుకొనెను.

సర—(సందిగ్ధస్వరముతో) ఆ తడీ విషయమై నాతో ఏ మియు జెప్పలేదు.

రా-ప్ర—ఇది, అతడు మీతో జెప్పవలసినంత గొప్పసంగతికాదు నే నిప్పుడు ప్రసంగవశమున జెప్పితిని. క్షమించండి. ఆత్మహత్యను జేసికొనిన ప్రపంచమున కే యుపకారమును జేయజాలము. ఈ కళంకము నా జీవితమును ప్రజ్వలింప జేసుకొన బాధ్యునిగనన్ను జేసినది. నిద్రించుచున్న ఆత్మను మేల్కొలుపుటకు మన తప్పులు ఒకవిధమైన దైవప్రేరితములే. అవియే మనకు తర్కశక్తి నిచ్చును. మనదోషముల వలన కలిగిన చెడుఫలములను అనుభవించిన తర్వాత, కలిగినంత ప్రబోధము, విద్య, సత్సాంగత్యము, ఉపదేశము, మొదలైన వానివల్ల కూడ కలుగనేరదు. దీనిని మీరు పిరికితనమే యనవచ్చును. కాని ఈ పిరికి తనమే నాకు శాంతిని, సత్కార్యములను జేయుశక్తిని, కలిగించినది. ఒకరి జీవితమును. నా శనపరచిన తర్వాత నిప్పుడు నేను వందలకొలది అనాధబాలికల జీవితములను ఉద్ధరింప యోగ్యుడనైతిని. ఈ సత్ప్రేరణ కమలపై కూడ తనప్రభావమును ప్రసరింపజేయుచున్నదని తెలిసి నాకు చాల సంతోషమైనది. ఆమె నదీస్నానము నకు వెళ్ళుచుండగనే నెన్నియో సార్లు నా కుటీరమునుండి జూచితిని. ఆమెయొక్క శ్రద్ధాభక్తులు, ధర్మనిష్టలు జూచి, నా కెంతయో ఆశ్చర్యము కలిగినది. ఆమె ముఖమునందు శుద్ధాంతఃకరణయొక్క విమల

జ్యోతి ప్రకాశించు చుండెను. ఆమె పూర్వము నేర్పరియైన గృహస్థురాలు కాదు ఇప్పుడామె విదుషీమణి. ఆమె స్త్రీసమాజమున కంతకును ఒకప్పుడు నాయకాగ్రణి కాగలదని నా నమ్మకము.

నరసింహారావు మొదట నీ మాటలన్నిటిని నిర్లక్ష్యముగా వినెను. కాని క్రమక్రమముగ ఆ మాటలయొక్క ప్రభావమాతనిని వశపరచుకొనెను. తన తప్పులకు హృదయపూర్వకముగ పశ్చాత్తాపమును పొందుచున్న వానిని నిష్కారణముగ కఠినవాక్యములచే నొప్పించితిననియు, ఆతడింత ఉపకారము జేసెనని నే నెరుగక పోతిననియు, తాను కృతఘ్నుడననియు, ఆతడిప్పుడు తెలిసికొనగలిగెను. ఈసంగతులను తెలిసికొనగానె ఆతనికండ్లు నీళ్ళతో నిండిపోయెను. సరళస్వభావముగల మనుష్యుని హృదయము మైనపువత్తివలె ఎంతవేగముగ కఠినము వహించునో అంతవేగముగ కరగిపోవును.

రామప్రసాదాతని వైపు కరుణామయదృష్టితో జూచుచు "దయచేసి ఈ రాత్రి ఇక్కడ అలసట దీర్చుకొనండి. ఈ కంబళీతో చలి ఆగును. తెల్లవారిన తర్వాత మీతో నేనుకూడ వచ్చెదను." అనెను.

నర—(నమ్రతతో) ఆలాగె. ఇక్కడ పడుకొనెదను. కంబళీ అవసరము లేదు.

రా-ప్ర—నా కంబళీ కప్పుకొన్న మీరు అపవిత్రులగుదురని మీరు తలచుచున్నారేమో! నేను దీనిని వాడుటలేదు. ప్రత్యేకముగ అతిథులకొరకే దీని నుంచితిని.

నరసింహారావు మరి అడ్డు చెప్పలేదు. చలివేయుచున్నందున కంబళీ కప్పుకొని పడుండెను. ఆతనికి వెంటనే నిద్రపట్టెను. కాని ఆ నిద్రవలన ఆతనికి శాంతికలుగలేదు. తాను జైలునందు మృత్యుశయ్యపై నున్నట్లును, జైలు అధికారాతని వైపు అసహ్యముగాజూచుచు, నీ శిక్ష ఇంతటితో పూర్తి కాలేదని" చెప్పుచున్నట్లును,

ఇంతలో జగదాంబయు, ఆతనితండ్రియు వచ్చి మంచమువద్ద నిలువబడి నట్లును, వారిముఖములు కళంకముతో కూడుకొని వికృతముగ నున్న ట్లును, జగదాంబ ఏడ్చుచు నీ వలననే మాకీ దుర్దశకలిగినది. అని నిష్టు రములాడు చున్నట్లును, ఆ తని తండ్రి కోపముచే నెఱ్ఱబడిన కండ్లతో ఆ తనివైపు జూచుచు, "మాకు కళంకము దెచ్చిపెట్టుటయే నీ జన్మ ఫలమా? ఇందుకొరకే మేము నిన్ను కని పెంచితిమా? ఈ కళంక మిక మమ్ములను ఎప్పుడును, విడువదు. మేము కల్పాంతమువరకు నీ బాధలను అనుభవింపవలసినదే. నాలుగుదినములు సౌఖ్యము కొరకు మాకీ బాధను తెచ్చిపెట్టితివి. ఇప్పుడే నీ ప్రాణములను తీసెదము." అని చెప్పుచు నొకగొడ్డలి పట్టుకొని ఆ తనివైపు దుమికినట్లును, ఆ తడు కలగని తులుక్కుపడి నిద్రనుండి లేచెను. ఆ తని గుండెలు దడ దడ కొట్టుకొనసాగెను. తా నింటినుండి ఎందుకు బయలుదేరెనో ఆసంగతిని ఆతడు నిద్రపోవుటకు ముందు మరచిపోయెను. ఇప్పుడా కల ఆతని కీవిషయమును జ్ఞప్తికి దెచ్చెను. ఆతడు తనను ధిక్కరించు కొనుచు, "నే నెంత కర్తవ్యహీనుడను! ఇది కలగాదు. నిజముగ ఆకాశ వాణియే" యని అతనికి దోచెను.

రామప్రసాదు చెప్పిన సంగతుల ప్రభావము క్రమక్రమముగ ఆతని హృదయమునుండి తొలగిపోవుచుండెను. "కమల పతివ్రతకావచ్చును. సాధ్వీమణి కావచ్చును. కాని దీనివలన నా కామె తెచ్చిపెట్టిన కళం కము పోజాలదు. పాపమునందు బాగుపరచు శక్తి కలదని ఈమహాను భావుడు చెప్పుచున్నాడు. కాని నేనుమాత్ర మాశక్తి నెక్కడను జూడలేదు. నేనుకూడ పాపమును జేసితిని. కాని ఆ శక్తి ఏ మియు కలుగలేదు. ఇది అంతయు ఆ తని మాటల చాతుర్యమే గాని మరి యొకటి కాదు. ఈ తడు తనపిరికి తనమును మాటలచాటున దాచు చున్నాడు. ఈ తడు చెప్పినదంతయు అబద్ధము. పాపమువలన

పాపము వృద్ధిపొందును. పాపమువలన పుణ్యమే వచ్చినయెడల ఈ ప్రపంచమునందు పాపాత్ములే యుండరు."

ఇట్లనుకొనుచు నరసింహారావు లేచి కూర్చుండెను. రామప్రసాదు ఆ యగ్నిప్రక్కనే పడుకొని నిద్రించుచుండెను. నరసింహారావు చడీ కాకుండ లేచి నదివైపు బయలుదేరెను. ఈ వేదనలను మరి సహింప లేక వీటిని అంత మొందించుకొనుట కాతడు నిశ్చయించుకొనెను.

అప్పుడే చంద్రు డస్తమించుచుండెను. మంచు దట్టముగా కురియు చుండెను. ఆ యంధకారమునందు చెట్లు, పుట్టలు, కొండలయొక్క తారతమ్య మేమియు కనబడుటలేదు. రాళ్ళనుండియు, ముండ్ల నుండియు, తప్పించుకొనుట యందు తత్పరుడై అతడు తన అవస్తనే మరచిపోయెను.

నదియొడ్డునకు రాగానే అతనికి చిన్న వెలుతురు కనబడెను. అతడు గట్టునుండి క్రిందకు దిగెను. నదీదేవి పొగమంచను మోటుదుప్పటిని కప్పుకొని నిట్టూర్పు విడుచుచుండెను. ఆ చుట్టుపట్లగల అంధకార మునకును, నదిలోని అంధకారమునకును ప్రవాహమే అంతరవు. అది ప్రవహించుచున్న అంధకారమువలె నుండెను. మృత్యువు తర్వాత నింటియందు విచారనిశ్శబ్దము లెట్లు వ్యాపించియుండునో అట్లప్పుడు నిశ్శబ్దముగ నుండెను.

నరసింహారా వప్పుడు మొలలోతు నీళ్ళయందు నిలువబడి తనలో "అయ్యో! ఇప్పుడు నా అంత మెంత దగ్గరగా నున్నది? ఒక్క నిముషములో నీ ప్రాణ మెక్కడకు పోవునో, అక్కడ ఏమిగతి పట్టునో, తెలియదుకదా? ప్రపంచముతో నాకు సంబంధము వదలి పోవుచున్నది. పరమేశ్వరుడా! ఇప్పుడు నీ శరణు జొచ్చుచున్నాను. నన్ను దయచూడుము. నన్ను క్షమించి ఈ పాపములనుండి ఉద్ధ రింపుము!" అని ప్రార్థించెను.

తర్వాత అతడు క్షణము ధైర్యమును పురికొల్పుకొని నీటి యందు గుభాలున పడెను. నీరు మంచువలె నుండుటవలన ఆతని శరీరము గడగడ వడకసాగెను. అతడు డగ్గె కంఠమువరకు నీటిలోనికిపోయి, ఒక్కసారి అగాడాంధకారమునంతను కలయజూచెను. ఇది జీవనసంగ్రామమునొక్క అంతిమరంగము. మనోబలాత్మాభిమానముల యొక్క చివరపరీక్ష. ఇప్పటివరకు ఆతడు చేసిన ప్రయత్నములన్నియు నీపరీక్ష కొరకే. ఇచ్ఛామాయల కిదియే ఆఖరియుద్ధము. మాయసంపూర్ణ శక్తితో తనవైపునకు లాగుచుండెను. కమల విదుషీవేషముతో కండ్ల ఎదుట గోచరమయ్యెను. సుశీల ప్రత్యక్షశోకదేవతవలె ముందునకు వచ్చెను. "ఇప్పుడు ఏమిచెడిపోయినది? నేను సాధువునై పోకూడదా? ప్రపంచమునందు నా మానమర్యాదలవిషయమై చర్చించుటకు నేనంత పేరుపడ్డవాడనా? ఎంతమంచి కన్యకలు ఈ పాపపంకిలమునందు చిక్కుకొనలేదు. ఈ ప్రపంచమునందు? కాని వీరి గురించి ఎవరికి కావలెను? ప్రపంచమునందునన్ను నలుగురు దూషించెదరనియు, పరిహసించెదరనియు అనుకొనుట ఎంత మూర్ఖత్వము?"

దీనికి ప్రతివాదము చేయవలెనని ఇచ్ఛాశక్తి ఎంతయో ప్రయత్నించెను గాని లాభము లేకపోయినది. ఒక్కమునగే తరువాయి. జీవనమృత్యువులకు ఒక్క అడుగే అంతరవున్నది. వెనుకకు ఒక్క అడుగెంత సులభము? ఎంత సరళము? ముందునకొక్క అడుగెంత కఠినము? ఎంత భయావహము?

నరసింహారావు వెనుకకు తిరిగి పోవుటకు కాలును దీసెను. మాయ తనశక్తియొక్క చమత్కారమును జూపించెను. నిజముగానిది ప్రపంచమునందు ప్రేమ కాదు. ఇదియొక అదృశ్యమైన భయము.

అప్పుడు నరసింహారావునకు తానిక వెనుకకు పోలేనని తోచెను. అతడు క్రమక్రమముగ ముందునకే త్రోసుకొని పోవుచుండెను. ఆత

డప్పుడు సహాయముకొరకు గట్టిగా కేకలువేసెను. చలిచే కొయ్యబారిన తన కాళ్లను వెనుకకు త్రిప్పుట కెంతయో ప్రయత్నించెను గాని అత డెంత ప్రయత్నించినను ముందునకే కొట్టుకొని పోవుచుండెను. కర్మగతి యిట్లున్నది.

అకస్మాత్తుగ అతనికి రామప్రసాదు పిలుచుచున్నట్లు వినబడెను నరసింహారావు పెద్దగొంతుకతో అతనికి జవాబు చెప్పెను. కాని నోటినుండి మాట పూర్తిగ రాలేదు. గాలివలన ఆరిపోయి అంధకారమునందు లీనమైన దీపమువలె ఆధ్వని అలలలో కలసిపోయెను. లజ్జా, శోక, విచారములచే మండుచున్న హృదయముయొక్క మంట, ఆ చల్లనినీటియందు శాంతిని పొందెను.

"నే నిక్కడ మునిగిపోవుచున్నాను." అను శబ్దములు మాత్రమే రామప్రసాదునకు వినబడెను. తర్వాత అలలయొక్క పై శాచికక్రీడా ధ్వనులు తప్ప మరియేమియు వినబడలేదు.

శోకాకులహృదయముతో రామప్రసాదు నదియొడ్డున చాలసేపు నిలువబడెను. ఆశబ్దములే ఆతనికి నాలుగువైపులనుండియు వినబడుచుండెను. దగ్గరనున్న కొండలు, ఎదుటి నీటి అలలు, నాల్గువైపుల వ్యాపించియున్న గాఢాంధకారము, నీ శబ్దములతోనే ప్రతిధ్వనించుచుండెను.

## ౧౧

తెల్లవారగానే ఈ శోకసమాచారము రామవరమునందు వ్యాపించెను. రామనాథమును పరామర్శించుటకు నలుగురైదుగురు పెద్దమనుష్యులు తప్ప మరి యెవ్వరును రాలేదు. స్వాభావిక మరణమైన

యెడల శత్రువులు కూడవచ్చి నాలుగైదు కన్నీటిబొట్లు విడచెదరు. కాని ఆత్మహత్య భయంకరమైనది. దీనియందు పోలీసుల యధికారముండును గనుక మిత్రులు కూడ శత్రువులవలె దూరముగానుండిరి.

రామనాథము నూతివద్ద స్నానము చేయుచుండగ రామప్రసాదు వచ్చి, ఈ సంగతిని జెప్పెను. ఈ సమాచారమువలన రామనాథమునకు దుఃఖముగాని, సానుభూతిగాని కలుగలేదు. మీదు మిక్కిలి నరసింహారావుపై కోపము కూడ వచ్చెను. పోలీసువారి భయమాతని విచారమును అణచివేసెను. ఆతడా రోజున స్నానధ్యానములందు చాల విలంబమయ్యెను. సందిగ్ధచిత్తమునకు తన పరిస్థితిని గురించి విచారించుటకు అవకాశము దొరకలేదు. దానికి సమయజ్ఞానము లేకుండెను.

కామేశ్వరమ్మ పెద్ద గొంతుకతో ఏడ్వసాగెను. ఆమె ఏడ్చుచుండుటను జూచి ఆమె కుమార్తెలిద్దరు కూడ ఏడ్చుచుండిరి. ఇరుగు పొరుగు స్త్రీలు వారిని ఓదార్చుటకు వచ్చిరి. వారికి పోలీసువారి భయము లేదు. ఆ యేడ్పులు త్వరలోనే ముగిసి, నరసింహారావు యొక్క గుణదోషముల చర్చ ప్రారంభమయ్యెను. ఆతనియందు దుర్గుణములకంటె సద్గుణములే ఎక్కువ యున్నవని అక్కడనున్నవారందరు స్థిరపరచిరి. మధ్యాహ్నము రామనాథము దాహము తీసికొనుట కింటిలోనికి వచ్చి, మాటల సందర్భమున తన భార్యవద్ద నరసింహారావును నిందించెను. కామేశ్వరమ్మ కోపముతో, “చచ్చినవాని నెందుకు నిందించెదరు?” అని మందలించెను.

రామనాథము సిగ్గుపడెను. కామేశ్వరమ్మ పైకి దుఃఖమును నటించుచున్నను, ఆతని చావునకు మనస్సులో సంతోషించుచునే యుండెను. నిజమైన దుఃఖము సుశీలకు తప్ప మరి యెవ్వరికిని లేదు. తన తండ్రి సామర్థ్యహీనుడని ఆమెకు తెలియునుగాని, ఈ ప్రపంచ

మునం దామెకు 'నా' అను వాడాతఁ డొక్కఁడేకదా ? ఆతని దురవస్థయే ఆమెను మరింత పితృభక్తురాలినిగ జేసెను. ఎటు జూచిన నిప్పు డామె నిరాధారురాలే. కాని ఈ నిరాశ ఆమె జీవితమును ఉద్దేశహీనముగ జేయలేదు. ఆమె హృదయము మరింత కోమలమయ్యెను. నరసింహారావు చివరకు జేసిన ఉపదేశ మామెకు నూతన శక్తిని కలిగించెను. అమెయం దప్పుడు ఓర్పు మూర్తీభవించినట్లుండెను. వర్షఋతువుయొక్క ఆఖరి చినుకులవలెనే మనుష్యునియొక్క తుదిమాట లెన్నడును నిష్ఫలములుకావు.

తండ్రి ఆత్మకు దుఃఖము కలిగించు మాటలను సుశీల తన నోటినుండి రానిచ్చుటలేదు. తండ్రి జీవించియున్నప్పు డామె ఆతని చెడు ప్రవర్తనను అప్పుడప్పుడు నిరసించుచుండెడిది. కాని ఇప్పుడా విషయములనైనను తన మనస్సున రానిచ్చుటలేదు. భౌతిక శరీరమునుండి విముక్తి హొందిన ఆత్మకు బాహ్యాంతర భేదము లుండవని ఆమె నమ్మకము. ఆమె కామేశ్వరమ్మను సంతోషపెట్టుటకు తన శక్తికొలది యు ప్రయత్నించుచుండెనుగాని ఆమె సుశీల నెప్పుడును నిష్ఠురము లాడుచునే యుండును. ఆమెకు కోపమువచ్చినను దానిని విషమువలె దిగమ్రింగుచుండును. ఆమె యేకాంతమునందైనను దుఃఖించుట లేదు. తాను ఏడ్చిన తన తండ్రియొక్క ఆత్మ దుఃఖపడునని ఆమె భయము. సంక్రాంతికి రామనాథము తన కుమార్తె లిద్దరకు క్రొత్తచీరలను కొని తెచ్చెను. కామేశ్వరమ్మ కూడ, పెట్టెలోనుండి, పట్టుచీరను దీసి కట్టుకొనెను గాని సుశీల మాత్రము తన మాసిన చీరతోనె యుండెను. ఆమె మనస్సు దుఃఖముతో కుములిపోవుచుండెను. కాని ఆమె తన విచారమును ముఖమునందు కొంచమైనను కనబడ నివ్వకుండెను. అక్కచెల్లెండ్రిద్దరు చీరల అంచులు బాగులేవని మూతులు ముడుచుకొని ఒకమూల కూర్చుండిరి. సుశీల ప్రసన్నవదనముతో నింటిపను

లన్నియు చక్కబెట్టుచుండెను. అది చూచి కామేశ్వరమ్మ కామె యందు జాలికలిగి తన పాతపట్టుచీరను దీసి ఆమెకు కట్టనిచ్చెను. సుశీల కొంచమైనను అడ్డుచెప్పక దానిని కట్టుకొని పిండివంట జేయుచుండెను.

ఒకనాడు సుశీల తన మేనమామయొక్క వాణీ సుతికి ఆరవేయుట మరచిపోయెను. మరునాడాతడు స్నానముచేసి కట్టుకొనుటకు జూడగ వాణీ బురదతో తడిగా నుండెను. అతడేమియు అనలేదు కాని కామేశ్వరమ్మ ముఖము వాచునట్లామెను చీవాట్లు పెట్టెను. సుశీల ఏడ్చుచు వాణీ సుతుకుచుండెను. అది చూచి రామనాధమునకు మిక్కిలి దుఃఖము కలిగెను. "మా సౌఖ్యములకొరకీ దిక్కులేని పిల్లను ఇన్ని బాధలు పెట్టుచున్నాము. దేవునియెదుట దీనికెట్లు సమాధానము చెప్పగలను?" అని ఖేదపడెను. కాని కామేశ్వరమ్మనుమాత్ర మేమియు అనలేదు. ఎట్లైన నీ అనర్థమును తొలగించవలెనని ఆతడు నిశ్చయించెను. దినవారములు ముగించి ఇప్పుడాతడు గోపాలశాస్త్రిమీద దావా తెచ్చుటయందు తత్పరుడై యుండెను. ఈ దావా గెలుచునని ప్లీడర్లాతనికి నమ్మకము కలుగునట్లు చెప్పుచుండిరి. "ఐదువేలు దావాలో గెలిచిన నేనెంత అదృష్టవంతుడను?" అని యాతడనుకొనుచుండెను. ఈ భావికల్పన లాతనిని ఉన్మత్తపరచుచు క్రొత్త కోరికలను పుట్టించుచుండెను. ఆతడీ సొమ్ముతో నొకయిల్లు కట్టించుట కాలోచించుచు మనస్సునందే ఆయింటి ప్లానును చిత్రించుకొనుచుండెను. ఈ యానంద కల్పనలలో మునిగి యాతడు సుశీలమాటయే మరచిపోయెను. కాని కామేశ్వరమ్మ పెట్టు బాధ లాతనిని మేల్కొల్పెను. రామప్రసాదిచ్చిన వెయ్యిరూపాయల నాతడు దావాఖర్చుల నిమిత్తము ప్రత్యేకముగా నొకచోట నుంచెను. ఒకనాడాతడు కామేశ్వరమ్మతో నీ సంగతులను ప్రస్తావించుచు

సుశీలకు మరియొక సంబంధము చూచు విషయమై కూడ ప్రస్తావించెను. ఈమాటలు సుశీల చెవులలో బడెను. దావా సంగతులు విని ఆమె దుఃఖించి, దావాచేయుట అనుచితమని తలచెను కాని వివాహ విషయమైన మాటలు వినినప్పుడు మాత్రమామె ఊరుకొన లేక పోయెను. ఒక ప్రబలమైన శక్తి ఆమె సిగ్గును, సంకోచమును కూడ తొలగించి వేసెను. రామనాధ ముక్కడనుండి వెళ్ళిపోగానే ఆమె కామేశ్వరమ్మవద్ద కు ... ని మెల్లగా "మామ ఇప్పుడు మీతో నేమి మాట్లాడుచు...(ు" అని యడిగెను.

కామే—(చికాకుతో) ఏమి చెప్పుతారు? తమ కష్టములకు దుఃఖ పడుచున్నారు. ఆదౌర్భాగ్యురాలు కమలయే ఇది యంతయు తెచ్చి పెట్టినది. లేకయిన నీచిక్కులన్నియు ఎందుకు సంభవించును? తిరిగి ఇప్పుడంత ... ంచి వంశములోనివాడు దొరకుట కష్టము. దగ్గర గ్రామములోనున్న ఒక సంబంధమును జూచుట కాయనఇప్పుడే వెళ్లినారు.

సుశీ—(తొం ... నుకొని) నన్నె ఏలాగైనను వదలించుకొనుటకు నేను మీకంత కష్ట ... కలుగజేయుచున్నానా? నానిమిత్త మనవసరముగ కష్టపడవద్దని మామతో చెప్పండి.

కామే—నీవాయన ప్రియ మేనకోడలవు. నీ దుఃఖమును జూచి ఆయన సహింపలేరు. 'ఇప్పటిమట్టుగు ఊరుకోండి. దావాసామ్ము వచ్చిన తర్వాత సంబంధము జూడవచ్చు' నని నేను చెప్పాను. కాని ఆయన నామాట లెప్పుడు విన్నారు?

సుశీ—నన్నక్కడ కెందుకు పంపివేయకూడదు?

కామే—(పాశ్చర్యముతో) ఎక్కడకు?

సుశీ—(సరళముగ) విష్ణువర్ధనమో, కళ్యాణపురమో.

కామే— ఏమి సత్యకాలపు మాటలాడుచున్నావు? అలాగైతే ఈ యేడుపంతాఎందుకు? వాళ్ళు నిన్ను ఇంట్లో నుండనిచ్చుటకే

వప్పుకొన్న ఎడల ఈ యల్లరంతా ఎందుకు చేస్తారు?

సుశీ—కోడలిగా ఉంచుకోకపోతే దాసీగానైనా ఉంచుకోరా?

కామే—(నిర్దయతో) ఐతే వెళ్ళిపో. నిన్నడ్డుపెట్టువారెవ్వరు? నిన్నక్కడకు తీసుకువెళ్ళి, అవమానమునుపొంది, తిరిగి నిన్ను తీసుకొని వచ్చుట మా వల్లకాదు. ఆయన వారిమీద దావా చేసి సొమ్ము పుచ్చుకొని తీరుతారు.

సుశీ—అత్తా! వాళ్ళు అభిమానస్తులే అనుకోండి. కాని నేను వెళ్ళి వారి గుమ్మమువద్ద నిలువబడితే వారికే దయ పుట్టుతుంది. వారు నన్ను గుమ్మములోనుండి తగిలివేయరని నాకు నమ్మకముగా నున్నది. శత్రువునైనను గుమ్మములోనుండి తగిలివేయుటకు సంకోచము కలుగును. నేను వాడి......

కామే—(ఈ సిగ్గుమాలిన తనమును సహింపలేక, మాట కడ్డము వచ్చి) ఛీ! నోరుమూసుకో. ఇటువంటి మాటలాడుట కు నీకు కొంచమైనా సిగ్గులేదా? నువ్వు విను, వినకపో, నేనుమా వప్పుకోను. వాళ్లు గొప్పవాళ్లైతే మాకు లక్ష్యమేమిటి? ఈలా మమ్మలని అవమానపరుస్తారా? వాళ్లిప్పుడు వచ్చి బుఱ్ఱ బద్దలుకొట్టుకున్నా వాళ్ళను మీ మామ గుమ్మములోనికైనా రానివ్వరు?

సుశీల మరిమాటలాడలేదు. లోక మేమనుకొనుచున్నను ఆమె తన్ను వివాహితురాలినిగనె తలచుచుండెను. ఒక వివాహితకన్య మరియొక ఇంటి కోడలగుట ఆమెకు సిగ్గుగాను, అసహ్యముగాను, ఉండెను. పెండ్లి ఇంకొకనెల ఉన్నప్పటినుండియు ఆమె మోహనుని రూపగుణ ప్రశంసలను వినివిని తనను ఆతనికి అర్పించుకొనెను. పెండ్లిపీటలవద్ద అతనిని తన భర్తగా భావించి చూచెను. కాని అపరిచితునివలె జూడలేదు. ఇన్నిరోజు లతని భర్తగా భావించిన తర్వాత మరియొకనిని వివాహ మాడుటయన్న ఆమెకు అసహ్యముగా

నుండెను. మోహనుని రూపమిప్పుడామె తన హృదయమునుండి పెరికివేయ జాలకుండెను. ఆతని నామె ఎన్నడును మరచిపోవజాలదు. అతడామెను గురించి కనుక్కున్నను, కనుక్కొనపోయినను, అంగీకరించినను, అంగీకరించకపోయినను అతడామె భర్తయే. వివాహమునకు మంగళసూత్ర మొక్కటియే. బంధనము కాదు మనోసంకల్పమే నిజమైన బంధనము.

సుశీల కిప్పటివరకు తానెప్పటికైనను అత్తవారింటికి వెళ్ళగలుగుదుననియు ఎప్పటికైనను భర్తయొక్క ఆశ్రయము పొందగలుగుదుననియు, ఆశగా నుండెను. కాని ఈరోజున తనవివాహము యొక్క ఆశగా పునర్వివాహముయొక్క మాటవిని ఆమెయొక్క అనురాగ హృదయము కంపింప సాగెను. ఆమె నిస్సంకోచముతో తనను అత్తవారింటికి పంపమని కామేశ్వరమ్మను తనశాయశక్తులా ప్రతిమాలెను. ఇంతకన్న ఆమె ఏమి చేయగలదు? కామేశ్వరమ్మ యొక్క నిర్దయా వ్యవేకులు జూచి ఆమెయొక్క ధైర్యమున సడల సాగెను. మనశ్శాంతి లేకుండెను. రాత్రి అందరు నిద్రించిన తర్వాత కృష్ణశర్మకు ఉత్తరము వ్రాయుటకు ప్రారంభించెను. ఇదియే ఆమె ఆఖరి ప్రయత్నము. ఇదియు నిష్ఫలమైన తన కర్తవ్యము నెరవేర్చుట కామె స్థిరపరచుకొనెను. ఆమె ఇదివరకే ఉత్తరమెట్లు రాయవలెనో ఆలోచించుకొని ఉండుట వలన కేవలము వ్రాయుటయే తర్వాయిగా నుండెను. కనుక ఆమె త్వరలోనే ఇట్లువ్రాసి ముగించెను :—

"పూజ్యులగు మామగారి పాదపద్మముల సన్నిధికి—

నేను చాల దుఃఖములో నున్నాను. నామీద దయయుంచి, మీ పాదాశ్రయము నాకొసంగుడు. తండ్రిగారు నదిలోపడి ప్రాణములు విడచిరి. మీమీద దావాచేయుట కిక్కడ ప్రయత్నములు జరుగుచున్నవి. నాపునర్వివాహ విషయమైకూడ మాటలు జరుగుచున్నవి

నా మొర మరువకుడు. ఒక వారమువరకు మీకొరకు ఎదురు చూచెదను. అటుపైని మీరీ దీనురాలి ఆర్తనాదము వినజాలరు."

ఇంతలో దోమలు కుడకుట్టుటవలన కామేశ్వరమ్మకు మెలకువ వచ్చెను. ఆమె ఒడలు విరచుకొనుచు, "ఇంతఅర్ధరాత్రివరకు మేలుకొని ఏమి చేయుచున్నావు?"

సుశీ—(నిర్భయముతో) ఉత్తరము వ్రాయుచున్నాను.

కామే—ఎవరికి?

సుశీ—మా మామగారికి.

కామే—ఏనూతిలోనైన నసుపడి చావలేక పోయినావు?

సుశీ—వారము దినములైన తర్వాత అట్లే చచ్చెదను.

కామేశ్వరమ్మ మరియేమియు మాటలాడక తిరిగి నిద్రించెను. సుశీల ఆయుత్తరమును కవరులో పెట్టి చిరునామా వ్రాసిన తర్వాత దానిని బట్టలక్రింద దాచి నిద్రించెను.

## ౧౨

కృష్ణశర్మ కాలేజీలో చదువుకొనుచున్నప్పుడే ఆతనికి ప్రథమవివాహమైనది. ఇంటరుమీడియటు ప్యాసగుసరి కతడొక బిడ్డ తండ్రికూడ నయ్యెను. పిల్లవాడుపుట్టినప్పుడు కొంచము బలముగా నున్నను, తల్లి ఇంకను బాల్యావస్థలోనె యుండుటవలన శిశుసంరక్షణ ఎట్లు చేయగలదు? అందువలన పిల్లవాడు క్రమక్రమముగ క్షీణించి సంవత్సరము పూర్తిగ నిండకముందే చనిపోయెను. తల్లికూడ సూతికజబ్బువలన మరికొన్ని నెలలు బాధపడి కొమారుని కలుసుకొన ఈ లోకమునుండి వెళ్లిపోయెను. ద్వితీయవివాహము చేసికొననని కృష్ణశర్మ నిశ్చయిం

చుకొనెనుగాని బి. యల్ ప్యాసై వకాల్తీ పుచ్చుకొనగానే తిరిగి వివాహబంధములో చిక్కుకొనవలసి వచ్చినది. సుభద్రమ్మ వివాహమై అత్తవారింటికి వచ్చి, ఇప్పటికి కేను సంవత్సరము లయ్యెను.

మొదటి రెండుమూడు సంవత్సరములలో కృష్ణశర్మకు సంతాన ధ్యానమే లేకుండెను. వదినగారా ప్రశంశ తెచ్చినప్పుడాత డామె మాటలను నవ్వి తాలక్రింద కట్టివేయుచు, "నాకు సంతానమునందు కోరికలేదు. నేనా బాధలు పడలేను" అని నవ్వుచు జవాబు చెప్పుచుండును. ఇంతవరకాతనికి సంతానము కలుగుననియే ఆశగానుండెను.

కాని నాల్గుసంవత్సరములు కాగానే సంతానము మరి కలుగదేమో యని నిరాశ కలుగసాగెను. "నిజముగ నేను సంతానవంతుండను కానా! అని అతడు విచారించుచుండెను. దినములు గడచు కొలదియు, నీ విచార మధికము కాసాగెను. ఇప్పుడాతనికి జీవితమే శూన్యముగా తోచుచుండెను. అతడు సుభద్రమ్మతో నిరాశగా మాట్లాడునప్పుడామె యూతనిని సమాధానించుచుండును కాని ఆమెకు కూడ విచారము లేకపోలేదు. కర్మఫల మనుభవింపక తప్పదని సమాధానపడుచుండును.

కృష్ణశర్మ తనలో, "సంతానము లేకపోయిన మించిపోయిన దేమి! పిల్లలు పుట్టిన దగ్గరనుండియు వారిని పాతికసంవత్సరములవరకు పెంచి పెద్దవారిని జేసి, చదువు సంధ్యలు చెప్పించి, పెండ్లి పేరంటములు చేయవలయును. ఇన్ని బాధలు పడినను బాగుపడెదరో లేదో; ఆ పిల్లలొకవేళ చనిపోయిన బ్రతికియున్నంత కాలము వారిపేరు తలచుకొని ఏడ్చెదము. ఒకవేళ మనమే చనిపోయిన వారి జీవితములు కష్టముల పాలగును. అందువలన సంతానము లేకపోవుటయే మంచిది." అని సమాధానపడుచుండును. కాని ఈ సమాధానము లాతని మనస్సునకు తృప్తిని కలిగించలేదు. ఆ తడు సుభద్రమ్మవద్ద తనభావములను దాచు

టకు ప్రయత్నించుచు, ఆమె ఈ విషయములో నిర్దోషియని తలచి ఆమెను పూర్వమువలె ప్రేమించుచుండెను. కాని హృదయమునందు నిరాశ క్రమ్ముకొని యున్నప్పుడు ముఖమునందు వికాసమెట్లు కలుగును? సుభద్రమ్మకు మనస్సునం దీ విచారమున్నను, ఆమె పతిప్రేమయందును, సేవయందును ఎప్పుడును లోపము చెయ్యలేదు. రోజులు గడచినకొలదియు ఆమె యందు కోమలత్వ మధికమగుచుండెను. ఆమె తన ప్రేమానురాగములచే సంతానాభిలాషను, అణగద్రొక్కుటకు ప్రయత్నించు చుండెను. కాని రోగియొక్క జబ్బును పాటలవలన కుదుర్చుటకు ప్రయత్నించు వైద్యునివలె ఆమె ఈ దుస్సాధ్య కార్యమునందు విఫలురాలగు చుండెను.

గృహసంబంధమైన చిన్నచిన్న విషయములనుగూడ ఆమె అనవసరముగ అతనితో జెప్పుచు, ఒక్కొక్కప్పుడు చీవాట్లుతినుచుండును. మోహనుడు వీరింటికి వచ్చిన తర్వాత అతని విషయమై ఎన్నియో సారులు ఆతని ఎదుటనే చీవాట్లు తినవలసి వచ్చెను. స్త్రీ తనభర్త చేతిదెబ్బలను సహింపగలదు గాని ఇతరుల ఎదుట ఆతని తిరస్కార దృష్టినిగూడ సహింపజాలదు. మోహనుడు తమ యింటిలోనుండుట సుభద్రమ్మకు కంటకింపుగా నుండెను. చివరకది పైకుబికినది. అప్పుడు ఎండలు తీక్షణముగానుండెను. వంటలక్క రాకపోవుటవలన ఆరోజున సుభద్రమ్మయే వండవలసివచ్చెను. ఎండవేడిమికి సాయము పొయ్యి వేడికూడ భరింపలేక ఆమె సాయంత్రము తనభర్తనిమిత్తము కుంపటి మీద బియ్యము పడవేసి, తనకు మోహనునకు పొడియన్నమును మూతపెట్టెను. కృష్ణశర్మ భోజనమునకు కూర్చొని మోహనుని కంచమునందు పొడియన్నమును జూచి కోపముతో తన కంచమాతని ముందుపెట్టి, వానికంచమును తాను పెట్టుకొనెను. అది చూచి సుభద్రమ్మకు పట్టరాని కోపమువచ్చి, భర్తను కఠినపు మాటలాడెను.

ఆతడుకూడ దానికి తగినట్లే జవాబు చెప్పెను. ఈవిధముగ మాటలు ముదిరినందున, శర్మ కోపము పట్టజాలక భోజనము చేయకుండనే లేచి వెళ్ళిపోయెను. ఆతడట్లు వెళ్ళిపోవుచున్నప్పటికైనను సుభద్రమ్మ ఆతనిని బ్రతిమాలి అడ్డుపెట్టలేదు. సుభద్రమ్మ ఆకంచమును తీసి ఒక మూల పడవేసి తానుకూడ ముసుగుపెట్టుకొని పండుకొనెను. కాని ఎంత సేపటికిని ఒకరి కోపమైనను శాంతించలేదు. మరునాడు వంట లక్క వచ్చి వంట జేసెను గాని, సుభద్రమ్మగాని, కృష్ణశర్మగాని భోజనమునకు రాలేదు. మోహనుడు భోజనమునకు రమ్మని వారి నిద్దరను మాటిమాటికిని బ్రతిమాలుచుండెను. కాని ఒక రాకలి లేదనియు, ఒకరు అలాగే భోజనం చేస్తాను. ఇంతలో మూఖం జరిగి పోదు. ఈపాటి ఆకలి కోర్చలేకపోతే ఎందుకు పనికివస్తాం అనియు జవాబు చెప్పుచుండిరి. మోహనుడే ఈకలహమునకు కారకుడైనను, సుభద్రమ్మ అతనితో నవ్వుచు మాట్లాడు చుండుట ఆశ్చర్యము.

మూడవ ఝాము తెలవది. కృష్ణశర్మ నిద్రనుండి లేచి, బద్ధకము తీర్చుకొనుచుండెను. ఆతనికి సుభద్రమ్మమీది కోపమింకను తగ్గలేదు. ఆమెతప్ప తక్కిన వారెవ్వరు జెప్పినను, వినుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో పోస్టు బంట్రోతు ఒక "నాట్ పైడ్" ఉత్తరమును దెచ్చి ఇచ్చెను. పోస్టు బంట్రోతా యుత్తరమును దెచ్చి గొప్ప అపరాధమును జేసినట్లు కృష్ణశర్మ వానివైపు కోపముతో జూచెను. దరిద్రపు పార్టీ ఎవ్వడో తన సోదెను వ్రాసుకొనెనని తలచి దానిని త్రిప్పివేయ జూచెనుగాని తిరిగి ఆలోచించి ఆయుత్తరమును విప్పి చదువసాగెను. అది సుశీల వ్రాసిన యుత్తరమే. అతడు దానినొకసారి చదివి, బల్లపై పడవేసెను. ఒకక్షణమైన తర్వాత దానిని తిరిగి చదివి, ఆలోచించుచు ఆగదియందే పచారు చేయసాగెను. అప్పుడు గోపాలశాస్త్రియే అక్కడనున్న, అతడా యుత్తరమాతనికి జూపించి, ఇది మీావంశ

మర్యాద లోకనిందా భయములయొక్క ఫలము. మీరొక మనుష్యుని ప్రాణమును దీసినారు. ఆపాపము మీకే చుట్టుకొనును. అని చెప్పి యుండును. దానాసంగతివినగనే కృష్ణశర్మకు ఒకవిధమైన ఆనందము కలిగెను. "ఈదాసు చేసిన చాల బాగుగనుండును. దానితో నీతని వంశమర్యాద గర్వము అడగిపోవును. రామనాథము తప్పక గెలువగలడు. అప్పుడీ వంశమర్యాద ఎంతప్రియమైన వస్తువో అన్నయ్యకు బాగుగ బోధపడును. పాపమా అమాయకపు బాలిక యొక్క మనస్సెంత దుఃఖపడుచున్నదో!" కృష్ణశర్మ తిరిగి ఆయుత్తరమును దీసి చదివెను. దానిలో తనయందామెకు మిక్కిలి శ్రద్ధాభక్తులున్నట్లు ఉండెను. ఈయుత్తరమాతని న్యాయప్రియత్వము నుత్తేజింప జేసెను. "పూజ్యులగు మామగారు" అను ఈయొక్క శబ్దమే అతనిని వశీభూతుని జేసికొనెను. అది ఆతని హృదయమునందలి వాత్సల్యమను తీగను నాటింప జేసెను. అతడు వెంటనే బట్టలను మార్చుకొని, నారాయణదాసింటికి బయలుదేరెను. కాని అతడింటి వద్దలేనట్లును, రామదేవుగారింటికి వెళ్ళినట్లును తెలియ వచ్చెను. వెంటనే ఆతడు బైసికిల్ మీద దేవుగారింటికి బయలుదేరెను. సుశీల విషయమై వెంటనే ఏదో వకటి నిశ్చయపరచుటకాతడాతురతపడుచుండెను. ఆలస్యమైన ఈయుద్రేకము చల్లారునని ఆతని భయము.

ఆరోజున దేవుగారింటిదగ్గర పట్నమునుండి వచ్చిన, యొక గొప్ప జలతరంగిణీ ప్రవీణుని వాయిద్యము జరుగుచుండెను. దానిని వినుట కనేకులు వచ్చియుండిరి. శర్మ వారింటికి వెళ్ళుసరికి నారాయణదాసు, ప్రొఫెసర్ శంకరరావుగార్లకు వివాదము జరుగుచుండెను. దేవు ప్రభాకరరావు, తేగాలిసాహేబు కూర్చుని ఆవివాదమును వినుచుండిరి. శర్మను జూచి, దేవు లేచి, స్వాగతమిచ్చి "రండి, రండి, చూడండి. ఇక్కడ ఘోరయుద్ధము జరుగుచున్నది. వీరి నేలాగైనను

సమాధానపరచండి. లేకపోయిన ఈవివాదము చివరకు దెబ్బలాటలోనికి కూడ దిగగలదు."

ఇంతలో శంకరరావు మాట కడ్డమువచ్చి, "థియాసఫిస్టులగుట ఏమియు తప్పువని కాదు. నేనుకూడ థియాసఫిస్టునే. ఈ సంగతి పట్నమంతా ఎరుగును. ఇప్పుడమెరికా, జర్మనీ, రష్యా మొదలగు దేశములలో రామకృష్ణులయందు భక్తి, గీతోపనిషత్తులు మొదలైన సద్గ్రంథములయందు గౌరవము, ఇవి యన్నియు మా సమాజపరిశ్రమ యొక్క ఫలితములే. మా సమాజము హిందూజాతియొక్క గౌరవమును వృద్ధిపొందించినది. దాని మహాత్మ్యమును వ్యాపింపజేసినది. మన అలసత్వమువలన ఎన్నియో శతాబ్దములనుండి అడగియున్న ఈ మతముయొక్క మహాత్మ్యమును వెల్లడింపజేసినది. జ్ఞానజ్యోతివలన అంధకారమును బాపి, మనము తెలిసికొన శక్యముకాని మహాత్త్వమును వెల్లడించిన ఈ సమాజమువారి కీర్తిని స్వీకరింపకపోయిన మనము పరమకృతఘ్నుల మగుదుము. ఈ కీర్తి బ్లావెటస్కీదైనను, మరి ఎవరిదైనను, మనకు దానితో సంబంధములేదు. ఏది మన అంధకారమును బాపినదో, దానిని స్వీకరించుట మనకర్తవ్యము. దీనిని మీరు బానిసత్వమనుట మిక్కిలి అన్యాయము."

నారాయణదాసు దీనిని సరర్థకపువాదనవలె నిర్లక్ష్యముగా విని, "దీని పేరే బానిసత్వము. కాని బానిసత్వముకూడ నొకవిధముగ స్వాతంత్ర్యమైనదే. దాని యధికారము దేహముపైననే గాని ఆత్మపైని లేదు. మీ సంఘము వారు తమ ఆత్మలనే అమ్మివేసికొనుచున్నారు. ఈ ఇంగ్లీషు చదువే మిమ్ముల నింత నీచస్థితికి దెచ్చినది. యూరోపువిద్వాంసులు ఏ విషయము గురించియైనను గుణదోషములు ప్రకటించనంతవరకు, మీరా విషయమై ఉదాసీనులుగ నుండెదరు. మీరు గీతోపనిషత్తులను, బ్లావెటస్కీ, మేక్సుముల్లరు వాటిని గౌర

వించుచున్నారనియే గౌరవించుచున్నారు. గాని అవి అమూల్య గ్రంథములని గ్రహించి గౌరవించుట లేదు. మీ యందు స్వతంత్ర శక్తి బొత్తిగా పోయినది. ఇదివరకు మీరు తాంత్రికవిద్య విష యమై ఆలోచించనే లేదు. ఇప్పటి యూరోపువిద్వాంసులు దాని రహస్యమును వెల్లడించుటకు ప్రారంభించగనె ఇప్పుడు మీకుకూడ ఆ మంత్రవిద్యయందు నమ్మకము కలుగుచున్నది. ఈ మానసిక బాని సత్వము శరీర బానిసత్వముకంటె ఎన్నియో మడుగులు నీచమైనది. మీరు పనిమత్తుల నింగ్లీషునందును, గీతను జర్మనీయందును జదువుచు, అర్జునుడనుటకు బదులు అర్జనా యనియును, సాధువను మట్రాయని యును పలుకుచు, మీ స్వభాషాజ్ఞానమును వెల్లడించుచున్నారు. మీరు మీ మానసిక బానిసత్వమువలననే చిరకాలమునుండి ఎగురు చున్న మన జాతీయ మహాపురుషుల ప్రతిభయను విజయపతాకమును పెకలించి, ఆక్షేత్రమునందు మీ పరాజయమును స్వీకరించుచున్నారు"

శంఖరరావు దీనికి జవాబు చెప్పబోవు చుండగ రామవిక్రమదేవు మాటకడ్డము వచ్చి, "స్నేహితులారా! నే నిప్పుడు మాట్లాడకుండ నూరుకొన జాలను. దానుగారు! మీరు మీ బానిసత్వమను శబ్ద మును దయచేసి ఉపసంహరించుకొనండి."

నారా—ఎందుకుపసంహరించుకొందును?

రా-దే—దీనిని ప్రయోగించుటకు మీ కధికారము లేదు.

నారా—మీ యుద్దేశమేమో నాకు బోధపడలేదు.

రా-దే—మనలో ఎవరికినిగూడ నితరులను బానిసలనుట కధికా రము లేదని నా యుద్దేశము. గ్రుడ్డివారి నగరమునందు ఎవరినెవరు గ్రుడ్డివారని పిలచెదరు! మనమందరమును గూడ దరిద్రులమైనను, ధన వంతులమైనను కూడ బానిసలమే. మనము నాగరికత లేని పల్లెటూరి రైతులమైన మనరాముని భజించెదము. మనగోవులను సంరక్షించు

కొనెదము. మన దేశీయరీతిని బట్టలను ధరించెదము. మనమాతృ భాషను మాట్లాడెదము. మన పవిత్రమైన గంగయందు స్నానము చేసెదము. అందువలన మనమంత బానిసల మనిపించుకొనము. మనము ఇంగ్లీషు చదువుకొన్నవారము, నవనాగరికులము, ఐశ్వర్య వంతులమునై, విదేశభాషను మాట్లాడుచు, దొరలవలె బట్టలను వేసి కొనుచు, కుక్కలను పెంచుచు, మనదేశస్థులను, మన ఆచారము లను నీచముగా జూచుచు. మరియూ బానిసలమగు చున్నాము. ఈ విధముగ జాతియంతయు రెండుభాగములుగ విభక్తమై యున్నది. ఇందువలన నొకరి నొకరు బానిసలని అన నక్కరలేదు. బానిసత్వ మును ఆత్మీయమనియు, మానసికమనియు, శారీరకమనియు, భాగిం చుట వట్టిభ్రాంతి. బానిసత్వము కేవల మాత్మీయము. ఈ దశలు దాని అంతర్గతములు. మోటారు, బంగాళా, టెన్నిసు, పియానా మొదలగు నవన్నియు సంకెళ్లు. ఈ సంకెళ్ళనుండి ఎవరు తప్పించు కొనగలరో వారే నిజమైన స్వతంత్రమును, ఆనందమును, అనుభవిం చగలరు. వారెవరో మీకు తెలియునా? తమ చెమటనూడ్చి కష్ట పడి సంపాదించిన దానిని తినుచు, తమ జాతీయవేషమును, భాషను, భావములను ఆదరించుచు, ఒకరి ముందు తలలు వంచక సంచరించు నిరుపేదలగు మనకృషికులే.”

ప్రభా—(నవ్వుచు) ఐతే మీరు కృషికులే కావలసినది!

రా-దే—ఐనచో నా పూర్వజన్మ పాపఫలమును అనుభవించు టెట్లు? డిన్నర్లను మొదలైనవాటి నెట్లు సమకూర్చగలను? కితా బులకొరకు డిల్లీ, శిమ్లాపికార్లెట్లు కొట్టగలను? డిన్నర్లు పార్టీలనిచ్చి దొరసానుల కుక్కలను వడిలో నెట్లు కూర్చుండ పెట్టుకొనగలను? ఇంగ్లీషు దేవతలను సంతుష్టిపరచి, ప్రసన్నుల జేసికొనుటకు దేశహిత కార్యములం దసమ్మతి నెట్లివ్వగలను? ఇవియున్నియు మానవుని

అధఃపతనమునకు ఆఖరి అవస్థలు. ఇవి అనుభవించనిదె నాకు ముక్తి కలుగదు. (కృష్ణశర్మతో) శర్మగారు! మీ తీర్మానము కొన్నిలునం దెప్పుడు వచ్చునో సెలవియ్యండి. మీరిప్పుడు చాల నిరుత్సాహముగ కనబడుచున్నారు. మన ఇతర సాంఘిక కార్యములకు పట్టిన గతియే ఈ ప్రస్తావనకు గూడ పట్టదుకద?

నిజముగ కొన్ని దినములనుండి కృష్ణశర్మ నిరుత్సాహముగానె యుండెను. విద్యార్థి పరీక్ష నిచ్చువరకు రాత్రింబవళ్లు కష్టపడి చదివి, పరీక్షయందు తీర్ణుడైన తర్వాత, తన భావిజీవితమును గురించి చింతించి చింతించి నిరుత్సాహుడగును. ఏ సాధనము వలన తానిదివరకు సఫలత నొందెనో ఆసాధనము ఈ నూతన అగమ్యక్షేత్రమునందు ఉపయోగ పడవని అప్పుడాతనికి అనుభవ మగును. కృష్ణశర్మ గూడ నిప్పుడా స్థితిలోనే యుండెను. ఈ తీర్మానము గెలుచునను ఆశ ఎక్కువగుచున్న కొలదియు, దానివలన లాభ ముండదను అపనమ్మకము కూడ ఎక్కువగుచుండెను. ఈ తీర్మానమువలన లాభమునకు బదులు మీదుమిక్కిలి నష్టమే కలుగునేమోయని అతనికి భయముగ నుండెను. కాని తన సందేహములను పైకి ప్రకటించుటకు మాత్రము సాహసము లేకుండెను.

కృ-శ—(దేవువైపు విస్వాసదృష్టితో జూచుచు) లేదండి. ఆభయ మెప్పుడూ లేదు. ఈమధ్య తీరుబడి లేక పోవుటవలన నీ పని కొంచము వెనుక బడినది.

రా-దే—ఐతే ఈతీర్మానము ప్యాసగుటకు ఏమియు అడ్డులేదుకద?

కృ-శ—(తేగాలివైపు జూచుచు) ఆసంగతి ముసల్మాన్ సోదరులపై అధారపడియున్నది.

తేగాలీ—(మర్మభావముతో) వారిపై ఆధారపడుట ఇసుకపై గోడకట్టుటయె. అక్కడ వ్యవహార మేవిధముగా నున్నదో మీ

రెరుగరు. వారు మంచి సమయములో దగా చేసిన, ఆశ్చర్యపడ నవసరము లేదు.

కృ-శ—నే నట్లను కోను.

తే-ఆవి—మీరు పొరపాటుపడుచున్నారు. ఇప్పుడు వారిలో వారు చాల తగాయిదాలు పడుచున్నారు.

ప్రబా—బలభద్రరావునాయుడుగారు ఎందుచేతనో ఈరోజున సిక్కడకు రాలేదు. అతనిని ఏలాగైనను సమాధానపరిచి వప్పించాలి.

రా-దే—నే నాతనిని ఆహ్వానించలేదు. అతడేలాగూ రాడని నాకు తెలుసును. అతడు అభిప్రాయభేదములను విరోధములుగా కూడ భావించును. సాధారణముగ మన నాయకుల స్వభావమే ఇట్టిది. ఈయొక్క విషయమునందే వారి తెలివితేటలు కనబడుచున్నవి. చిన్నచిన్న విషయములలోనైనను అభిప్రాయభేదములు వచ్చిన, తమ ప్రతికక్షులను పరమశత్రువులుగా నెంచి వారితో మాట్లాడుట మానివేయుటయే గాక, ఎదుటపడిన ముఖము చాటు వేయుదురు. ఇంతటితో తృప్తినొందక, సమయము దొరికి నప్పు డధికారులతో లేనిపోని ఖోటీలు కల్పించి చెప్పుచుందురు. నలుగురు స్నేహితులు కలసి నప్పుడు, వారి యాచారవ్యవహారములను విమర్శించుచు, తమ ప్రతికక్షుడు బ్రాహ్మణుడైన భిక్షుకుడనియు, క్షత్రియుడైన పల్లెటూరి మోటు పశువనియు, వైశ్యుడైన పిరికి పిసనారియనియు, శూద్రుడైన నౌఖరీ ముండావాడనియు, ఎత్తిపొడుచు చుందురు. సంగీతమునందభిలాషయున్న పోకిరీయనియు, భక్తిపరుడైన కపటయోగియనియు, ఎగతాళి చేయుచుందురు. చివరకు వారి తల్లిపైనను, భార్యపైనను గూడ నిందా పూరితములైన విమర్శనలు బయలుదేరును. మన ఈ మతభేదములు చాలా పాపభూయిష్టములు

వీటికి ప్రాయశ్చిత్తము లేదు...అదిగో డాక్టర్ శ్యామలరావుగారి మోటారు వచ్చుచున్నది.

డాక్టర్ శ్యామలరావు మోటారునుండి దిగి, అక్కడ కూర్చున్న పెద్దమనుష్యుల వైపు జూచుచు "I am sorry I am late" (నేను ఆలస్యముగా వచ్చినందుకు విచారించుచున్నాను.) అనెను.

రామదేవు అతనికి స్వాగతమిచ్చి సత్కరించెను. తక్కిన వారందరు కూడ అతనితో షేక్‌హేండు చేసిరి.

డాక్ట—(కుర్చీపై కూర్చుని) when is the performance going to begin? (పాట ఎప్పుడు ప్రారంభము...)

రా-దే—డాక్టరుగారు! ఇది నల్లవాళ్ల సభయని మీరు మరచి పోయారు కాబోలు?

డాక్ట—(నవ్వుచు) దేవుగారు! క్షమించండి. మీతో నీహూణ భాషమాట్లాడకూడ దనుమాట మరచి పోయాను.

రా-దే—కాని మీరా! దేవతల సభలో ఎప్పుడు ఇటువంటి తప్పు చేయరు.

డాక్ట—ఐతే దీనికి ప్రాయశ్చిత్త మేదో శలవియ్యండి.

రా-దే—మీరు మీ స్నేహితులతో మాతృభాష మాట్లాడుటయే దీనికి ప్రాయశ్చిత్తము.

డాక్ట—మీరు జమీందారులు కనుక మీ ప్రతిజ్ఞను నెరవేర్చ గలరు. కాని మేము దాని నెట్లు పాలించగలము? ఇంగ్లీషుభాషయే మా lingua franca (సార్వదేశికభాష)

రా-దే—దీనికి మీవంటి వారే ఇట్టి గౌరవమును ప్రసాదించినారు పారశీకము, కాబూలుతాలూకు మూర్ఖశిపాయిలు, హిందూవ్యాపారస్థులు కలయుటవలన ఉర్దూభాష ఉద్భవించినది. మనదేశమునందలి భిన్నభిన్నప్రాంతముల విద్వాంసు లొకరితో నొకరు మాతృభాషతో

మాట్లాడుకొనిన ఇప్పటి కేదోయొక సార్వదేశికభాష ఏర్పడియే ఉండును. మీవంటి ఆంగ్లేయభాషా భక్తులున్నంతవరకు ఈ దేశమునందు సార్వదేశికభాష ఏర్పడజాలదు. ఆంగ్లేయమువంటి ఉన్నతభాష దొరకగనే ఇప్పటివారు దానికి దాసులై పోవుచున్నారు. ఇంగ్లీషుభాష మాట్లాడుట వ్రాయుటయే తమ గౌరవమని వీరెందుకు తలచుచున్నారో నాకేమియు బోధపడుటలేదు. నేను కూడ నింగ్లీషు నేర్చుకున్నాను. రెండుసంవత్సరములు యూరోపునందుండి వచ్చినాను. మీఆంగ్లేయ పండితులతో సమానముగా మాట్లాడగలను వ్రాయగలను గాని దానియందు మాట్లాడుట జాతీయభావమునకు విరుద్ధము.

కృష్ణశర్మ ఈ వాదమునందు దేమియు పాల్గొనలేదు. సమయము దొరకగనె నారాయణదాసు నొకవైపునకు బిలచి, రహస్యముగ సుశీల యుత్తరమును జూపెను.

నారా—మీ రిప్పు డేమి చేయవలెనని ఉద్దేశించుచున్నారు.

కృష్ణ—నాకే ఆలోచనయు తోచుటలేదు. ఉత్తరము వచ్చిన దగ్గరనుండియు నేను పడికొట్టుకొనిపోవుచున్నట్లున్నాను.

నారా—ఏదోవకటి ఆలోచించి చేయక తప్పదు.

కృష్ణ—ఏమి చేయను ?

నారా—సుశీలను ఇక్కడకు తీసుకొనిరండి.

కృష్ణ—దీనితో ఇంటితో సంబంధము వదలిపోవును.

నారా—వదలిపోయిన పోవుగాక. కర్తవ్యము నెరవేర్చునప్పు డొకరికి భయపడిన నెట్లు ?

కృష్ణ—మీరు చెప్పినది నిజమేగాని నాయందంత సామర్థ్యము లేదు. అన్నగారి నప్రసన్నుల జేయుటకు నాకు సాహసము లేదు.

నారా—మీ రామెను మీ ఇంటివద్ద ఉంచుకొనకండి. విధవాశ్రమమున ఉంచండి. అప్పుడు మీ కేమియు భయ ముండదు.

కృష్ణ—ఔను. మీరు మంచి ఉపాయమే జెప్పినారు. నా కింత మాత్ర ముపాయము తోచలేదు. కష్టసమయములందు నా బుద్ధి మందగించిపోవును.

నారా—కాని మీ రేలాగైనను వెళ్ళకతప్పదు.

కృష్ణ—ఏమి ? మీరు వెళ్ళినపని జరుగదా ?

నారా—బాగానే ఉన్నది. రామనాథముగారు ఆమెను నాతో నెందుకు వంపెదరు ?

కృష్ణ—దీనివలన ఆయన కేమి నష్టము.

నారా—మీ రొకప్పుడు చిన్న పిల్లలకంటె అమాయకముగ మాట్లాడుతారు. సుశీల ఆయన కొమార్తె కాకపోవుట నిజమే కాని ఇప్పు డాతడే ఆమెకు తండ్రివంటివాడు. కనుక అత డామెను ఒక అపరిచితపు మనుష్యునితో పంపుట కెట్లొప్పుకొనును.

కృష్ణ—నే నిప్పుడు వెళ్ళిన తప్పక ఉపద్రవము కలుగకమానదు. అన్నయ్యకీ సంగతి తెలిసిన చాల కోపము వచ్చును. నన్ను చంపి వేయకమానరు. మొన్న నన్నాయన కొట్టిన దెబ్బ ఇంకా మరుపు నకు రాలేదు.

నారా—సరే. మీరు వెళ్ళవద్దు. నేనే వెళతాను. కాని రామ నాథంగారి కొక యుత్తర మివ్వండి. మీ కేమీ అభ్యంతర ముండ దనుకుంటాను.

కృష్ణ—మీరు దీనిని చులాగ్గా చెప్తూ ఉన్నారు. కాని నా కంతవరకైనా సాహసములేదు. ఐనా ఉత్తరం ఇస్తాను కాని అవ సరం వచ్చినప్పుడు దీనినుండి తప్పించుకొనుట కొక యుక్తి చెప్పండి.

నారా—(చికాకుతో) నాకటువంటి యుక్తులేమియు తెలియవు. ఏమి ధైర్యం ? మీరూ వక మనుష్యులేనా ? ఇంతటివారు లేరనునట్లు వేదిక మీద కెక్కి పెద్దపెద్ద లెక్చర్లు చెప్పడమేమిటి? తిరిగి ఈపిరికితన మేమిటి?

కృష్ణ—(సిగ్గుపడుచు) మీా రేమన్నా సరే కాని ఈ కార్య భార మంతా మీా రే వహించాలి.

నారా—సరే. ఒకతంతి నియ్యండి. లేక ఇది, కూడా మీావల్ల కాదా?

కృష్ణ—(ఉత్సాహముతో) ఆలాగే తంతి నిచ్చెదను. మీా రేదో ఉపాయం చెప్తారని నాకు మొదటినుండి ధైర్యముగానే యున్నది. ఒకవేళ ఈ సంగతి బయలుపడిన నా పేరుపెట్టి ఎవరో ఈ తంతి నిచ్చిరనియు, నా కేమి తెలియదనియు చెప్పి తప్పించుకొందును.

కాని ఒక్క నిముషములో ఆతని యుద్దేశము మారిపోయినది. ఆతడు తన పిరికితనమునకు సిగ్గుపడుచు తనలో, "నేను చేయు ధర్మ కార్యములను జూచి కోపగించుకొనుటకు అన్నయ్య అంత మూర్ఖుడు కాడు. ఒకవేళ ఆయనకు కోపమువచ్చినను నేను విచారింపకూడదు."

నారా—ఐతే. ఈ రోజునే తంతి నివ్వండి.

కృష్ణ—ఇట్లిచ్చుట కపటము చేసినట్లగునేమో?

నారా—ఔను. కావచ్చు. ఐతే మరియొక్కసారి ఆలోచించండి.

కృష్ణ—నేనే వెళ్ళినట్లైన?

నారా—ఓ! చాలా బాగుంటుంది. ఆలా చేస్తే పని కూడా నిమిషములో నెరవేరుతుంది.

కృష్ణ—బాగానే ఉన్నది. మన మిద్దరం కూడా వెళదాం.

నారా—ఐతే, ఎప్పుడు ప్రయాణం?

కృష్ణ—'సుశీలను తీసుకొని వెళ్ళుటకు వచ్చుచున్నాము' అని ఈరోజునే వారికి తంతినిచ్చెదను. ఎల్లుండి సాయంత్రం బండిమీాద బయలుదేరి వెళదాం.

నారా— నిశ్చయమేనా?

కృష్ణ—నిశ్చయమే. మీారు నా రెక్కపట్టుకొని ఈడ్చుకువెళ్లండి.

నారాయణదాసు, సరళహృదయుడగు తనమిత్రుని వైపు ప్రశంసా

దృష్టితో నొక్కసారి జూచెను. తర్వాత వారిద్దరు శ్రావ్యముగా వినబడుచున్న జలతరంగిణీ వాయిద్యమును వినుటకు లోపలకు వెళ్ళి కూర్చుండిరి.

## ౧౩

మనము ఆరోగ్యలాభము కొరకు నీలగిరి మొదలగు ఆరోగ్యకరములైన ప్రదేశములకు వెళ్ళినప్పుడు పథ్యలోపము జరుగకుండ జాగ్రత్తపడెదము. ఆరోగ్యసంపాదనయే మన ముఖ్యోద్దేశ్యము గనుక శరీర పరిశ్రమ, మొదలైనవి నియమానుసారముగ జేసెదము. కమల ఆత్మస్వాస్థ్యముకొరకు వితంతుశరణాలయము నందిప్పుడు నివసించుచున్నది. ఈసంగతామె ఒక్కక్షణమైనను మరచియుండలేదు. ఆమె వితంతుసోదరీల సేవయందును, ధర్మగ్రంథపఠనమందును నిమగ్నురాలై యుండెను. వ్రతములు, స్నాననియమాదులు, ఆమె దుఃఖితహృదయమునకు శాంతి నిచ్చుచుండెను.

నారాయణదాసు రామవరపు వృత్తాంతమును మొదట ఆమె యొద్ద దాచెను గాని సుశీలను వితంతుశరణాలయమునందుంచుటకు నిశ్చయించిన తర్వాత నీ విషయము కమలకు తెలియజేయుటయే యుచితమని తలచి, రామదేవుగారింటినుండి తిన్నగ ఆశ్రమమునకు పోయి ఈ సంగతినంతయు ఆమెకు ఉచితరీతిని తెలియబరచెను.

ఆశ్రమమంతయు నిశ్శబ్దముగా నుండెను. అర్ధరాత్రి కావచ్చినది. కాని కమలకు మాత్రము ఎంత ప్రయత్నించినను నిద్ర వచ్చుటలేదు. ఆమె కిప్పుడు తన దుర్వర్తనయొక్క నిజస్వరూపము కండ్లముందు కనబడుచుండెను. క్లోరోఫారము మత్తునుండి తెలివి వచ్చిన తర్వాత రోగి, కోయబడిన తన గాయమును జూచి మూర్ఛితుడగు నట్లిప్పుడు

కమల స్థితియుండెను. తల్లిదండ్రులు, చెల్లెలు, ఆమె యెదుట కూర్చున్నట్లును, తల్లి సిగ్గుచేతను, దుఃఖముచేతను తల వంచుకొని విచారించుచున్నట్లును, తండ్రి క్రోధోన్మత్తుడై నిప్పులురాలు కండ్లతో ఆమెవైపు జూచుచు నిలువబడినట్లును, శోకము రాశా తిరస్కారములు మూర్తీభవించినట్లు సుశీల యున్నట్లును తోచుచుండెను. ఈదృశ్యమును జూచి కమల మనస్సు చలించిపోవుచుండెను. ఆమె ఒక్కసారిగ ప్రక్క నుండి లేచి, తలను గోడకువేసి గట్టిగా కొట్టుకొన సాగెను. ఆమెకు తానొక పిశాచమువలె తోచుచుండెను. తలపై బాగుగ దెబ్బతగులుటవలన ఆమెకు మూర్ఛము తిరిగెను. ఒక్క క్షణమైన తర్వాత తెలివి వచ్చెను. తలపై తగిలిన గాయమునుండి నెత్తురు కారుచుండెను. ఆమె అప్పుడు నెమ్మదిగా తలుపు తెరచి పైకి వచ్చెను. వాకలి యంతయు గాడాంధకారముగా నుండెను. ఆమె తడబడుచు ఆ చీకటిలోనె వీధిగుమ్మమువరకు వెళ్ళెను. కాని తలుపు మూయబడి యుండెను. ఆమె తాళమును ఎన్నియోసార్లు ఆడించి జూచెను గాని లాభము లేకపోయెను. ఆప్రక్కనే కాపలావాడు నిద్రించుచుండెను. కమల నెమ్మదిగా వెళ్ళి, వాని తలక్రిందనున్న తాళపుగుత్తిని తీయుటకు ప్రయత్నించెను. ఇంతలో కాపలావాడు మేల్కొని దొంగ దొంగ యని కేకలు వేయసాగెను. కమల తత్తరపాటుతో తన గదిలోనికి పోయి తలుపు మూసుకొనెను.

తెల్లవారుఝామున నందలి చల్లగాలివలె మనస్సునందలి దుర్భర దుఃఖము కూడ శీఘ్రముగానె శాంతి పొందెను. కమల వెక్కివెక్కి యేడ్చుచు "నావంటి పిశాచిని ఈ ప్రపంచములో నుండదు. నేను భోగవిలాసములలో జిక్కుకొని నావంశమును సర్వనాశనము జేసితిని. నేను పితృహంతకురాలను. సుశీల గొంతుకను నేనే కోసితిని. నా కళంకపూరిత ముఖము నామె కెట్లు చూపుదును? ఆమె యెదుట

యెట్లు పడగలను? నాన్నగారి సంగతులన్నియు విన్నప్పు డెంత దుఃఖ పడిరో?" ఇట్లు తలచుకొన్న కొలదియు ఆమె దుఃఖ ముపొంగి పొరలిపోవు చుండెను. అన్ని కష్టములకన్న నీవేదన ఆమెకు సహింప శక్యముగాకుండెను. గోపాలశాస్త్రి ఈ సంగతు లామెతండ్రికి జెప్పుటకు బదులు ఆమె నెన్ని బాధలు పెట్టినను కమలకంత కష్టము లేకుండును. భోగముల యందలి కోరిక, నిర్దయ, అవమానము, ఆమెను సిగ్గుమాలిన దానినిగ జేయకపోయిన, ఆమె ఇంటినుండి ఎన్నటికిని లేచిపోక పోయి ఉండును. భర్తయొక్క దెబ్బలను, నిష్ఠురపు మాటలను పడుచు ఇంటియందే పడి యుండును. ఇంటినుండి లేచి పోవునప్పుడు తాను సానివీధియం దుండవలసి వచ్చునని ఆమె ఎన్నడును అనుకొనలేదు. ముందుసంగతిని ఏమియు ఆలోచించుకొనకుండనే ఆమె ఇంటినుండి వచ్చివేసినది. ఆనిరాశా విచారస్థితియందు తనతండ్రి చెల్లెలున్నారను మాటయే ఆమె మరచిపోయెను.

చాల రోజులనుండి వారిని కలుసుకొనకపోవుటవలన వారి సంగతియే ఆమెకు స్మరణకు రాకుండెను. ఈప్రపంచమునందు తానేకాకిననియు, నిస్సహాయురాలననియు, ఆమె భావించుచుండెను. తాను బంధువులకు దూరముగా నుండుటవలన తానేమిచేసినను గుప్తముగానేయుండునని ఆమె తలచియుండెను. కాని ఇప్పు డామె తిరిగి ఆత్మీయులబంధములందు తగుల్కొనవలసిన స్థితి సంభవించినది. తాను మరచిపోయినవారు తిరిగి తన ముందునకే వచ్చుటవలన, ఆమెకు పూర్వస్మృతి కలిగి సిగ్గుతోను విచారముతోను కృంగిపోవు చుండెను.

కమల మిగిలిన రాత్రియంతయు మనోవైకల్యముతో గడపి, తెల్లవారుఝామున నాలుగుగంటలుకొట్టి వీధి తలుపు తీసినతోడనే ఆమె గోదావరీ స్నానమునకు బయలుదేరెను. కమల సాధారణముగ

స్నానమునకు ఒంటరిగనె వెళ్లుచుండెను. అందువలన చౌకీదారామె నేమియు అడ్డుపెట్టలేదు. ఆమె నదిని చేరి, చుట్టుపట్ల నెవ్వరైన నున్నారేమో యని ఇటునటు ఒకసారి పరికించి జూచెను. ఆమె ఈరోజున మామూలుగా స్నానము చేయుటకు రాలేదు. నదియందు పడి ఆత్మహత్య జేసికొనుటకు వచ్చినది. ఆమె కప్పు డనుమానమును గాని, భయముగాని తత్తరపాటుగాని లేదు. ఆనుకొనినాడే సుశీల ఆశ్రమమునకు వచ్చెను. ఆమె ఎదుట పడుటకంటె నదియందు లీనమగుటయే ఆమెకు సులభము గా దోచెను.

ఇంతలో ఆకస్మాత్తుగ ఎవరో తన వైపునకు వచ్చుచుండుటను ఆమె కనిపెట్టెను. ఇంకను కనుచీకటిగా నున్నను, ఆవచ్చుచున్నవాడొక సాధువని మాత్ర మామె తెలిసికొనగలిగెను. కమల వ్రేలియందొక యుంగరముండెను ఆయుంగరము నాసాధువునకు దానముచేయవలెనని ఆమె నిశ్చయించుకొనెను. కాని ఆతడు దగ్గరకు వచ్చిన తోడనే కమల భయమువలన, ఆశ్చర్యమువలనను, సిగ్గువలనను, ముఖమును ప్రక్కకు త్రిప్పి వేసికొనెను. ఆసాధువు రామప్రసాదే. కమల అట్లే నిలవబడిపోయెను. రామప్రసా దామె కాళ్ళపై బడి, గద్గదస్వరముతో "కమలా! నాఅపరాధమును క్షమించుము" అని దీనముతో వేడికొనెను.

కమల కొంచము వెనుకకు తగ్గెను. ఆమెకు తనఅవమానముయొక్క దృశ్యము ఆమె కండ్ల ఎదుట ఆడుచుండెను. మానినగాయము రేపినట్లయ్యెను. ఆతనిని, నీవే నాపితృహంతకుడవనియు, నీవే నాజీవితనాశనకారకుడవనియు, గట్టిగా చీవాట్లుపెట్టి నిష్ఠురము లాడవలెనని ఆమెకు బుద్ధిపుట్టెను గాని రామప్రసాదుయొక్క పశ్చాత్తాపము, ఉదారమైన సానుభూతి, సాధువేషము, ఆత్మహత్యజేసికొనుటకు ముందామె కుదయించిన వైరాగ్యము, ఆమె మనస్సును కరగించెను.

కమ—(కన్నీరు కార్చుచు, కరుణాస్వరముతో) మీ అపరాధమే మియులేదు. ఇదియంతయు నా కర్మ ఫలమే.

రా-ప్ర—కాదు. కమలా! అట్లనకు. ఇదియంతయు నా మూర్ఖత యొక్కయు, అజ్ఞానముయొక్క ఫలము. దీనికి తగిన ప్రాయశ్చిత్తము చేసికొనగలనని అనుకొంటిని గాని నా అత్యాచారములయొక్క ఘోర పరిణామములను జూచిన తర్వాత దీనికి తగిన ప్రాయశ్చిత్తము లేదని నాకు బాగుగ బోధపడినది. నేనీ కండ్లతోనే పూజ్యులగు నీ తండ్రి గారు నదియందు పడి మరణించుట జూచితిని.

కమ—(ఆతృతతో) ఏమీ? మీరు నాన్నగారు మునిగిపోవు చుండగ జూచితిరా!

రా-ప్ర—కమలా! మునిగిపోవుచుండగా నే జూచితిని. నేను రాత్రి రామవరము వెళ్ళుచుండగా ట్రైనులో ఆ యన నాతో కలసిరి. ఆ యన అంత అర్ధరాత్రియందు నదివైపునకు వెళ్లుచుండుట జూచి నాకు సందేహము కలిగెను. కనుక ఆ యనను నా నివాసమునకు తీసికొని పోయి, మనశ్శాంతి కలిగించుటకు చాలప్రయత్నించి సఫలుడనైతినని తలచి నేను నిద్రించితిని. కొంతసేపైన తర్వాత లేచి చూచునరికి ఆ యన అక్కడ కనబడలేదు. వెంటనే నదియొడ్డునకు పరుగెత్తితిని. అప్పుడాతడు నన్నుగట్టిగా పిలచుచున్నట్లు వినబడెను. కాని నే నా యన ఎక్కడున్నాడో తెలిసికొన గలుగునరికి దయాహీనములైన అలలు ఆయనను మ్రింగివేసినవి. ఆ యన ఆత్మ నా కండ్లముందే స్వర్గమునకు పోయినది. నా పాపమింత ఘోరతమమైన దనియు క్షమింపరాదనియు అప్పటివరకు నాకు తెలియదు. ఈశ్వరుని ముందు నాగతి ఏమగునో!

సబ్బు మురికిని సుభ్రపరచునట్లు రామప్రసాదుయొక్క ఆత్మవేదన కమలయొక్క హృదయమాలిన్యమును తొలగించి వేసెను.

కమ—పరమేశ్వరుడు మీకు మంచిజ్ఞానమును ప్రసాదించినాడు. మీరు మీ జ్ఞానమువలన సితరులకు మేలొనరించి పాపప్రాయశ్చిత్తము జేసికొనగలరు. కాని నా గతి ఏమగును? నేను రెండులోకములకు కూడ వెలియైతిని. అయ్యో! నా భోగతృష్ణ నన్నన్ని విధముల పాడుచేసినది. ఇకనేమి దాచను! మీ దారిద్ర్యము, అంతకన్న ఎక్కువగ మీ కాఠిన్యము, నాయందసంతుష్టిని అంకురింపజేసినవి. నీచులకు గలుగుసమర్యాద, సుఖము, భోగము, జూచి ఈ అంకురము పెరిగి పెరిగి పల్లేరువలె హృదయమునంతను కప్పివేసినది. అప్పుడు దానిని తీసివేయుటకు చిన్నప్రయత్నము కూడ నాకు కష్టముగా దోచెను. మీ ప్రేమ, సహానుభూతి, నమ్రత, ఆ ముండ్లను తీసివేయ గలిగియుండును. కాని మీరు దానిని తీసివేయుటకు ప్రయత్నింపక మరింత వృద్ధిపరచిరి. బాధతో వ్యాకులపడి నేను జ్ఞానహీనురాలనైతిని. మీ యొక్క పైశాచిక వ్యాపారము జ్ఞాపకమునకు వచ్చిన, నా హృదయమునందొక విధమైన మంట బయలు దేరును. నా యంతఃకరణము నుండి మీ పై శాపములు బయలుదేరును. ఇది నా అంతిమసమయము. ఒక్క ఘడియలో ఈ పాపమయ శరీరము నదిలో మునిగిపోవును. అందువలన మీ పాపములను క్షమింపుమని దేవుని ప్రార్థించుచున్నాను.

రా. ప్ర—(విచారస్వరముతో) కమలా! ప్రాణత్యాగము వలన పాపపరిహారమైన యెడల నేనీ సరికే ఆత్మహత్య గావించుకొని యుందును.

కమ—పాపపరిహారము కాకపోయినను, చివరకీ దుఃఖములైననూ అంతమొందునుకదా?

రా. ప్ర—ఔను. నీ దుఃఖము లంత మొందవచ్చును. కాని నీ నుండి దుఃఖపడుచున్న వారి దుఃఖము లంత మొందజాలవు. నీ తల్లి దండ్రులీ భౌతికశరీరమునుండి విముక్తులైరి గాని, దేహశూన్యము

లైనవారి యాత్మలు నీసమీపముననే సంచరించుచున్నవి. ఇప్పుడా యాత్మలకు నీ సుఖమువలన సుఖమును, దుఃఖమువలన దుఃఖమును, కలుగును. ఆత్మహత్య జేసికొని వాటికి దుఃఖము కలిగించుటయో, సన్మార్గురాలవై సుఖమును, శాంతిని కలిగించుటయో బాగుగా నాలోచించుకొనుము. పశ్చాత్తాపము ఆత్మను పరిశుద్ధపరచుటకు దేవునిచే నొసగబడిన వరమువంటిది. దీని అభిప్రాయమును బోధ పరచుకొనలేక, దుఃఖావేశముచేత, ఆత్మహత్యను జేసికొనిన ఆత్మో ద్ధరణయొక్క చివరి ప్రయత్నమును నిష్ఫలమొనర్చిన వారమగు దుము. ఈ సంగతి బాగుగ నాలోచించుము. నీవు కూడ లేకపో యిన, ఆ యనాధబాలిక, సుశీల గతి ఏమగును. ఆమె ఈ ప్రపంచ సుఖదుఃఖము లెరుగని అమాయికవు బాలిక. నీవు తప్ప ఆమె కిప్పు డీ ప్రపంచమునం దెవ్వరు కలరు? రామనాధము సంగతి నీ వెరు గుదువుకదా? అత డామె కేవిధమైన నిర్వాహకమును చేయజాలడు. ఆతనియందు దయ యున్నను, లోభగుణము దాని నణచివేయు చున్నది. ఏలాగైనను ఆమె బాధ్యతను అతడు తప్పించుకొన జూచు చున్నాడు. అప్పు డామె ఎవరివద్ద నుండగలదు?

రామప్రసాదుయొక్క ఈ కథనమునందు, కమలకు నిజమైన పశ్చాత్తాపము కనబడుచుండెను. ఆమె ఆతనివైపు దీనముగా జూచుచు, “సుశీలను కలుసుకొనుటకన్నను, ప్రాణత్యాగము జేసికొనుటయే నాకు సులభముగా కనబడుచున్నది. ఈ మధ్య ఆమె కృష్ణశర్మగారి కొక యుత్తరము వ్రాసినదట. మా మేనమామ ఆమెకు మరియొక వివాహము జేయుటకు ప్రయత్నించుచున్నాడట. అది యెంత మాత్రము తన కిష్టము లేదనియు, తన్ను ఏలాగునైనను రక్షించవలసి నదనియు వ్రాసినదట.

రా. ప్ర—ఆమె నిజముగ సుశీలయే.

కమ—పాపము కృష్ణశర్మగారేమి చేసెదరు? చివరకామెను తీసుకొనివచ్చి ఆశ్రమమునం దుంచుటకు నిశ్చయించిరట. ఆయన అన్నగారు సమాధానపడిన బాగుండును. లేనియెడల సుశీల ఆశ్రమమునం దెన్నిదినము లుండవలసివచ్చునో, ఆమె రేపే ఇక్కడకు వచ్చుచున్నది. ఆమె ఎదుటపడుటకు నేను సాహసింపలేకున్నాను. ఆమె నన్ను తిరస్కారముతో జూచిన నేనెట్లు భరింపగలను? ఆమె నాతో మనసువిప్పి మాటలాడకలేకపోయిన విషము త్రాగుటకన్న నాకు మరియొక గతిలేదు. ఇన్ని పరాభవములు పడుటకన్న చచ్చిపోవుటయే యుత్తమము.

రామప్రసా దామెవైపు నిశ్చలభావముతో జూచుచు, నిటువంటి స్థితియందు తా నున్నయెడల కమలవలె తాను కూడ ఆత్మహత్య జేసికొనుటకు సిద్ధపడుదునని మనస్సునం దనుకొనెను.

రా-ప్ర—కమలా! ఈవిచారము యథార్థమైనదే కాని నీమనస్సునందు నీవెంత బాధపడినను సుశీల మంచికొరకు నీవు దానినంతనుసహింపవలసినదే. నీవలన కలిగిన మేలు ఇతరులవలన ఆమెకు కలుగదు. ఇంతవరకు నీవు నీకొరకే జీవించితివి. ఇప్పుడితరులకొరకు జీవింపవలెను.

ఇట్లు చెప్పి రామప్రసాదు తాను వచ్చిన దారినే వెళ్ళిపోయెను. కమల ఆతని మాటలను తన మనస్సునందు విమర్శించుకొనుచు నదియొడ్డున అట్లే నిలువబడిపోయెను. తర్వాత స్నానముచేసి, యుద్ధమునం దోడిపోయిన యోధునివలె తిరిగి ఆశ్రమమువైపు బయలుదేరెను.

౧౪

తాను శర్మగారికి వ్రాసిన యుత్తరమునకు జవాబు వచ్చునని సుశీలకు నమ్మకము లేదు. ఆమె వ్రాసి ఇప్పటికప్పుడే మూడు రోజులైనది.

దిన దినమునకు ఆమెకు నిరాశ ఎక్కువగు చుండెను. అనుకూలమైన జవాబు రానియెడల రామనాథమామెకు వివాహము చేసివేయును. ఈ సంగతిని తలంచుకొన్నప్పుడెల్ల సుశీలహృదయము కంపించి పోవు చుండెను. ఆమె ప్రతిదినమును తన కష్టములనెట్లైనను గట్టెక్కించ మని దైవమును ప్రార్థించుచుండెను. మోహనుని రూపమామె హృదయమును ఒక్క క్షణమైనను వదలుటలేదు. ఆమె యారూప మును కండ్లయెదుట నుంచుకొని, చేతులు జోడించి, "ప్రాణేశ్వరా! నన్నెందుకు నీదానినిగ జేసికొనవు? లోకనిందకు భయపడు చున్నావా? అయ్యో! నా జీవితమింత చులకనయ్యె పోయినదా? నన్ను త్యజించె దవా? నన్ను నిప్పులలో పడ వేసెదవా? కమల చెల్లెలనగుట నా అప రాధమా? ఇది ఎక్కడిన్యాయము? నీ వెక్కడనైనను అగుపడిన కాళ్ళకు చుట్టుకొని వదలను. అప్పుడెట్లు తప్పించుకొని పోయెదవో చూచెదను. నా కన్నీటితో కరుగక పోవుటకు నీహృదయము శిలా మయమా? ఒక్కసారి కన్నెత్తి నా స్థితిని జూచిన నీవు నిలువగలవా? లేదులేదు. నీ వెంతమాత్రము నిలువ జాలవు. నీ విశాల హృదయ మంత దయాసూన్యము కాజాలదు. కాని ఏమి చేయుదును? నాస్థితి నీకెట్లు తెలియును" అని విచారించుచుండెను.

నాల్గవరో జుదయముననె కృష్ణశర్మవద్దనుండి రామనాథమునకు తంతి వచ్చెను. ఈసంగతి వినగానె సుశీలగుండె గడగడ వణకెను. ముందుసంగతి యేమగునో యని ఆమె ఆందోళన పడసాగెను. కాని రామనాథమా తంతిని జూచిన తోడనే సంతోషభరితు డయ్యెను. అందులోనున్న రహస్య మాతనికేమి తెలియును? వియ్యాలవారిని సన్మానించుటకు బండ్లను సిద్ధపరచెను. పెండ్లివారు వచ్చుచున్నారని ఇంటివట్లను తుడిపించియు, ఇంటి సంతటిని శుభ్రపరచియు, చావడిలో తివాసులను పరపించియు రామనాథము అడావిడిగా నుండెను.

"పెండ్లి యైనను తిన్నగా కాలేదు. పిల్ల నత్తవారింటికి పంపడ మేమిటి? రామనాథ మేమయో పన్నాగము పన్నుచున్నాడ"ని గ్రామవాసు లందరు గుసగుస లాడుకొన సాగిరి. రైలువేళ కాగానే రామనాథము రైలుకు వెళ్ళి కృష్ణశర్మను తీసుకొని వచ్చెను. కృష్ణశర్మ, నారాయణదాసు, నౌకరు మాత్రమే వచ్చిరి.

మరునాడు సాయంత్రము సుశీలను పంపుటకు ముహూర్తము నిశ్చయింపబడినది. కాని వారింటి కిరుగుపొరుగు స్త్రీలెవ్వరును సుశీలను జూచుటకు రాలేదు. రామనాథము మాటిమాటికి లోపలకు వచ్చుచు, కోపముతో, "వీరిపని పట్టించెదను. పిల్లనుజూచుట కొరకైనను రావద్దా? యని ఇరుగు పొరుగువారిపై రుసరుసలాడసాగెను.

సాయంత్రమయ్యెను. బండీవచ్చి వాకట్లో నిలువ బడియుండెను. కామేశ్వరమ్మయు సుశీలను కౌగలించుకొని దుఃఖింప సాగెను.

సుశీల ఇప్పుడు తానిదివరకీ యింటియందు పడినకష్టము లన్నియు మరచిపోయెను. ఆమె హృదయమిప్పుడు ప్రేమతో నిండియుండెను. వీరితో సంబంధము వదలిపోవుచున్నది కదా యనియు, మరి ఈయింటిని జూడనుకదా యనియు తలచుకొన్న కొలదియు ఆమె హృదయము దుఃఖపూరిత మగుచుండెను. కామేశ్వరమ్మ హృదయము కూడ ఇప్పుడు అతి జాలిగాను దుఃఖముగా నుండెను. "తల్లిదండ్రులు లేని పిల్లను ఇన్నాళ్ళు కష్టపెట్టితిమిగదా" యని తలచుకొన్నప్పుడెల్ల ఆమెకండ్లు నీటితో నిండిపోవుచుండెను. ఇప్పుడు వారిద్దరి హృదయములయందు కూడ నిజమైన, నిర్మలమైన భావములుప్పొంగు చుండెను.

రామనాథము లోపలకు రాగానె సుశీల ఆయన కాళ్ళపై బడి నమస్కరించి కంటనీరు పెట్టుకొనుచు, "మీరే నాతల్లిదండ్రులు. ఈదిక్కుమాలిన పిల్లని మరచిపోకండి. నాక్షేమ మప్పుడప్పుడు కను

గొనుచుండిన అదియే మహాభాగ్యముగా సంతోషించెదను." అని పలికెను. రామనాథ మామె నోదార్చుచు, "సుశీలా! విచారపడకుము. నువ్వు నాపిల్లలలోని దానవే. నిన్ను దేవుడెప్పుడు రక్షించుగాక." యని దీవించి కన్నీళ్లు పెట్టుకొనెను.

సాయంత్రము కాగానె సుశీల సంరక్షించుచున్న ఆనంద యను ఆవు మందనుండి ఇంటికి వచ్చెను. అప్పుడామె దానిని నిమురుచు, కంట తడిపెట్టుకొనెను. ఆయావు నామె మూడు సంవత్సరములనుండి అతిప్రేమతో సంరక్షించు చుండెను. ఇకనామె దేనికి ప్రేమతో గడ్డిని తినిపించును? గవ్వలను గ్రుచ్చి దేనిమెడ నలంకరించును? ఆనంద తలవంచి ఆమె చెయ్యిని నాకుచుండెను. ఆమె వియోగ దుఃఖము దాని కండ్లయందు ప్రతిఫలించు చుండెను.

ఇంతలో వేళయగుటవలన కామేశ్వరమ్మ సుశీలను తీసుకొనివచ్చి బండిలో కూర్చుండబెట్టెను. బండీ బయలుదేరెను. అప్పుడు సుశీలకు తాను అగాధసముద్రమునందు కొట్టుకొనిపోవు చున్నట్లుండెను. గ్రామములోని స్త్రీలు గుమ్మములలో నిలువబడి సుశీల వెళ్ళిపోవుచుండగా జూచి కండ్లనీరు పెట్టుకొనిరి.

రామనాథము వారిని సేమనువరకు దిగపెట్టుటకు వెళ్ళెను. వారు బండినెక్కు సమయమున తడువంగి కృష్ణశర్మకు నమస్కరించెను. ఆతడు రామనాథమునకు ప్రతినమస్కారమును జేసెను. రైలు బయలుదేరగానె కృష్ణశర్మ నారాయణదాసుతో నిప్పుడీ నాటకముయొక్క కఠినమైన భాగమును మన మభినయింప వలసియున్నది.

నారా—మీ మాటేమిటో నాకు బోధపడుట లేదు.

కృష్ణ—సుశీలతో ఏమియు చెప్పకుండగనే ఆశ్రమములో దింపుటకంటె ముందుగా ఆమెతో దీనికి తయారగునట్లు బోధపరచి చెప్పుటయుంచిది.

నారా—ఔను. మీ యాలోచన బాగుగానే యున్నది. ఆలాగే వెళ్ళి చెప్పుదాం.

కృష్ణ—ఏలా చెప్పితే బాగుంటుందో ముందుగా ఆలోచించండి. పాపమామె తానిప్పుడత్త వారింటికే వెళ్ళుచున్నాననుకొనుచున్నది. ఈ యాశ ఆమె వియోగదుఃఖమును కూడ మరపించినది. కాని మన ఈ నటన ఆమెకు తెలిసిన ఎంతదుఃఖించునో! ముందే ఈ సంగతులన్నియు ఆమెకెందుకు చెప్పలేదని ఇప్పుడు నేను పశ్చాత్తాపమును పొందుచున్నాను

నారా—పోనీ. ఇప్పుడు చెప్పినదేమి చెడిపోవును? విశ్వేశ్వరం వద్ద రైలు చాలసేపు ఆగును. అప్పుడామెవద్దకు వెళ్ళి మెల్లిగా బోధపరచి చెప్పుతాను.

కృష్ణ—నేను చాల పొరపాటు పని చేశాను.

నారా—పశ్చాత్తాపమునకు మనవలన ఏమైననూ లాభమున్నయెడల మీ యిష్టము వచ్చినంత పశ్చాత్తాపపడండి.

కృష్ణ—మీ వద్ద పెన్సిలున్న ఒక్కసారి ఇయ్యండి సంగతంతయు ఉత్తరము ద్వారా ఆమెకు తెలియజేస్తాను.

నారా—అది కాదు. తంతినివ్వండి. చాలా బాగుంటుంది. మీరు విచిత్రపు మనుష్యుల్లా ఉన్నారు. గోటితో లాగేదానిని గొడ్డలితో పిల్లగించడానికి చూస్తూఉన్నారు.

కృష్ణ—స్థితి ఆలాగున్నది. నన్నేం చెయ్యమన్నారు. నా శోక సంగతి తోచుచున్నది. విజయపురములో మనము డూప్లికేటుకొరకు కొంతసేపాగవలసి యున్నదికదా? అక్కడే ఆమెవద్దకు వెళ్ళి ఈ సంగతంతా బోధపరచి చెప్పుదాం.

నారా—పాపం మీరీ విషయమై చాలాచిక్కులు పడుచున్నారు. అందుచేతనే ఏ సంగతే నా ముందుగా బాగా ఆలోచించనిదే చేయ

కూడదని పెద్దలు చెప్పుతారు. ఇంత తంటాలుపడిన తర్వాత యిప్పుడు మీా మనస్సు స్తిమితపడినది. ఈ సంగతి ముందుగాని తోచిన బా గుండిపోవును. సుశీల స్త్రీల ఇంటర్ క్లాసు బండీలో కూర్చుండెను. అందులో మరియిద్దరు దొరసానులు కూడ కూర్చుండిరి. వారు సుశీ లనుజూచి ఇంగ్లీషున తమలో తామిట్లు మాట్లాడుకొనిరి.

"ఈమె కొత్త పెండ్లికూతురివలె నున్నది."

"ఔను. పెద్దయింటి పిల్లవలెనున్నది. అత్తవారింటికి వెళ్లుచున్నది. కాబోలు"

"బలవంతముగా తీసుకొని పోవుచున్నట్లు ఏడ్చుచున్నదో!"

"ఇంతవరకు భర్తముఖమైనను చూచి యుండదు. అందుచేత అతనియందు ప్రేమ ఎట్లుండును. భయముచే ఆమెకండెలు కొట్టు కొని పోవుచున్నవి కాబోలు."

"ఇది వీరిలో చాల నీచమైన ఆచారము. పాపమీా బాలికను ఏమియెరుగని కొత్తయింటికి పంపివేయుదురు. అక్కడ వీరికి తెలి సినవారెవ్వరును ఉండరు."

ఇది అనాగరికుల యొక్క ఆచారము. వీరు స్త్రీలను బలవంత ముగా తీసుకొని వెళ్లెదరు."

"(సుశీలతో) ఏమమ్మాయి! నీవత్తవారింటికి వెళ్లుచున్నావా!" సుశీల నెమ్మదిగా తలయూపెను.

"నీ వింత సౌందర్యవంతురాలవు కదా. నీ భర్త కూడ నీకు తగిన వాడేనా!"

సుశీ—(గంభీరభావముతో) భర్తయొక్క సౌందర్యమే ముఖ్యము కాదు.

"ఆతడు నల్లగా అనాకారిగా నుండినట్లైన!"

సుశీ—ఆతడెట్లున్నను మాకు పూజనీయుడే.

"సరే బాగానే యున్నది. నీ ముందున కిద్దరు యువకులను తీసి కొని వచ్చెదరు. అందులో నొకడు సౌందర్యవంతుడు. రెండవవాడు కురూపియైన నీ వెవరిని ఎంచుకొనెదవు?"

సుశీ—(దృఢస్వరముతో) మా తల్లి దండ్రు లెవరిని నిర్ణయించిన వారినే. (తనలో) వీరు హిందూవివాహములను ఆక్షేపించుచున్నారు. అని తలచి కొంతసేపైన తర్వాత తిరిగి (వారితో) మీరే మీ భర్త లను స్వయముగా నెంచుకొనెదరని వినియుంటిని.

"ఔను. ఈ విషయములో మేము స్వతంత్రులమే."

సుశీ—మీ తల్లిదండ్రులకంటె మీరే తెలిసినవారని మీ యుద్దే శమా?

"వారు నిర్ణయించిన పురుషునియందు మాకు ప్రేమ యుండునో యుండదో వారికేమి తెలియును?"

సుశీ—ఐతే మీరు వివాహమునందు ప్రేమనే ముఖ్యముగా తీసి కొనెదరా?

"ఔను. వివాహము ప్రేమయొక్క బంధనము గాక మరియేమిటి?

సుశీ—మేము వివాహమును ధర్మబంధముగా తలచెదము. ధర్మము తరువాతనే ప్రేమ.

తొమ్మిదిగంటలగునరికి బండి విజయపురము చేరెను. నారాయణ దాసు వచ్చి సుశీలను బండినుండి దింపి ప్లాట్‌ఫారముమీద నొక ప్రక్కను కూర్చుండ బెట్టెను. కళ్యాణపురపు బండి బయలుదేరుట కింకను అరగంట ఆలస్యమున్నది.

ప్రయాణస్థు లందరును పెద్దపెద్దమూటలను, పెట్టెలను తలపైనను, చంకను పెట్టుకొని అవలకు వెళ్లుట కొకరినొకరు త్రోసుకొనుచుండిరి. మరియొక గుమ్మమువద్ద వందలకొలది మనుష్యులు నిలువబడి లోప లకు వచ్చుటకు త్రొక్కులాడుచుండిరి. ఇంకొక పెద్దగేటునుండి దొర

లు, దొరసానులు చేతికఱ్ఱలను త్రిప్పుకొనుచు, కుక్కలను వెంటబెట్టు కొని ఠీవిగా వచ్చుచుండిరి. వారినెవ్వరును అడ్డుపెట్టుటలేదు. ఇది అంతయుజూడ సుశీలకు మిక్కిలి ఆశ్చర్యముగానుండెను. ఇంతలో కృష్ణశర్మ ఆమెవద్దకు వచ్చి, "సుశీలా! నేను నీ పినమామగారిని కృష్ణశర్మను." సుశీల లేచినిలువబడి చేతులుజోడించి ఆతనికి నమస్కరించెను.

కృష్ణ—మేము నిన్ను విష్ణుపర్ధం మెందుకు తీసుకొని వెళ్ళుట లేదని నీవాశ్చర్య పడవచ్చును. ఇంతవరకు నీ సంగతి అన్నయ్యతో చెప్పక పోవుటయే దీనికి కారణము. నీ యుత్తర మందిన తత్క్షణమే నిన్ను వెంటనే తీసుకొని రాకపోయిన, ఏమి ప్రమాదము సంభవించునో యని తొందరపడి వచ్చితిని. అన్నయ్యతో చెప్పి వప్పించుట కవకాశము లేకపోయినది. అందువలన నిన్ను కొన్ని దినములవరకు కళ్యాణపురమునందే యుంచవలసి వచ్చినది. మాయక్క కమలయున్న ఆశ్రమమునందే నిన్నుంచుట మంచిదని తలచితిని. ఆమెవద్ద నుండుట వలన నీకే యిబ్బందియు నుండదు. కమల గురించి నీవు విన్న చెడు సంగతులు నీ మనస్సునం దుంచుకొనకుము. ఆమె సద్గుణవంతురాలు. ఆమె జీవితమిప్పుడు నిష్కళంకమై ప్రకాశించుచున్నది. అట్లు కాని యెడల నేను నాసోదరి నక్కడ ఉంచుట కెన్నడును వప్పుకొనను. ఒకటి రెండు నెలలలో అన్నయ్య నేలాగునైనను సమాధాన పరచెదను. ఈ యేర్పాటున కేమాత్రమిష్టము లేకపోయినను స్పష్టముగా జెప్పిన మరియొక యేర్పాటు జేసెదను.

కృష్ణశర్మ ఈ సంగతులను అతి కష్టముతో జెప్పి ముగించెను. తాను కమలను ప్రశంసించిన వాక్యముల యందుగాని, గోపాల శాస్త్రిని వప్పించెదనని చెప్పిన వాక్యముల యందుగాని ఆతనికంత విస్వాసము లేదు. ఈ యమాయక బాలిక నీవిధముగ మోస పుచ్చుట ఆతనికి కష్టముగా నుండెను.

సుశీ—(కన్నీళ్లు కార్చుచు. లజ్జావిషాద నిరాశలతో కూడుకున్న స్వరముతో) మీ ఆశ్రయమునే నమ్ముకొంటిని. మీ కెట్లుచితముగా దోచిన నట్లే చేయుడు.

సుశీల హృదయమిప్పుడు చులకన యయ్యెను. ఇక నామె తన భవిష్యత్తును గూర్చి ఆలోచించ వలసిన ఆవశ్యకత లేదు. కొన్ని రోజులవరకు తన జీవితమార్గము నిశ్చితమై నట్లామె తెలిసికొనెను. తన ఇల్లు కాలిపోవుచున్నను, కొంతసేపైనను వెలుగులో నుండ వచ్చునుకదా యని సంతోషించు దానివలె ఆమెస్థితి యుండెను.

వారు ముగ్గురును ఆశ్రమము చేరునరికి పదునొకండు గంటలయ్యెను. కమలతో నీ సంగతి జెప్పుటకు నారాయణదాసు ముందుగా లోపలకు వెళ్ళెను. కాని ఆమె గదివద్దకు వెళ్ళి చూడగా ఆమె జ్వరముతో తెలివితప్పి పడియుండెను. ఆశ్రమమునందలి స్త్రీలామె కుపచారములు చేయుచుండిరి. ఒకయువతి విసరుచుండెను. ఒక యువతి తల పట్టుచుండెను. ఇంకొకతె ఆమె కాళ్లు పట్టుచుండెను. ఉండియుండి కమల గట్టిగా మూల్గి పలువరించుచుండెను. నారాయణదాసు వ్యాకులముతో, "డాక్టరును తీసికొని వచ్చిరా?" యని అడుగగా "ఇప్పుడే చూచి వెళ్ళిరి." అని అక్కడ నున్నవారు జెప్పిరి.

లోపలనుండి ఒక స్త్రీ వచ్చి సుశీలను బండినుండి దింపి లోపలకు తీసుకొని వెళ్లెను. సుశీల కమల మంచమువద్ద నిలువబడి, "అక్కయ్యా!" యని పిలచెను. కాని కమల పలుకలేదు. కళ్లు విప్పి చూడలేదు. సుశీల అట్లే నిలువబడిపోయి అక్కవైపు జూచుచు కన్నీరు కార్చుచుండెను. "మూడు, నాలుగు సంవత్సరములక్రిందట నాతో కలసి ఆడుకొన్న నాప్రియమైన అక్కనా యీమె? ఆనల్లని పెద్ద తలకట్టు ఏమైనది? చంద్రునివలె మెరసిపోవు ఆ నవ్వుముఖ మేమైనది? విశాలములైన ఆ కండ్లెక్కడకు పోయినవి? ఆ కోమలమైన కంఠము,

ఆ దబ్బపండువంటి శరీరము ఎక్కడ మాయమైనవి? ఈమె మా అక్కయ్యా? లేక ఆమె శవమా?" అని తలచుకొనుచు ఆమె విచారపడసాగెను. ఆ పాలిపోయిన ముఖమునందు విరక్తి ఆత్మత్యాగముల యొక్క నిర్మలమైన, శాంతిమయమైన జ్యోతి ప్రకాశించుచుండెను. సుశీల హృదయమామెను జూడగానె కరుణా ప్రేమలతో నిండిపోయినది. అచ్చటి స్త్రీలు వెళ్ళిపోయిన తర్వాత సుశీల ఏడ్చుచు కమలను కౌగలించుకొని, "అక్కయ్యా! సుశీల నీకొరకు వచ్చినది. ఒక్కసారి కళ్లు విప్పి చూడు. నీవంట్లో ఇప్పుడెలాగున నున్నది." అని యేడ్చెను.

కమల కళ్లు విప్పి ఆశ్చర్యముతో వెఱ్ఱిదానివలె సుశీలవైపు జూచుచు, "ఎవరు? సుశీలా! నువ్వా. దూరముగా నుండు. నన్ను ముట్టుకోకు. నేను పాపాత్మురాలను. దౌర్భాగ్యురాలను. దుష్టురాలను. నువ్వు సచ్చరిత్రవు. సాధ్వీమణివి. నన్నంటకు. ఈ హృదయమును కోరికలు, చెడుతలంపులు మైలపరచినవి నీ స్వచ్ఛహృదయమును దీనిదరికి జేరనివ్వకు. ఇక్కడనుండి వేగముగా తొలగిపో. అదిగో నరకము. అగ్నిగుండము మండుచున్నది. యమదూతలు నన్ను అగ్నిగుండమునందు పడవేయుట కీడ్చుకొని పోవుచున్నారు! నీవిక్కడనుండి పారిపో." ఇట్లు పలుకుచు కమల తిరిగి మూర్ఛితురాలయ్యెను. సుశీల ఆరాత్రి యంతయు కమలకు విసరుచు ఆమె ప్రక్కలోనే కూర్చుండెను.

## ౧౫

సుశీల ఆశ్రమమునకు వచ్చి ఇప్పటికి నెలకు పైగా మైనది. కాని ఇంతవరకు కృష్ణశర్మ ఈసంగతి తనవారి కెవ్వరికిని జెప్పలేదు. ఒకప్పు

డన్న కుత్తరము వ్రాయుచుననియు, ఒకప్పుడు నారాయణదాసు నన్నువద్దకు పంపుదుననియు తలచుచుండెను. కాని చివరకేదియు స్థిరపరచుకొనలేకుండెను. వేశ్యల విషయమైన తీర్మానమును మునిస్పాలిటీయందు వేగముగా ప్రవేశపెట్టవలసినదని ఒకవైపున స్నేహితులు తొందరపెట్టసాగిరి. తన తీర్మానము తప్పక నెగ్గగలదను నమ్మక మాతనికి గలదు. ఆలస్యమైనకొలదియు ఆటంకములు వచ్చునని కూడ తెలియును. ఐనను తీర్మానమును ప్రవేశపెట్టుటకు వెనుదీయుచుండెను. చివరకు మే నెల వచ్చెను. నారాయణదాసుయొక్కయు, ప్రొఫెసర్ శంకరరావుయొక్కయు అనురోధమువలన చివరకు కృష్ణశర్మ తన తీర్మానమును కౌన్సిలునందు పెట్టుటకు సూచన చేయవలసి వచ్చెను. తీర్మానము చర్చింపబడు తేదీ కూడ నిశ్చయించబడినది.

చర్చాదినము దగ్గరపడుచున్నకొలదియు కృష్ణశర్మ మనస్సునం దాందోళన వృద్ధియగుచుండెను. కేవల మీ తీర్మానము ఆమోదింపబడుటవలన దాని యుద్దేశ్యము పూర్తికాజాలదని అతడనుమానించుచుండెను. దీనిని కార్యరూపమునందు పెట్టుటకు పురమునందలి తగు మనుష్యులందరియొక్కయు సహాకారసానుభూతులావశ్యకములు. ఇందువలననే అతడు హాజీఅస్సీమ్‌సాహెబును తనవైపునకు త్రిప్పుకొనుటకు ప్రయత్నించుచుండెను. వేశ్యలయందాతని కెక్కువ పలుకుబడి కలదు. ఆతడెట్లు చెప్పిన వారట్లు నడుచుకొనుటకు సిద్ధపడుదురు. చివరకు హాజీసాహెబు కృష్ణశర్మ పక్షమునకు తిరిగిపోయెను. శర్మయొక్క నడవడి, పరోపకారబుద్ధియందాతనికి మంచి విశ్వాసము కలిగెను.

కృష్ణశర్మ తీర్మాన మీరోజున కౌన్సిలునందు ప్రవేశపెట్టబడును. ప్రేక్షకులతో మునిస్పాలిటీభవన మంతయు నిండిపోయినది. వేశ్యలు కూడ తమపక్షమువారితో భవనమును చుట్టవేసిరి.

కౌన్సిలునందు కార్యక్రమము ప్రారంభింపబడినది. సభికు లందరు కూడ హాజరైరి. డాక్టర్ శ్యామలరావు తీర్మానముకొరకు చెన్నపట్నం వెళ్ళకుండ ఆగిపోయెను. అబ్దుల్ వహాబ్ సాహెబునకు తొలినాటి రాత్రి యంతయు నిద్రపట్టలేదు. తెల్లవార్లు ఈసంగతిని గురించే ఆందోళన పడుచుండెను.

కృష్ణశర్మ తీర్మానమును ప్రవేశపెట్టుచూ మంచి సబబులతో తీర్మానావశ్యకతను వివరించెను. తీర్మానము మూడు భాగములుగ విభజింపబడినది :—

I. "వేశ్యలను పట్టణముయొక్క ముఖ్యస్థలములనుండి తొలగించి ఊరిబయట నివసింపజేయవలెను.

II. "వారిని, పట్టణమునందలి, షికారు తిరుగుస్థలము లందును, పార్కులందును తిరుగకుండ నిషేధింపవలెను.

III. "వేశ్యలను నాట్యమునకు పిలచువారి పైని ఎక్కువగా పన్ను వేయవలెను. పాటకచ్చేరీలు ఎటువంటి బహిరంగస్థలము లందును జరుగనివ్వకూడదు. ప్రొఫెసర్ శంకరరావు తీర్మానమును బలపరచెను.

హాకీమ్ శహారత్ ఖాన్—ఈ తీర్మానము యెడల నాకును సానుభూతికలదు. కాని సవరణలేకుండ నేను దీనిని ఆమోదింపజాలను. రిజల్యూషనుయొక్క మొదటిభాగమునందు "వేశ్యలకు వివాహము చేయవలెను. లేనియెడల వారు స్వతంత్రముగ జీవించుట కేదైన నొక కళను నేర్పించవలెను." అను సవరణను నేను పెట్టుచున్నాను.

రామదేవు—ఈ సవరణతో నాకు పూర్తియైన సానుభూతికలదు. వేశ్యలను పతితులనుటకు మనకేమియు అధికారము లేదు. అట్లనుట మన మూర్ఖత్వము. మనము లంచములను పుచ్చుకొనుచున్నాము. ఆకరిమావడ్డీలను పుచ్చుకొనుచున్నాము. అసహాయుల గొంతుకలు నులుముచున్నాము. సంఘముయొక్క ఒక అంగము నీచమైనదనియు

తుచ్ఛమైనవనియు అనుటకు మన కధికారములేదు. అందరకన్నను నీచులము, పాపాత్ములము, దురాచారులము, అన్యాయవర్తనులము మనమే. ఇటువంటి మనము తెలిసినవారమనియును, నాగరికులమనియును, ఉదారవంతులమనియును, గొప్పవారమనియును, అనుకొనుచున్నాము. చదువుకొన్న మనకంటె ఆ వేశ్యలే నయము. వీరివీధి ఎప్పుడును కలకలలాడుచు, మకాణములతోను, షాపులతోను కూడి శోభగానుండును. ఈ వీధుల నట్లువరలంకరింప జేయుచున్నారు? మనమే. ఈ పిట్టలను మనమే పట్టుచున్నాము. ఈ బొమ్మలను మనమే తయారుచేయుచున్నాము. ఏ సంఘమునందు దురాచారులగు జమీందారులు, లంచగొండులగు రాజకీయోద్యోగులు, లంచములిచ్చు వర్తకులు, స్వార్థపరులు, సన్మానములకు వాత్సులగుచున్నారో ఆ సంఘమునందు వేశ్యలెందుకు వృద్ధి పొందరు? పాపాత్ముల ధనము పాపాత్ములకు తప్ప మరి యెవరికి చెందును? ఏదినమున నజరులు, లంచములు, దొంగవడ్డీలు అధికవృద్ధుల నంతమగునో ఆనాడే ఈ వేశ్యలు కూడ నశించెదరు. అంతవరకు వీరిట్లుండ వలసినదే. అసలు తీర్మానమునకు మీ సవరణ లేనియెడల కోసిన గాయముపై కారపుపలాస్త్రి వేయునట్లు యగును. అందువలననే నీ తీర్మానమును అంగీకరింపను.

ప్రభాకరరావు—అసలు తీర్మానముతో నీసవరణకేమి సంబంధమున్నదో నాకేమియు బోధపడుట లేదు. దీనిని మీరు ప్రత్యేక తీర్మానముగా పట్టవచ్చును. సంస్కరణమును మీ రెంతవరకు జేయగలిగినను ప్రశంసనీయమే. ఈపని వేశ్యలు పట్టణములో ఉన్నప్పుడు చేయుట ఎంత సులభమో పట్టణము బైటనున్నప్పుడును అంత సులభమే కాకుండ ఎంతో యెక్కువ హీనంగా నుండును.

అబ్దుల్ వహా—నాకీ సవరణతో పూర్తియైన సానుభూతిగలదు.

సూర్యారావు—ఈసవరణలేనిదే నేనీతీర్మానము ను ఆమోదింపను.

నరసింహాశెట్టి—ఈ సవరణను నేను కూడ బలపరచుచున్నాను.

కృష్ణశర్మ—వేశ్యలను కష్టపెట్టుట ఈ తీర్మానము యొక్క ఉద్దేశము కాదు. వారి నెట్లైనను మంచి మార్గమునకు తెచ్చుటయే దీని ముఖ్యోద్దేశము. కనుక ఈ సవరణను అంగీకరించుటకు నాకెట్టి అభ్యంతరమును లేదు.

తేగాలి—ఈ సవరణవలన అసలు తీర్మానముయొక్క ఉద్దేశము చెడిపోవు నేమో యని భయముగా నున్నది. మీరు నిర్మించుచున్న సౌధమునకు సింహద్వారము మూసివైచి పెరటివైపు మరియొక ద్వారమును కట్టించుచున్నారు. ఇంతవరకు హాయిగా వ్యభిచారముగ కాలము గడుపుచున్న ఈ వేశ్య లిప్పుడు కష్టపడి సంసారపు జీవితము లను గడుపుకొనుట అసంభవము. వారెన్నటికిని అట్లొప్పుకొనరు. వారీసవరణ నాధారముగా జేసికొని, ఒకరు ఎవరియింటియందో సింగరు మిషీనును పెట్టి కుట్టుపనితో జీవితమును గడుపుకొనెద మనియు, ఒకరు తమ యింటియందే మేజోళ్లల్లుకొని జీవించెద మనియు, ఒకరు తమలపాకు లంగడిని పెట్టుకొనెద మనియును వే రొకరు పండ్లంగడిని పెట్టుకొనెద మనియును, నకలుబెట్టి యూరి బైటకు వెళ్లకుండ తప్పించుకొనెదరు. వారు పైకి పండ్లిండ్లు చేసుకొనునట్లు నటించినను లోపల యథాప్రకారముగ వారి వృత్తినే జేసికొనెదరు. అందువలన నీ సవరణను ఎంతమాత్రమును అంగీకరింపకూడదు.

రామారావు—నే నీ సవరణను ఆక్షేపించుచున్నాను.

వెంకటరావు—కృష్ణశర్మగారు మంచివారనియు, పెద్దమనుష్యులనియు అనుటలో సందేహ మేమియు లేదు. కాని ఈ సవరణను అంగీకరించి తన తీర్మానమును బలపరుచుకొనుటకు బదులు అందరను సంతోషపెట్టుటకు జూచుచున్నారు. దీనివలన ఆయన ఉద్దేశమునకే

భంగము కలుగును. హకీమ్‌శరాఫత్ ఖానుగారు బాగుగ నాలోచించిన ఈ సవరణను ఎన్నటికిని పెట్టియుండరు.

చైర్మన్ బలభద్రరావునాయుడు తీర్మానముయొక్క మొదటి భాగమునకు సమ్మతులను తీసికొనెను. తొమ్మండుగురు అనుకూలముగను ఎనమండుగురు ప్రతికూలముగను సమ్మతు లిచ్చుటవలన ఆభాగ మామోదింపబడినది. పిదప సవరణపైని సమ్మతులు తీసికొనబడెను. ఎనమండుగు రనుకూలముగను ఎనమండుగురు ప్రతికూలముగను సమ్మతులిచ్చిరి. కాని అధ్యక్షుడు అనుకూలముగ తన సమ్మతి నిచ్చుటవలన అదికూడ ఆమోదింపబడెను. డాక్టర్ శ్యామలరావు ఎటువైపునను తన సమ్మతి నివ్వక తటస్థముగా నుండెను.

ప్రొఫెసర్ శంఖరరావు, డాక్టర్ సివరామ్, ప్రభాకరరావుగార్లు, సవరణ ఆమోదింపబడుటవలన తా మోడిపోయినట్లు భావించి కృష్ణశర్మ విశ్వాసఘాతము చేసిన ట్లాతనివైపు చూడసాగిరి. రామదేవు మాట నిలుకడలేనివాడనియు, ఉద్దేశశూన్యుడనియు, భాతా కాని రాయుడనియు, మొదటనే వారు నిశ్చయించుకొనిరి.

అబ్దుల్‌వఫా ఆతని మిత్రగణము తామే జయమొందినట్లు సంతోషింపసాగిరి. వారట్లు సంతోషముగా నుండుట ప్రభాకరరావు మొదలైనవారికి కష్టముగా నుండెను.

ప్రస్తావనయొక్క రెండవభాగముపై సమ్మతులు తీసుకొనబడెను. ప్రభాకరరావు అతని స్నేహితులు తీర్మానమునకు వ్యతిరిక్తముగా సమ్మతుల నిచ్చిరి. వారీవిధముగ కృష్ణశర్మపై కసితీర్చుకొన నుద్దేశించిరి. ఆభాగ మోడిపోయినది. అబ్దుల్‌వఫా వారి స్నేహితులు సంతోషముతో చప్పట్లు కొట్టసాగిరి.

ఇప్పుడు ప్రస్తావనయొక్క మూడవభాగముయొక్క వంతు వచ్చినది. రామదేవు దానిని బలపరచెను. కాని ప్రభాకరరావు ఆతని స్నేహి

తులు దీనికి కూడ వ్యతిరేకముగానే సమ్మతుల నిచ్చిరి. సవరణ ఆమోదింపబడిన తర్వాత తీర్మానముయొక్క తక్కిన భాగములు నిరుపయోగములని వారి యుద్దేశము. చివరకు తీర్మానము కూడ ఓడిపోయినది.

సభ పూర్తియగుసరికి రాత్రి యయ్యెను. తమపక్షము గెలిచిన వారు సంతోషముతో వెళ్ళిపోయిరి. ఓడిపోయినవారు నిరుత్సాహముతో ముఖములు వేలవేసుకొని వెళ్ళిపోయిరి.

వెళ్ళిపోవుచున్నప్పుడు రామదేవు బారిష్టర్ శివరామ్‌తో, "చివరకు మీ రేమి యీలా చేసినారు?"

బా-శి—(మర్మభావముతో) మీ రేమి చేసినారో మేము అదే చేసినాము. మీరు ఘుడియమీద దెబ్బకొట్టినారు. మేము దానిని అసలుకే విరచివేసినాము. చివరకు రెండింటి పర్యవసానమూ ఒక్కటే.

అంతటను ఎవరి ఇండ్లకు వారు వెళ్ళిపోయిరి. చీకటి గాఢాంధకారముగా నుండెను. బంట్రోతులు, కావలావారు కూడ దీపములార్పి, తలుపులు మూసి వెళ్లిపోయిరి. కాని కృష్ణశర్మ మాత్రము మైదానమునందు నిరుత్సాహము, విచారము మూర్తీభవించినట్లు కూర్చునియుండెను.

## ౧౬

కృష్ణశర్మ ఎంత ఆలోచించినను ఈ సవరణను ఆమోదించుటలో తన తప్పేమియు కనబడలేదు. ఇంత చిన్నవిషయములో తనమిత్రులింత గా కఠినవహించెదరని ఆతడెన్నడును అనుకొనలేదు. తీర్మాన మోడి

పోయినను ఆతని కంతగా విచారము కలుగలేదు. కాని తనమిత్రులు అవివేకముగా ప్రవర్తించి, ఆ నేరమంతయు తనమీద వేయుటవలన ఆతనికి మిక్కిలి విచారముగా నుండెను. ఈ సవరణ అంగీకరించుట వలన నష్టమేమియు లేదని ఆతనియుద్దేశము. దీనివలన హానికలుగు నని సూచించిన సబబులపై ఆతని కావంతయు నమ్మకములేదు. సంఘోద్ధారణకొరకై ప్రవేశబెట్టబడిన ఈ తీర్మానము మూడిపోవుటవలన తన ఆశలన్నియు నిరాశలయ్యెనని ఆతడు విచారించెను. అనవసరముగ నీచిక్కులన్నియు ఎందుకు తెచ్చిపెట్టుకొంటినా యని పశ్చాత్తాపపడజొచ్చెను. "నేను నిష్కారణముగ ముండ్లలో జిక్కుకొంటిని. నే నీసవరణజోలికి పోకపోయిన ఈ నింద నాపై పడకపోయియుండును." అని అతడు విసుగుకొనుచుండెను. ఇప్పుడు నిందయంతయు కృష్ణశర్మ మీదనే పడినది. విరోధులు, స్నేహితులు కూడ నితనినేహేళన చేసెదరు. పత్రికలన్నియు నితనినే విమర్శించెను. ఈ వాదములన్నియు ఇతడే భరింపవలసియున్నది. కృష్ణశర్మ కిప్పుడు మిత్రులుకాని, సానుభూతిజూపువారు కాని లేరు. నారాయణదాసు న్యాయమూ లోచించు నని యు, తనమిత్రులను సమాధానపరచుననియు ఆతడాశ పడెనుగాని అందుకు వ్యతిరేకముగ దాసీతనిపైనే నేరము మోపెను. "మీరీ సవరణ నంగీకరించి కార్యమునంతను చెడగొట్టిరి. సంవత్సరమునుండి పడిన కష్టమునంతను మట్టిపాలు చేసివైచిరి." యని దాసు నిష్ఠురము లాడసాగెను. రామదేవు ఒక్కడు మాత్రమే కృష్ణశర్మ నోదార్చి సానుభూతిని జూపుచుండెను.

కృష్ణశర్మ పూర్తిగ నొకనెల కచ్చేరికి వెళ్లలేకపోయెను. ఇంటి యందెల్లప్పుడును ఒంటరిగ కూర్చొని ఈ విషయమే ఆలోచించు చుండెను. మిత్రులయొక్క వైరభావమును తలచుకొని విచారించుచు, తనలో, "ఇటువంటి చదువుకొన్నవారు, మంచిచెడ్డలు తెలిసినవారు

కూడ ఒక చిన్నమార్పువలన తమ నిశ్చితాభిప్రాయమునకు వ్యతిరిక్త మగ నడచుకొనుట జూచిన, ఈ దేశమునకు త్వరలో ముక్తి కలుగు నని తోచదు. నే నీసవరణ నంగీకరించి తప్పే చేసితిని కాని నా తప్పు వీరిని మంచిమార్గమునుండి ఎందుకు విముఖులను జేసినది!" అనితర్కవితర్కములు జేసికొనుచుండెను. ఈ యాందోళనస్థితిలో మనస్సును శాంతిపరచుట యందొక యబలకెంత శక్తికలదో కృష్ణశర్మ కనుభవమునకు వచ్చెను.

ఆతని మనస్థితి సుభద్రమ్మకు మాత్రమె బాగుగ తెలియును. ఆమెకు కూడ కృష్ణశర్మవలెనే ఈ సవరణ ఆవశ్యకమని తోచెను. ఆతని స్నేహితులపైని ఆతనికంటె సుభద్రమ్మయే ఎక్కువగ విమర్శన జేయుచుండెను. ఆమె విమర్శలవలన కృష్ణశర్మ మనస్సునకు కొంత శాంతి కలుగుచుండెను. సుభద్రమ్మ కిటువంటి విషయములను బోధపరచుకొనుటకును, విమర్శించుటకును తగిన శక్తిలేకపోయినను, ఆమె చేయుచున్న విమర్శలన్నియును తన మాటలయొక్క ప్రతిధ్వనులేయనియును, తలచుచుండెను. ఐనను ఈ విమర్శనల వలన ఆతని మనస్సునకు సంతోషమే కలుగుచుండెను.

కాని ఒకనెల పూర్తి కాకుండనె ప్రభాకరరావు తనపత్రికలయందు దీపప్రస్తాపన విషయమై వరుసగ విమర్శనలను వ్రాయసాగెను. ఆ విమర్శనలయందు కృష్ణశర్మను మరొక్కకృత్తులతో నెత్తి పొగడసాగెను. ఒక పత్రికయం దాతడు శర్మయొక్క పూర్వచరిత్రకును నీ సవరణకును ఒక అపూర్వమైన సంబంధమును కల్పించి వ్రాసెను. మరియొక పత్రికయం దాతని ప్రవర్తనను విమర్శించుచు, "నీ కృష్ణశర్మగారిప్పుడు దేశభక్తులైనారు. ఈ యన, దేశమును మరచినను తనవిషయమును మాత్రము ఎన్నడును మరచిపోరు. దేశసేవచాటున తమస్వార్థమును నెరవేర్చుకొన జూచుచున్నారు." అని వ్రాసెను.

కృష్ణశర్మకీ మిథ్యాదోషారోపణవలన మిక్కిలి కోపము కలుగుచుం డెనో యంత ఆశ్చర్యముకూడ కలుగుచుండెను. దురహంకారమింత పనిచేయునని ఆతనికిప్పుడు బోధపడెను. ప్రభాకరరావు పైకి వివేక వంతునివలెను మంచివానివలెను కనబడుచున్నను ఆతని ఆత్మ ఎంత కలుషితమైనది? కాని ఈవిమర్శనలకు ప్రత్యుత్తరము వ్రాయుట కెవ రును సాహసింపలేదు. ఒకనాడు సాయంత్రము శర్మ ఈ పత్రికను ముందుంచుకొని దానికి జవాబువ్రాయుటకు మేజావద్ద కూర్చుండెను. కాని ఏ మిజవాబు వ్రాయుటకును ఆతనికి స్ఫురించలేదు. ఇంతలో సుభద్రమ్మ అక్కడకువచ్చి, "ఇంత ఉక్కలో నీ మూల కూర్చుని ఏమిచేయుచున్నారు? వాకట్లో కూర్చొనరాదా?"

కృష్ణ—ప్రభాకరరా వీరోజు పత్రికలో నన్ను, కసిదీర తిట్టినాడు, దానికి జవాబువ్రాయుట కాలోచించు చున్నాను.

సుభ—ఆత డెందు కాలాగున మీామీాద కత్తికట్టినాడు? (అని అనును దీసి ఆవిమర్శనను పూర్తిగా చదివి పత్రికను తిరిగి బల్లపై పడవేసెను.)

కృష్ణ—విమర్శన వేలాగున్నది?

సుభ—విమర్శన చాలా బాగుగనే యున్నది. దీనియందు తిట్లు తప్ప మరియేమియు లేవు. ఆడవారే తిట్లుతో దెబ్బలాడుకొనెద రని ఇది వరకు నే ననుకొనుచుంటిని. కాని ఇప్పుడు తెలిసినది. మొగవాళ్లే ఈతిట్లలో మాకన్న ఒకచెయ్యిపైగానున్నారు. ఈతడు విద్వాంసుడు కాబోలు?

కృష్ణ—ఆఁ. విద్వాంసుడు కాడా మరి? ఈతడు చదువనిపుస్తకమే లేదు.

సుభ—అందుకేనా ఇంత గర్వము?

కృష్ణ—నే నిప్పుడు దీనికి తగిన జవాబు వ్రాయుచున్నాను. దీని

వలన నా సంగతి ఆతనికి బాగుగ బోధపడగలదు.

సుభ—కాని తిట్ల కేమి జవాబు వ్రాసెదరు?

కృష్ణ—తిట్లే.

సుభ—కాదు. కాదు. తిట్లకు మౌనమే జవాబు. తిట్టినవారిని తిట్టుట మూర్ఖులపని. మీరు కూడ తిట్టిన మీకును వారికిని గల తారతమ్యమేమి?

కృష్ణశర్మ సుభద్రమ్మవైపు గౌరవముతో జూచెను. ఆమె మాటలాతనికి బాగుగ నచ్చినవి. మనము అభిమానవశమున, అజ్ఞానులని తలచిన వారివలన కూడ నప్పుడప్పుడు మంచి యుపదేశములను పొందుచుందుము.

కృష్ణ—ఐతే మౌనమే వహింపనా?

సుభ—నాసలహా అదే. అతని మనస్సుతీరా తిట్టనివ్వండి. చివరకాతడే సిగ్గు పడును. అదియే ఆతిట్లకు తగిన శిక్ష.

కృష్ణ—ఆత డెన్నటికిని సిగ్గు పడడు. ఇటువంటి వారికి సిగ్గన్న నేమియో తెలియదు. ఇప్పుడు నే నాతని వద్దకు వెళ్లిన, నన్నెంతో గౌరవముచేసి నవ్వుచు మాట్లాడును. కాని సాయంత్రమైన తోడనే తిరిగి ఈతిట్ల మర్యాదయె.

సుభ—ఐతే ఇతరులను నిందించుటయే అతని పనియా?

కృష్ణ—అతని యుద్యమ మదికాదు. కాని పత్రికా సంపాదకులు చందాదారులను వృద్ధిపరచుకొనుట కీవిధముగ ఏదో యొక విమర్శనను జేయుచునేయుందురు. ఇటువంటి విమర్శనలవలన ప్రతిక లెక్కువగా అమ్మకమగును. ప్రజల కిట్టి వివాదములన్న చాలా సరదా. సంపాదకులు తమ మహాత్మ్యమును మరచి ప్రజలయొక్క ఈవివాద ప్రేమనుండి లాభమును పొందజూతురు. వీరు తమ ఉత్కృష్టపదవిని మరచి ప్రజలయొక్క కలహప్రేమను ఆహ్వానించుచుందురు.

మా చందాదారులను సంతోషపెట్టుటయే మాకర్తవ్యము. వారి సొమ్ము దినుచున్నాము గనుక వారికి సంతోషము కలుగనట్లు వ్రాసెదము." అని కూడ కొందరు సంపాదకులు చెప్పుచుందురు.

సుభ—ఐతే వీరు కేవలము డబ్బునకే దాసులగుచున్నారు. వీరిపైని కోపగించుటకు బదులు జాలి పడవలెను.

పత్రికకు వ్రాయు నుద్దేశ్యమును మానుకొని కృష్ణశర్మ బల్లవద్దనుండి లేచి పోయెను. సుభద్రమ్మ ఇంత వివేకవంతురాలని అతడెన్నడును అనుకొనలేదు. "నేనింత చదువుకొన్నవాడనై నప్పటికినీ ఈమెకు గల జ్ఞానము నాకు లేదు. అంత చదువుకొన్నది కాక పోయినను, మంచి ఆలోచనయును ఔదార్యమును ఈమెకు గలవు." అని మనస్సులో సంతోషించెను.

స్త్రీ సంతానహీనురాలై నప్పటికిని పురుషునకు శాంతమును ఆనందమును కలిగించగలదని ఆయన కిప్పుడు బోధపడెను. సుభద్రమ్మ యందాతని కిప్పుడు నూతనప్రేమ ఉదయించెను. సంతోషమును కొరటము లేని సంవత్సరముల నుండి హృదయమునందు కూడుకొన్న మాలిన్యమును ఒక్కక్షణములో కడిగి వేసెను. ఆతడు నిర్మలప్రేమతో ఆమెపై పుజూచెను. సుభద్రమ్మకు ఆ మాపుల యర్థము బోధపడి ఆమె హృదయ మానందముతో పొంగిపోయెను.

## ౧౭

కమలను జూచి వచ్చినప్పటినుండియు మోహనుని స్థితి, సంవత్సరముల తరుబడి కూడబెట్టిన ధనమును పోగొట్టుకొన్న దరిద్రుని స్థితివలె నుండెను. ఆతడు తనలో, "ఆమె నాతో మాటాడలేదు. సరికదా

నావైపైనను జూచినది కాదు. ఏమీ ఆమె నన్నంత నీచునిగా తలచి నదా! కాదు. కాదు. ఆమె తన పూర్వచరిత్రను తలచుకొని సిగ్గు పడుచు, నన్ను మరచి పోవుటకు ప్రయత్నించుచున్నట్లున్నది. నావివాహవిషయమై ఆమె వినియుండవచ్చు. అందువలన ఆమె నన్ను కఠినునిగను, నిర్దయునిగను భావించుచున్నది కాబోలు.'' నని తర్కించుకొనుచుండెను.

కమలను తిరిగి మరియొకసారి కలుసుకొనవలెనని మోహనునకు చాల కోరికగా నుండెను. మరుసటిదిన మాతడు తిరిగి ఆశ్రమము వైపున నున్న రేవునకు బయలుదేరెను. కాని ఆతడు మధ్యత్రోవ నుండియే ఇంటికి వెళ్లిపోయెను. ఒకవేళ ఆమె సుశీల విషయమై అడిగిన ఏమని జవాబు చెప్పుదునని ఆతనికి భయముకలిగెను. అది కాక రామానందుని యుపదేశము కూడ ఆతని కప్పుడు జ్ఞాపకమునకు వచ్చెను. మోహను డప్పు డప్పుడు సుశీల విషయమై తన కర్తవ్య మేమని ఆలోచించుచుండెను. నెలల తరుబడిగ సంఘసంస్కరణ విషయమున యుపన్యాసములను వినుటవలన ఆతనియం దీమార్పు కలుగుటలో ఆశ్చర్యమేమియులేదు. అతడు తన మనస్సునందు సుశీల విషయమై చాల అన్యాయముజరిగినదని వప్పుకొనుచుండెను గాని తన కర్తవ్యమును తెలిసికొన లేకుండెను.

అత డీరోజులలో చాల పుస్తకములను చదువుచుండెను. సాని వీధిని బజారువీధిని విడిచిపెట్టిన తర్వాత ఆతని మనస్సీ క్రొత్తమార్గము ననుసరించెను. ఆర్యమతోపన్యాసములకు కూడ అతడు తరచుగా వెళ్లుచుండును. మనుష్యుడు గొప్ప విద్వాంసుడగుటవలన గౌరవమును సంపాదింపజాలడనియును దీనికి సచ్చరిత్రయే ముఖ్యకారణమనియును ఆత డాయుపన్యాసములవలన తెలిసికొనెను. ఆతని మనస్సునందు, విద్యకంటె సచ్చరిత్రయే ఆధిక్యతను వహించెను. అప్పటినుండియు

మోహనుడు మనోబల సంబంధమైన పుస్తకములను మహాపురుషుల జీవితచరిత్రలను ఎక్కువగ చదువసాగెను. అతనికి పుస్తకములు చదువుటయం దభిలాష దినదినాభివృద్ధి నొందుచుండెను. తాను విద్యావిహీనుడైనను ఈ ప్రపంచక్షేత్రమునందు కొంతపని చేయగలుగుదునని ఆతనికి ధైర్యము కలిగెను. గ్రంథములయందు ఇంద్రియనిగ్రహము గురించియు, మనస్సును స్వాధీనమునం దుంచుకొనుట గురించియు చెప్పబడిన సాధనముల నెల్లపుడును ఆతడు జ్ఞప్తియం దుంచుకొనుచుండును.

మ్యునిసిపాలిటీయందు కృష్ణశర్మ తీర్మానమును ప్రవేశ పెట్టినప్పుడు మోహనుడు కూడ అక్కడనే యుండెను. సవరణను ఆయన అంగీకరించినప్పుడు మోహనుడు చాల విచారించెను. ఈ విషయమై తన పినతండ్రి చాల తప్పుచేసెనని ఆతడు తలచెను కాని ప్రభాకరరావాతనిని విమర్శించుటకు ప్రారంభించి నప్పటినుండియు ఆతడు తన పినతండ్రి పక్షమున సమర్థించుటకు చాల ఆతృత పడుచుండెను. ఈ విమర్శనలకు జవాబుగ మోహనుడు రెండుమూడు వ్యాసములను వ్రాసి ప్రభాకరరావునకు పోష్టుద్వారా పంపెను. చాల దినముల వరకవి ప్రచురింప బడునని ఆశపడుచుండెను. తన వ్యాసముల వలన గడబిడ పుట్టుననియు, మనుష్యులయందు పరివర్తన కలుగుననియు ఆతడు భావించెను. ప్రతిదినము పత్రిక వచ్చినతోడనే తన వ్యాసము ప్రచురింప బడినదేమో యని ఆత డాతృతతో వెతకుచుండును కాని దానికి బదులు ద్వేషపూరితములైన విమర్శనలే కనబడుచుండెను. వాటిని చదివిన కొలదియు ఆతని రొమ్ములు మండిపోవుచుండెను. ఆతడు తనలో "ఏవిధముగా నైన నీసంపాదకుని పని పట్టింపవలెను. ఆతడు నిజముగ నిష్పక్షపాతియే యైన నా వ్యాసములును కూడ ప్రచురించి యుండును. వీటిని ప్రచురించకపోవుట

జూడగ ఆతనికి నిజానిజములు వెల్లడించుట కిష్టము లేదనియు, కేవలము జనులను సంతోషపెట్టుటకే ప్రతిదినము దూషణలతో పత్రికల నింపుచున్నాడనియు వెల్లడి యగుచున్నది.” అని అనుకొనుచుండెను కాని మోహనుడు తన ఈ యుద్దేశములను ఎవని యెదుటను ప్రకటించ లేదు. ఒకనాటి సాయంత్రమాతడు లావైన చేతికఱ్ఱను పట్టుకొని ప్రభాకరరావుయొక్క పత్రికాలయమునకు వెళ్ళెను. కార్యాలయము మూయబడి యుండెను. కాని ప్రభాకర రావు తన ఆఫీసునందు కూర్చుని ఏదో వ్రాసుకొను చుండెను. మోహనుడు నిస్సంకోచముగ అతని వద్దకు వెళ్ళి నిలువబడెను. మంచి బలమైన యువకుడు లావుపాటి కఱ్ఱను పట్టుకొని తన యెదుట నిలువబడుట జూచి, తులుక్కుపడి, వినుగుతో “మీరెవ్వ” రని ప్రశ్నించెను.

మోహ—నేనీ యూరివాడనే. మీరిన్నిదినములనుండి కృష్ణశర్మ గారి నెందుకు మీ పత్రికలలో దూషించుచున్నారని అడుగుటకు వచ్చితిని.

ప్రభా—ఒహో! మీరేనా! నా వద్దకు వ్యాసములను పంపినారు.

మోహ—ఔను. నేనే పంపితిని.

ప్రభా—అందుకు మీకనేక వందనములు. దయచేసి ఈ కుర్చీ మీద కూర్చొనుడు. మిమ్ములను స్వయముగ కలుసుకొనవలెననియే అనుకొను చున్నాను. కాని మీనివాస మెచ్చటనో తెలిసినది కాదు. మీ వ్యాసములు చాల సొగసుగాను, సబబుగాను ఉన్నవి. వాటిని తప్పక ప్రచురించెదను. కాని వ్యాసకర్త పేరు తెలియనిదే ప్రచురించుట మానియమ విరుద్ధము. అందువలననే ఇంతవరకు ప్రచురించ లేకపోయితిని. తమ నామధేయము?

మోహనుడు తన పేరును తెలియజేసెను. ఇప్పుడాతని కోపము కొంతవరకు శాంతించినది.

ప్రభా—తమరు కృష్ణశర్మగారి ప్రాణస్నేహితులవలె నున్నారు.

మోహ—నేనాతని అన్న కుమారుడను.

ప్రభా—ఓహో ఐతే మీరు మావాళ్ళే. కృష్ణశర్మగారు క్షేమముగా నున్నారా? చాల దినములై ఆయన దర్శనము చేయలేదు.

మోహ—ఇప్పటికి బాగానే యున్నారు. కాని ఈ విమర్శనలిట్లేయుండిన ఆయన స్థితి ఎట్లుండునో దైవమునకే ఎరుక. మీరాయన పరమమిత్రులై యుండియు ఇంత ద్వేషము వహించుట ఆశ్చర్యముగా నున్నది.

ప్రభా—ద్వేషమా? రామరామ! ఆయనయందు నాకు లేశమాత్రము ద్వేషములేదు. మీరు మాసంపాదకుల కర్తవ్యము నెరుగరు. మేము ప్రజలయెదుట నొకరికి మిత్రులము కాము ఒకరికిశత్రులము కాము. ప్రజల నుద్దేశముల ననుసరించి మా బాల్యస్నేహితులను సహితమువిడిచి పెట్టెదము. జన్మశత్రువులనైనను ఒక్కప్పుడు పొగడెదము. సార్వజనిక విషయములందు మేము ఎవరి తప్పులను క్షమింపజాలము అట్లు మేము క్షమించినయెడల ఆతప్పులు మరింత హానికరములగును. శర్మగారు నాకు పరమమిత్రులు. నేనాయనను మనస్ఫూర్తిగ ఆదరించెదను. ఆయనను విమర్శించుటవలన నాకెంతయో మనోవేదన కలుగుచున్నది. మొన్నటివరకు కేవలము నేనాయన సిద్ధాంతములకు వ్యతిరేకుడను. ఆయన ఈసవరణ నంగీకరించుటలో మరియొక యుద్దేశ మున్నదని మొన్ననే తెలిసినది. ఈ విషయమై మీకు చెప్పుటలో ఏమియు హానిలేదనుకొనెదను. ఆయన కొన్ని నెలల నుండి కమలాభాయి యను వేశ్యను రహస్యముగ పితంతు శరణాలయమునం దుంచెనట. సుమారొక నెలదినములనుండి ఆమె చెల్లెలు కూడ అక్కడనే యున్నదట. ఈసంగతి నిజము కాకూడదనియే నేను కోరుచున్నాను. కాని దీని నిజానిజములు తెలిసికొనుటకే సంగ

తిని తెలిసికొనుటకు త్వరలోనే పత్రికలో ప్రచురింప బోవుచున్నాను.

మోహ——ఈ సంగతి మీ కెట్లు తెలిసినది ?

ప్రభా——అది నేను చెప్పనుగాని ఈ సంగతి కృష్ణశర్మగారిని కను క్కొని అబద్ధమైన నాకు కబురుపంపెను. ఈ ప్రస్తావన పురపాలక సంఘసభయందు ప్రవేశపెట్టక ముందు శర్మగారు తరుచుగ హాజీహాస్సీమ్ సాహేబింటికి వెళ్లుచున్నట్లు కూడ నాకు తెలిసినది. ఈ సంగతులను బట్టి ఆ యన యుద్దేశములను నే నెట్లు బోధపరచుకొంటినో మీరే తెలిసికొనగలరు.

ఇప్పటికి మోహనుని కోపము పూర్తిగ శాంతించినది. ప్రభాకర రావుయొక్క మాటలతని వశపరచుకొనెను. మోహనుడు మనస్సునందు ప్రభాకరరావును ప్రశంసించుచు కొంతసేపాతనితో నీ సంగతులు మాట్లాడి, ఇంటికి వెళ్ళిపోయెను. సుశీల ఆశ్రమమునం దెందుకుంచబడినదా యనుసంగతి ఇప్పుడాతని మనస్సును పీడించుచుండెను.

రాత్రి భోజనసమయము నందీసంగతిని తన పినతండ్రి నడిగి తెలిసికొనవలెనని ఆతడు నిశ్చయించుకొనెనుగాని అడుగుటకు సాహసము లేకపోయెను. కమల విధవాశ్రమమునుండి వచ్చుచుండుటయు, పోవుచుండుటయు ఆతడిదివరకు జూచియుండెను. కాని ఇప్పటివరకీ సంగతులేమియు ఆతనికి బోధపడలేదు. కాని ఈ సంగతుల నన్నిటిని బట్టి ఆలోచింపగ సుశీలనుకూడ ఆశ్రమము నందుంచుటను గురించి ఆతనికి సందేహము కలిగెను. రాత్రి యంతయు ఈ సందేహముతో ఆతని మనస్సు కొట్టుకొనుచుండెను. "సుశీల ఆశ్రమమున కెందుకు వచ్చినది ? బాబయ్యగా రామె నిక్కడ కెందుకు తీసికొని వచ్చినారు? రామనాధ మామెను తన ఇంటియం దుంచుకొనుట కిష్టపడలేదా !" యను నీ విధమైన సంశయములాతని మనస్సునందు పుట్టుచుండెను.

తెల్లవారగానె మోహానుడు విధవాశ్రమము వైపు బయలుదేరెను. ఒకవేళ కమల అటువైపు వచ్చిన ఆ మెవలన నీ సంగతులన్నియు తెలిసికొనవచ్చునని ఆ తని అభిప్రాయము. ఆ తడు నదియొడ్డున పావంచాలపై కూర్చున్న కొంతసేపటికే కమల ఆ వైపునకు వచ్చుచుండుటను జూచెను. ఆ మెవెనుక నింకొకయువతి కూడ తలవంచుకొని వచ్చుచుండెను.

కమల చాల దినములనుండి మోహానుని కలుసుకొని మాట్లాడవలెనని కోరుచుండెను. అందువలన అతనిని జూచినతోడనే ఆమె ఆగిపోయెను. ఇదివర కామె మోహానునితో మరి మాటాడకూడదని నిశ్చయము చేసికొన్నను, సుశీలకొరకు మాట్లాడవలసి వచ్చెను. ఆమె సిగ్గువడుచు, మోహానునితో, “భాగ్యవశమున మీ దర్శనము దొరకినది. క్షేమమేనా?

మోహా—(గుండెలు తటతట కొట్టుకొనుచుండగా) ఆఁ. అందరు క్షేమమే.

కమ—చాల నీరసముగ కనబడుచున్నారు. సు స్తీచేసినదా?

మోహా—అబ్బే, కులాసాగానే యున్నాను. నాకు జబ్బేమిటి?

కమ—ఒక్క నిమువము కూర్చోండి. మీతో చాల మాట్లాడవలసియున్నది. మి మ్మిప్పటినుండి “అన్నయ్యా” యని పిలచెదను. మన కిప్పుడు సోదర సోదరీ సంబంధ మేర్పడినది. నేను మీ వదినను. నానోటినుండి కఠినపుమాటలు వచ్చిన మరియొక విధముగ తలచకండి. నాస్థితి మీకు తెలిసియే యున్నది. మీ పినతండ్రిగారు నాకు చాల సహాయము చేసినారు. ఇప్పుడు నేను ఆశ్రమమునందు దినములు గడపుచున్నాను. ఈ యభాగ్యురాలగు నాచెల్లెలు కూడ ఒకమాసమై ఇక్కడనే యున్నది. మా మేనమామగా రింటియం దిక నామె యుండలేకపోయినది. శర్మగారిని దైవము రక్షించుగాక! ఆయనయే

స్వయముగ వెళ్లి దీనిని తీసికొని వచ్చినారు. కాని ఇక్కడ దిగపెట్టిన తర్వాత ఆయన దీని సంగతియే మరచిపోయినట్లున్నారు. ఒక్కసంగ తడిగెదను చెప్పండి. అన్న దొంగతనముచేసిన తమ్ముని శిక్షించుట ఎక్కడి న్యాయము? ఇప్పుడు మీవద్ద ఏసంగతియు దాచుటలేదు. నా దురదృష్టమువలనను, రోజుల వంకరవలనను, పూర్వజన్మపాపము వలనను, దౌర్భాగ్యురాలనై ధర్మమార్గమును విడిచిపెట్టితిని. దానికి తగిన శిక్షను నే నిప్పు డనుభవించుచున్నాను. కాని మీ రందరును దీనిని పరిత్యజించుటకు పాప మిది యేమి అపరాధము చేసినది? దీనికి తగిన జవాబు మీరే చెప్పవలసి యున్నది. పెద్దవాళ్లేమంటారో యను వంకమాత్రము చెప్పకండి. అట్లనుట వట్టి పిరికితనము. ఇది న్యాయమో అన్యాయమో మీరు మనస్సాక్షిగ చెప్పండి. మీ రింత అన్యాయమున కొడిగట్టుకొనెదరా? ఒక అమాయకపు బాలిక జీవితమును నష్టపరచుటకు మీకు దయలేదా?

సుశీల అక్కడ లేకపోయిన మోహనుడు తన మనోభావములను ప్రకటింపగలిగి యుండును. తన తప్పు తప్పక యొప్పుకొని యుండును. కాని సుశీల ముందు తా నపరాధినని యొప్పుకొనుట కాతడు సిగ్గుపడెను. అది కాక వంశమర్యాద యను అడ్డుచెప్పుటకు కూడ అతనికి సంశయముగా నుండెను. సుశీలకు దుఃఖము కలిగించునట్టిగాని అనవసరపు ఆశను కలిగించునట్టి మాటలను గాని తన నోటివెంట రాకుండ ఆతడు జాగ్రత్తగా నుండెను. అత డిప్పుడు సుశీలనుండి తన దృష్టులను మరలించుకొనలేకుండెను. అతని స్థితి ఇప్పుడు బంధువులు తెచ్చిన కమ్మని మిఠాయిలను జూచి నో రూరుచుండినను తల్లి భయమువలన వాటిని తీసికొని తినలేని బాలునివలె నుండెను.

మోహ—సోదరీ! మీరు మొదటనే నానోరు కట్టివేసినారు. అందువలన ఇది యంతయు మాపెద్దవారు చేసిన పనియే యని

నే నెట్లు చెప్పగలను? వారిపై ఈ నింద మోపి నేను నిర్దోషినని చెప్పజాలను. అప్పుడు నేను కూడ లోకనిందకు భయపడితిని. ప్రపంచ మునం దుండి ప్రపంచరీత్యా నడచుకొనవలెనని మీరు కూడ వప్పు కొనెదరు. అందుచేత నీ యన్యాయమును మేమే చెయ్యలేదు. ఈ తప్పంతయు సంఘమునదే.

కమ—సోదరా! మీరు చదువుకొన్నవారు. మాటలలో నేను మిమ్ము జయింపజాలను. మీ కెట్లు న్యాయమని తోచిన నట్లే చేయుడు. ఒకరు జేసినను, సంఘము జేసినను అన్యాయము, అన్యా యమె. ఇతరుల భయమువలన, ఒకరికి అన్యాయము చేయకూడదు. సుశీల ఇక్కడ నిలువబడియున్నది. ఇంతకన్న మరి నేను చెప్పజాలను కాని వక్కసంగతి మాత్రము చెప్పెదను. మీకు మరియొక చోట ధనము, సన్మానము, రూపము, గుణము దొరకవచ్చును గాని ఈ ప్రేమ మాత్రము దొరకజాలదు. ఈమె హృదయము కూడ మీ హృదయమువలె కఠినమైనదే యైనయెడల నిప్పు డామె శ్రొత్త అత్త వారి ఇంటిలో సౌఖ్యముగను, ఆనందముగను ఉండి యుండును. కాని ఈమె హృదయ మట్టిది కాదు. మీమీది ప్రేమయే ఈమె నిక్కడకు లాగుకొని వచ్చినది. మీ రీమె నె ట్లాదరించినను సరే. ఈమె మాత్రము మీమీది ప్రేమతోనే ఈ జీవితము నంతను గడుపును.

సుశీల కండ్ల వెంట నీరు కారుచుండుట నాతడు జూచెను. అప్పుడు ప్రేమతో గూడుకొన్న అతని సరళహృదయము దుఃఖముతో నిండి పోయెను.

మోహ—(కరుణాస్వరముతో) ఇప్పు డేమి చేయవలెనో నా కేమియు పాలిపోవుటలేదు. నాహృదయము దుఃఖముచే వగిలిపోవు చున్నది. దైవసాక్షిగా జెప్పుచున్నాను.

కమ—మీరు పురుషులు. మీకు దైవమన్ని సామర్థ్యములను

దయచేసినాడు.

మోహ—మీరెట్లు సలహానిచ్చినట్లు చేయుటకు సిద్ధముగ నున్నాను.

కమ—మనస్సాక్షిగ చెప్పుచున్నారా?

మోహ—నామనస్థితి ఎట్లున్నదో దేవునకే యెరుక నోటితో ఏమని చెప్పను?

కమ—మొగవారి మాటలయందు విశ్వాసము కలుగకున్నది. (ఇట్లు చెప్పుచు కమల చిఱునవ్వు నవ్వెను.)

మోహ—(సిగ్గుపడుచు) నావశమేయైన యెడల నాహృదయమును విప్పి మీకు చూపియుందును. (ఇట్లు చెప్పి అతడు సుశీల వైపు ఓరకంటితో జూచెను.)

కమ—సరే, మీరిప్పుడీనదియొడ్డున సుశీల చెయ్యిని పట్టుకొని, "నీవు నాభార్యవు. నేను నీపెనిమిటిని. నేను నిన్ను ప్రేమించి పోషించెదను." అని చెప్పండి.

మోహనుని ఆత్మబలము జవాబు నిచ్చివేసెను అతడు తన ముఖమును దాచుకొనుటకు ఇటు నటు చూడసాగెను. గోదావరి తనను మ్రింగి వేయుటకు వచ్చుచున్న ట్లాతనికి తోచుచుండెను. ఆతడు మునిగిపోవుచున్న మనుష్యునివలె ఆకాశమువైపు జూచి తిరిగి సిగ్గుచేత తలవంచుకొని మెల్ల మెల్లగా "కమలమ్మా! దీనివిషయమై ఆలోచించు కొనుటకు నాకు కొంత వ్యవధినిమ్మా." కమల నమ్రతతో, "ఔను. ఆలోచించియే నిశ్చయపరచుడు మిమ్ములను సందిగ్ధస్థితిలో పెట్టుట నాకు కూడ నిష్టములేదు." సుశీలతో "చూడు! నీభర్త ఇప్పుడు నీయెదుటనే నిలువబడియున్నాడు. నేను చెప్పగలిగిన దంతయు చెప్పితిని. కాని అతని మనస్సు కరుగలేదు. ఇక నీకాయన దర్శనమగుట దుర్లభము. నీప్రేమ నిజమైనదై,

దానియందు బలమున్న ఆయననాపి, ఆయన వద్ద ప్రేమ వరము పుచ్చుకో" ఇట్లు చెప్పి కమల నదివద్దకు బయలుదేరెను. సుశీల కూడ ఆమె వెనుకనే మెల్లగా నడువసాగెను. ఆమె ప్రేమ మానము క్రింద అణగిపోయెను. ఎవరికి తన ప్రేమ నర్పించి, యావజ్జీవము దుఃఖముతోనైనను గడపుటకు నిశ్చయించినదో, ఎవరికి, తన్ను మనస్సునందే అర్పించుకొన్నదో ఆతనిని ప్రత్యక్షముగా జూచియు, మాట్లాడలేక పోయినది. ఆతని యవస్థ నామె ఎరుగదు. అతని కష్టముల నామె విచారింపలేదు. ఆతని పరాధీనతను గురించి ఆలోచింపలేదు. ఇప్పు డామె చేతులు జోడించి మోహనుని ఎదుట నిలువబడినచో తన కోరిక నెరవేరియుండును. కాని ఆమెకు వినయము కన్న మానమే అధికముగా తోచెను. మోహను డొక్కక్షణ మక్కడ నిలువబడి, తరువాత పశ్చాత్తాపపడుచు ఇంటికి వెళ్లిపోయెను.

## ౧౨

మోహనుడు తానెంతో పాపముచేసిన వానివలె విచారపడుచుండెను. ఆతడు మాటిమాటికిని తన సంభాషణను మనస్సునందు వితర్కించుకొనుచు, తాను చాల నిర్దయుడనని అనుకొనుచుండెను. ప్రేమ అతనిని వెఱ్ఱివానిగ జేసివైచెను. అతడు తనలో, "లోకమన్న నా కెందుకింత వెరపు? సంఘము నన్నేమిచేయును? మిథ్యాపవాద భయము చేత నీ సతీరత్నమును పోగొట్టుకొందునా? నా పూర్వజన్మ సుకృతమువలన నాకీ సుగుణరాశి లభించినది. తమ సంఘనియమములను పాటించి నన్ను నా బందుగులు విసర్జించిన నా కేమి నష్టము? మనను పాపకర్మములనుండి తప్పించగలిగిన, అట్టిలోకనిందకు భయపడవలెను.

కాని మనకర్తవ్యమున కడ్డుపడిన దానికి భయపడుట మన పిరికితనమే. నిరపరాధులపై అబద్ధములగు అభియోగములను దెచ్చిన సంఘము మనలను వెలిబెట్టక పోవుటయే గాక అది మనకు సహాయముజేయుచు సాక్షులను వకీళ్ళను సమకూర్చుచున్నది. ఎవరిధనమునైనను, వస్తువులనైనను అపహరించిన, సంఘము మనలను శిక్షింపదు. ఒకవేళ శిక్షించినను నామమాత్రముగ శిక్షించును. కాని ఇటువంటి సత్కార్యములయందు ఆ సంఘమే మనకు చెడుపేరు తెచ్చును. జీవితపర్యంతము కళంకము నంటగట్టును. లోకనిందకు వెరచి నే నీయధర్మమును చేయజాలను. నే నామెను నడిసముద్రములో వదలివేయలేను. సంఘము నన్నెట్లు నిందించినను సరే. నేనీ అన్యాయమును మాత్రము చేయజాలను. తల్లిదండ్రుల యాజ్ఞను పాలించుట నా ముఖ్యకర్తవ్యమని నే నొప్పుకొందును. వారే నాకీ జన్మనిచ్చి, పెద్దవానిని జేసిరి. తండ్రి యొడిలో నాడుకొంటిని. తల్లి పాలతో పెరిగితిని. వారి కనుసన్నను సంతోషముతో విషము త్రాగగలను. కత్తి అంచుపైనైనను సాము చేయగలను. నిప్పులలో కూడ నురుకగలను. కాని వారాగ్రహించినను కూడ నీ యువతిని తిరస్కరింపజాలను. ఈ మెను రక్షించుటయే నా పరమధర్మము. నా కర్తవ్యము. నాన్నగారికి, అమ్మకుకూడ నాపై తప్పక కోపమువచ్చును. వారు నన్ను బహిష్కరించి, చచ్చిపోయి నట్లుకూడ భావింపవచ్చును. కాని కొన్నిదినములు విచారించిన తర్వాత వారికే ధైర్యము కలుగును. వారు నన్ను మరచిపోగలరు. కాలము వారి గాయమును మాన్పగలదు.

"అయ్యో! నే నెంత కఠినుడను? నా దెంత పాషాణహృదయము? రాణివాసమునకు శోభ తెచ్చు యువతి నా యెదుట దీనురాలై నిలువబడి నప్పుడు నా హృదయము కొంచమైనను కరగినదికాదు. అటువంటి సమయమందు నేనామె కాళ్ళపైబడి, చేతులు జోడించి, "రమణీ!

నా అపరాధములను క్షమింపుము" అని వేడికొని నదీజలములను తెచ్చి ఆమె కాళ్ళనుకడిగి ఇష్టదేవత నుపాసించు నట్లామె నుపాసింపవలసి యుండెను. కాని నేను రాతివిగ్రహమువలె కదలక నా వంశమర్యాదను పట్టుకొని కూర్చుంటిని. అయ్యో! ఎంత మందబుద్ధిని? నా కఠినపుమాటల వలన ఆమె కోమలహృదయ మెంత కృంగిపోయినదో? ఆ సంగతి ఆమె కన్నీటివలననే వ్యక్తమైనది. ఆమె నన్ను ప్రేమశూన్యుడనియు, గర్విష్ఠియనియు, ధూర్తుడనియు తలచియుండును. ఆమె నా వైపు కన్నెత్తియైనను జూడలేదు. నిజముగ అది నాకు తగిన శిక్షయే."

ఈ పశ్చాత్తాపము చాలదినములవరకు మోహనుని మనస్సును బాధించు చుండెను. చివరకాతడు తన సంసారమును వేరుపరచుకొనవలెననియు, తనస్వశక్తిపైనే ఆ ధారపడవలె ననియు తలచెను. ఇంతకు తప్ప మరియొక దారి అతనికి కనబడలేదు. "అమ్మ నాన్నగారు నన్నింటిలోని కైనను రానివ్వరు. బాబయ్యగారు నాకు తప్పక ఆశ్రయమిచ్చెదరు. కాని వారింటి యందుండి మనస్పర్థలు పుట్టించుట న్యాయముకాదు. ఈ తడే మా పిల్లవానిని చెడిపినాడని నాన్నగారు ఈయనపై తప్పక వాగువేసెదరు. అందువలన నా దారిని నేనుజూచుకొనుట తప్ప మరియొక సాధనము లేదు.

మోహనుడు తాను రగులుకొలిపిన నిప్పును ఆర్పివేయవలెనని తలచుచుండును కాని తీరా బయలుదేరు సమయమునకు ధైర్యము సడలిపోవుచుండెను. ఇల్లెక్కడ? ఏ యాధారము జూచుకొని ఆమెను సమాధానపెట్టుదును? అను సంశయము లాతని మనస్సునందు కలుగుచుండును.

ఈ సమస్య నెట్లు పూర్తి చేయుదునను విచారమాతని మనస్సునెల్లప్పుడు బాధించు చుండెను. ఆ తడు పనికొరకూరంతయు గాలిం

చివైచెను. ఒకప్పుడా ఫీసులకు పోవును. ఒకప్పుడు మిల్లులకు పోవు చుండును. ఈ విధముగ రోజుకు మూడునాలుగు గంటలు పనికొరకు తిరిగి తిరిగి ఇంటికి వచ్చుచుండును. ఇప్పటి వరకాతని జీవితము సౌఖ్యముగాను, గొప్పగాను గడచిపోయెను. వినయమనుదాని నింతవరకాత డెరుగడు. స్వాభిమాన మాతని రోమరోమముల నిండియున్నది. ప్రపంచానుభవమాతని కించుకైనను లేదు. అధికారుల ఎదుట చేతులు జోడించిన కాని తనపని నెరవేరదను సంగతాత డెరుగడు. నమ్రత, పరిశ్రమ, నిపుణతలు, గలవారి యొక్కయు, అవమానమును సహించువారి యొక్కయు, ఆత్మాభిమానమును వదలు కొనువారి యొక్కయు కార్యములే ఈ కాలమున నెరవేరుననియు, అట్టివారికే ఉద్యోగములగుననియు, మనుష్యుని దేవతుల్యునిగా జేయు సద్గుణములీ క్షేత్రమునందు నిర్లక్ష్యదృష్టితో జూడబడుననియు మోహనుడెరుగడు. మోహనుడు మర్యాదగలవాడు. సత్యప్రియుడు, దయాస్వభావము కలవాడు. అమాయకుడు. ఐనను ఉన్నతవిద్య లేకపోవుటవలన నీగుణములకు ప్రపంచదృష్టియందు విలువలేకుండెను. మోహనుడు తన సమయమునంతను వ్యర్థముగ పోగొట్టుకొంటి ననియును, జీవనాధారమును కలిగించు యేపనిని నేర్చుకొనక పోతిని కదా యనియును విచారింప జొచ్చెను. ఈ విధముగ నొకమాసమునకు పైగా గడచిపోయెను. కాని మోహనునకే పనియు దొరకలేదు.

ఈ నిరాశక్రమక్రమముగ ఆతని హృదయమునందు సంతుష్టిని కలిగింప సాగెను. ఆతనికి తన తల్లిదండ్రుల పైనను, పినతండ్రిపైనను, ఈ ప్రపంచము పైనను, చివరకు తనపైనను కూడ కోపము కలుగుచుండెను. ఇదివర కాతడు గుఱ్ఱముపై పికారు వెళ్లుచుండెడువాడు. కాని ఇప్పుడెవ్వరైనను గుఱ్ఱముపై కాని కారుపై కాని వెళ్లుచుండగా జూచిన ఆతనికి చాల చికాకుగ నుండెను. రోడ్డుపైని తానడ్డముగా

నడచుచున్నప్పుడు బండితోలువాడు అదలించినను ఆతడు లక్ష్య పెట్టుట లేదు. ఎవరేమన్నను ఇప్పుడాతడు దెబ్బలాడుటకే సిద్ధపడు చుండెను. పంట్లాము కోటు వేసికొని సౌఖ్యముగ గుఱ్ఱపు బండిలోను మోటారులోను పోవుచున్న వారిని జూచినప్పు డాతడు తనలో "వీరింత హాయిగ షికారు వెళ్ళుచున్నారు. నా దురదృష్ట మెందు కీవిధముగ నున్నది?" అని విచారించుచుండును. మోహనుడు గొప్ప కుటుంబములోని వాడగుటవలన తన జీవనాధారమును గురించిన ప్రశ్న ఇదివరకాతని కెన్నడును కలుగలేదు. ఇందు వలననే ఆతడు చదువు విషయమై యంతశ్రద్ధ తీసికొనవలసిన అవసరము లేకపోయెను. కాని అకస్మాత్తుగ ఆతనికీ చిక్కు సంభవించుటవలన తన అసమర్థత ఇప్పుడాతనికి బోధపడెను. ఆతడు పెద్ద ఇంగ్లీషుపరీక్షలు ప్యాసు కాక పోయినను స్వభాషయందు మంచి జ్ఞానమును సంపాదించెను. పరీక్షలు ప్యాసైనవారు మాతృభాషయం దశ్రద్ధ జూపుటవలన జాతికిని దేశమునకును కూడ చాల అనర్థము కలుగుచున్నదని ఆతని అభిప్రాయము. ఆతనికి తన బుద్ధిపై నిదివరకు గర్వముగా నుండెను. తన వ్యాసములు పత్రికలయందు ప్రచురింపబడి నప్పటినుండియు ఆతడు ఇంగ్లీషు చదువుకొన్నవారిని నిర్లక్ష్యభావముతో జూడసాగెను. "వీరందరు కూడ స్వార్థపరులు. దరిద్రుల గొంతుకలు కోయుటకును, తమపొట్టలు నింపుకొనుటకునే వీ రింగ్లీషు చదువుకొనిరి. వీరందరు నాగరికతకు బానిసలు. వీరియందు దయాధర్మములు లేవు ఆత్మ బలము లేదు. వీరికి మాతృభాషయందు ప్రేమ లేదు. వీరుకూడ మనుష్య మాత్రులేనా!" అని మోహను డనుకొనుచుండును. కానితన జీవితసమస్య తలచుకొన్నప్పు డాతడు "వీరియెడల నేను అన్యాయముగా తలచుచున్నాను. వీరు నిజముగ దయాపాత్రులే. నాకంత భాషా పాండిత్యము లేకపోయినను చాలమందికంటె నేనే నయము.

నా యుద్దేశములంత శ్రేష్ఠములు కాకపోయినను నీచములు మాత్రము కావు. కాని నాజీవితమున కిప్పుడేద్వారమును తెరచియుండలేదు. నాకిప్పుడొక్క బంట్రోతు పనికిమాత్రమె అర్హత కలదు. ఇంకను ఎక్కువగ తంటాలుపడి ప్రయత్నించిన కాన్స్టేబిల్ పని అగునేమో? సరి ఇంతవరకే నా సామర్థ్యము. ఇది ఎంత అన్యాయము? ఎంత సత్ప్రవర్తకుడైనను, ఎంత సామర్థ్యమున్నను ఇంగ్లీషు భాషాజ్ఞానము లేకపోయిన నిది యంతయు నిరర్థకమే. ఈ యన్యాయమును మౌనమున సహించుటకన్న అవమాన మేకలదు? ఇటువంటి నీచపునౌఖరీ ఆశను నా మనస్సునుండి తొలగించుకొనుటయే యుత్తమము.”

ఇప్పుడు మోహానునిస్థితి రాత్రియందడవిలో తిరుగుచు చీకటిపై చికాకుపడువాని స్థితివలె నుండెను.

ఇట్టి నిరాశావిచారములతో నొకనా డాతడు నదియొడ్డున తిరుగుచు పడవలరేవు వైపునకు వెళ్లెను. నదియందు రహదారీపడవ లిటునటు పోవుచుండెను. కొన్ని షికారుపడవలయందు పురవాసులు చల్లగాలి కొరకు తిరుగుచుండిరి. కొన్ని పడవలు సామానుల నెక్కించుకొని పోవుచుండెను. మోహానునకు కూడ షికారు వెళ్లవలెనని బుద్ధిపుట్టుట వలన ఆతడొక పడవను మాట్లాడి దానిలో కూర్చుండెను. సాయంసమయమందలి చల్లగాలియు, నది కిరువైపులను గల ప్రకృతి సౌందర్యమును అతనిని పరవశునిగ జేసెను. అప్పుడాతడు తనలో, “ఇది ఎంత సంతోషకరమైన జీవితము. దైవము నాకుకూడ నిటువంటి జీవితమును దయచేసిన ఎంత సౌఖ్యముగ కాలము గడుపుదును? నదియొడ్డున తిరుగుచు నదీతరంగములపై షికారు తిరుగుచు ఆనందము ననుభవించుదును. సుశీల మా కుటీరముయొక్క ద్వారమువద్ద నిలువబడి నా రాక కెదురు చూచుచుండును. అప్పుడప్పుడు మే మిద్దరముకూడ షికారు తిరుగుచుందుము.” అని తల

చెను. ఈ ఆనందమయకల్పనల వలన అతని సుఖమయజీవనము యొక్క సౌందర్యచిత్రము కండ్లయెదుట చిత్రింపబడిన ట్లుండెను. ఆ యానందమయస్వప్నము నాతఁడు జూచిచూచి చివరకు వ్యాకులు డయ్యెను. అక్కడి ప్రతివస్తువును, సుఖము, ఆనందము, శాంతి ములలో మునిగి తేలుచున్న ట్లుండెను. మోహను డప్పుడొక మోతు బరియగు పడవవానితో, "ఏమోయి! వెంకన్నా! ఇక్కడ ఏదైనను ఒక షికారుపడవ అమ్మకమున కున్నదా?" యని అడిగెను. అప్పుడా పడవవాడు చుట్ట త్రాగుచుండెను. మోహనుని చూడగనె లేచి నిలువబడి, "చిత్తం బాబు" అని అక్కడ అమ్మకమునకు సిద్ధముగానున్న కొన్ని పడవలను జూపెను. మోహను డొక క్రొత్తరకపు షికారుపడవ నెంచి దానిని బేరము చేయుచుండెను. అప్పుడా చుట్టు పట్లనున్న పడవలవా రందరు కూడ ఆతని జుట్టును చేరిరి. చివరకు మూడువందల రూపాయలకు బేరము కుదిరెను. పడవ నమ్మినవాడే నౌఖరుగా నుండి పడవను నడపుట కొప్పుకొనెను. అంతయు సిద్ధమైన తర్వాత మోహను డింటికి బయలు దేరెను. అప్పుడాతని కే వస్తువునకు కొదువలేనట్లును తాను యుద్ధమునందు జయమొందిన ట్లును అతి సంతోషముగా నుండెను. ఈ సంతోషమువలన రాత్రి తెల్లవార్లు నిద్ర పట్టలేదు. తాను నదియందు క్రొత్తపడవలో షికారు తిరుగుచున్నట్లును, నదియొడ్డున మంచి లతలతోను, పువ్వుల తోను కూడుకొన్న చిన్నతోటలో నొక సొగసైన చిన్న ఇల్లును తాను గట్టించినట్లును, సుశీల మనోహరాకారము ఆయింటిని ప్రకాశింపజేయుచున్నట్లును, మరియొకసారి తాను సుశీలతో కలసి విహరించుచున్నట్లును అనేకవిధములుగ కలలను గనుచుండెను. మనకు దేనియందు మిక్కిలి మక్కువయుండునో అదియే మన కెల్లప్పుడును కండ్లకు కట్టిన ట్లుండును. మోహనుడు సుశీలను, సాధారణమైన బట్ట

లను కట్టుకొని నదియొడ్డున తల వంచుకొని నిలువబడి యున్నప్పుడు జూచియుండెను. అప్పటినుండి ఆరూపు ఆతని కండ్ల ఎదుటనుండి తొలగిపోలేదు.

తాను ప్రారంభింపబోవు ఈ వ్యవహారమునందు లాభమే కాని నష్టమురాదని మోహనుడు మనస్సునందు కల్పనలను జేయుచుండెను. కాని ఇంతసొమ్మునుదాపుపెట్టుట కెక్కడనుండి వచ్చునను ఊహ ఆతనికి స్ఫురింపక పోవుట చాల విచిత్రము.

తెల్లవారగనె, "నే నింతసొమ్మెక్కడనుండి తెత్తును? ఎట్లు సమకూర్తును? ఎవరినడిగిన నెవరిచ్చెదరు? ఏవంక బెట్టి అడుగుదును? బాబయ్య నడుగుదునా? కాని ఆయన కొన్ని నెలలనుండి తిన్నగా కచ్చేరీకైనను వెళ్లుటలేదు. ఆయనమాత్రము సొమ్మెక్కడనుండి తెచ్చెదరు? నాన్నగారివద్ద పుచ్చుకొనుట రాతినుండి నీరుతీయుటయే. యేమి చేయుదును? ఇప్పుడు వెళ్లి సొమ్మివ్వక పోయిన నామాట పోవును." అని చింతించుచు మోహనుడు డాబాపైన వచారు చేయుచుండెను. ఇంతవరకు నిర్మించిన కల్పనాభవనము చూచుచుండగనే కూలిపోవసాగెను. యవ్వనమునందలి కోరికలు వెదుళ్లమంటవంటివి. అవి ఎంతవేగము మండునో అంతవేగముగ ఆరిపోవును.

అకస్మాత్తుగా మోహనునకొక యుపాయము తట్టెను. శత్రువును భూమిపై పడద్రోసి హేళనచేయుచున్నట్లతడు నవ్వెను, "ఆహా నే నెంత మూర్ఖుడను! మూడువందలకన్న ఎక్కువ విలువగల వాచీ గొలుసు, ఉంగరములు నాపెట్టెయందే యున్నవి. వాటి నిప్పుడెందు కమ్మకూడదు? ఒకవేళ అమ్మ అడిగిన ఖర్చుపెట్టివేసినానని స్పష్టముగా చెప్పివేసెదను. నాన్నగారడిగిన అప్పటిమాట చూచుకొనవచ్చును." ఇట్లనుకొనుచు ఆతడు గదిలోనికి వెళ్ళి పెట్టె తెరచి వస్తు

వులను పైకి దీసి వాటి నెట్లమ్ముదునా యని ఆలోచింపసాగెను. బజారులో స్వయముగా అమ్ముట కాతనికి చిన్నతనముగా దోచెను. ఈ విషయమై ఆలోచించుచుండగా నింతలో వెంకటస్వామి గది నూడ్చుటకు లోపలకు వచ్చెను. ఆతడు మోహనుని ముఖము వాడి యుండుటను జూచి, "ఏం బాబు! ఆలా వున్నారు? రాత్రి నిద్రపట్ట లేదా? కళ్ళు పొంగి ముఖం వాడిపోయింది?"

మోహ—ఔను. రాత్రి నిద్రపట్టలేదు. నామనస్సు స్థిమితముగా లేదు.

వెంక—ఏం బాబు? ఎందుచేత? నే నా సంగతి వినకూడదూ?

మోహ—నీతో చెప్పిన ఈ సంగతి నిముషములో నిల్లంతయు ముట్టించివేస్తావు.

వెంక—బాబూ! చిన్నప్పటినుండి మిమ్మలినే కనిపెట్టుకొని ఉన్నాను. నే నంత నమ్మకమైనవాడిని కాకపోతే యిన్నాళ్ళుంచుకుంటారా? మరేం భయం లేదు నాతో చెప్పండి.

మోహ—(జంకుతూ) ఒరే వెంకన్నా! నావద్ద కొన్నివస్తువు లున్నవి. వాటిని ఏలాగేనా అమ్మాలి. నా కిప్పుడు సొమ్మవసర ముగా కావలసియున్నది.

వెంక—దీని కేనా బాబు ఇంత విచారిస్తున్నారు? మీవొంటి గొప్పోరు సరుకు లెందు కమ్ముకోవడం? అమ్మగోరి నడగండి. అమ్మగోరు ఎప్పుడూ లేదనరు. కాని పంతులుగోరి నడుగుతే లాభం లేదు. ఈ యింట్లో పంతులుగోరి పెత్తన మేమి లేదు. అంతా అమ్మగోరి ఇష్టమే.

మోహ—ఇంట్లోవాళ్ళ నడగడం నా కిష్టం లేదు.

వెంకటస్వామి ఆ సరుకులను పుచ్చుకొని ఉజాయింపుగా ఆ సరుకు లెంత బరువున్నవో చేతితో ఆడించి చూచెను. సాయంత్రమునకు

వాటి నమ్మి సొమ్ము తీసుకొని వచ్చెదనని మోహనునితో చెప్పి వెళ్ళిపోయెను. కాని వాడు బజారునకు వెళ్ళక తిన్నగా తనగదిలోనికి వెళ్ళి తలుపులు వేసికొనెను. ఆతడు తన మంచముక్రింద త్రవ్వి రూపాయలతో నిండియున్న ఒక చెంబును పైకి తీసెను. జీవిత మంతటిలో వాడు జేసిన కష్టము, లోభము అన్యాయము ఈ రూపాయలరూపముతో ఆ చెంబునందు సమకూర్చబడి యుండెను. ఈ కారణముచేతనే కదా పెద్దలు డబ్బు పాపిష్టిది యని చెప్పెదరు.

వెంకటస్వామి ఆ రూపాయలను లెక్కబెట్టి ఇరువది, ఇరువది చొప్పున దొంతులు పెట్టెను. అన్నియు కలిపి పదిహేను దొంతులైనవి. తర్వాత అతడు వస్తువులను త్రాసులో వేసి తూచగా అవియున్నయు పదిహేను తులములకు పైగా నుండెను. అప్పుడు బంగారపు ధర ఎక్కువగానున్నను ఇరువదియైదు చొప్పున దొంతులు పెట్టగా పదమూడు దొంతులై పదిహేను రూపాయలు మిగిలిపోయెను. అనగా ఆవస్తువులకు తాను కట్టినధర కింకను రమారమి ముప్పదియైదురూపాయలవరకు తక్కువగా నుండెను. వాడు తనలో, "చేతికి దొరకిన ఈ వస్తువులను వదలుకొనకూడదు. పదమూడు తులములే యున్నవని చెప్పివేసెదను. అట్లుచెప్పిన నావద్ద ఇంక పదిహేను రూపాయలు కూడ మిగులును." అని అనుకొని వస్తువులను చెంబులో పెట్టి మూతను గట్టిగా బిగించి యథాప్రకారముగ దానిని భూమిలో పూడ్చి వేసెను. అనుకొనకుండ నిమిషములో ఏబదిరూపాయలు లాభము వచ్చుటవలన వెంకటస్వామి సంతోషమును పట్టజాలకుండెను. ఇటువంటి అవకాశము వాని కిదివరకెన్నడును చిక్కలేదు. వాడు తనలో, "ఈ రోజున లేచి ఎవరి ముఖము జూచితినో నా అదృష్టము బాగున్నదని" పొంగి పోవుచుండెను. పదిగంటలు కొట్టగానే వెంకటస్వామి మూడువందల ఇరువదియైదు రూపాయలను దెచ్చి మోహనుని

చేతిలో బోసెను. ఈ సొమ్ము ఉచితముగా దొరకినట్లతడు సంతోషించెను. వెంకటస్వామి ఆ రూపాయల నిచ్చివేసి స్వార్థరహితునివలె ముఖమును త్రిప్పుకొని వెళ్ళిపోవు చున్నట్లు నటించెను. మోహానుడు వాటిలోనుండి ఐదురూపాయలను దీసి, వీటితో నే మైనను కొనుక్కో అని వెంకటస్వామికివ్వ బోయెను. కల్లును జూచి భయపడి ముఖమును త్రిప్పుకొను సత్పురుషునివలె తలనాడించుచు, "మీా వల్లే బతుకుతున్నాం బాబు. చిన్నవంతులుగారి దగ్గర పుచ్చుకుంటానా?

మోహా—లేదులేదు. నేను సంతోషముతో నిచ్చుచున్నాను. పుచ్చుకో.

వెంక—లేదు బాబు నామాట యినండి. వద్దువద్దు. ఈల నేసి నట్లైతే యీా పాటికి నాలుగు డబ్బులు సంపాదించి ఉండనా? దేవుడు మిమ్మలిని సల్లగా చూస్తే నాకదే పదియేలు!

వెంకటస్వామి చాల నమ్మకమైనవాడనియు, ఈతనితో నీవిషయమై సలహా చేయనచ్చుననియు మోహానుడు తలచెను.

సాయంకాలము కాగానే మోహానునియొక్క పడవ ఆకాశమునందు పోవు మేఘమువలె గోదావరీతరంగములపై పోవుచుండెను. కాని మోహానుని ముఖమునందు సంతోషవికాసములకు బదులు భవిష్యత్తును గూర్చిన విచారము కనబడుచుండెను. పరీక్షయందు కృతార్థుడైన విద్యార్థి ముందు సంగతిని గురించి ఆలోచనామగ్నుడగునట్లు మోహానుడు కూడ తన భవిష్యత్తును గూర్చి ఆలోచింపసాగెను. సంసారరూపమైన రొంపినుండి రక్షించిన ఊతకఱ్ఱ విరిగిపోయి తాను నడిసముద్రములో కొట్టుకొనుచున్నట్లాతనికి తోచుచుండెను. "పడవను వదలితిని. కాని యొడ్డు చేరగలనా? నీరు లోతుగా నున్నది. గాలి విస్తారముగా వేయుచున్నది. జీవనయాత్ర నే ననుకొన్నంత సులభమైనది కాదు. అలలయొక్క ధ్వని మాధుర్య

ముగా నున్నను, ఒక్కొక్కప్పుడు భయంకరముగా కూడ నుండును.
గాలి మందమందముగా నుండి పడవను మెల్ల మెల్లగా కదలించినను,
ఒక్కొక్కప్పు డెక్కువయై దానిని ముంచివేయునే!"

## ౧౬

మోహనుడు పత్రికలకు వ్రాసిన ఉపన్యాసములవలన ప్రభాకరరావు యొక్క క్రోధము కొంతవరకు శాంతించెను. మరియు మోహనుని నిరోధమువలన కృష్ణశర్మ కమలయొక్క పూర్తియైన వృత్తాంతమును వ్రాసి ప్రభాకరరావునకు పంపెను. అందువలన కూడ ఆతని మనస్సు స్థిమితముగా నుండెను.

మ్యూనిసిపాలిటీయందు వేశ్యల విషయమై తిరిగి పెట్టబడిన తీర్మానము సవరణతో కూడ నామోదింపబడి మూడు మాసములయ్యెను. సవరణవిషయమై తే గాలీసాహెబు సూచించిన అనుమానములుకూడ నిరాధారములని వ్యక్తమయ్యెను. బజారునందలి మేడలపైని కాని, సాని వీధియందు మేడలపైని గాని వేశ్య లెవ్వరు దుకాణములను పెట్టలేదు. ముందుముందు అక్కడినుండి తమరిని తగిలివేయుదురను భయముచేత వారు తమ బసలను మరియొకచోటునకు మార్చుకొనిరి. అందువలన చాల మేడలు ఖాళీగా నుండెను.

కృష్ణశర్మ మొదట వేశ్యలయందలి యసహ్యముచేత నీతీర్మానమును పెట్టెను కాని యీ విషయమై తర్కించి యాలోచింపగా ఆతని అసహ్యత దయాదాక్షిణ్యములుగా మారిపోయెను. ఈ భావములే ఆతనిని సవరణ నంగీకరించునట్లు చేసినవి. శర్మ తనలో, "పాప మీ యబలలు ఇంద్రియచాపల్యమువలన తమ సర్వస్వమును

నాశనపరచుకొనుచున్నారు. విలాసప్రేమ వీరిని గ్రుడ్డివారినిగ జేసి వేయుచున్నది. ఇటువంటి స్థితియందు వీరు మన జాతికి పాత్రులే. ఈ దుర్వర్తివలన సులభముగా బాగుపడగల వీరి దేహమును శక్తియు మరింత బలహీనములై పోవుచున్నవి. ఉపదేశములవలనను, ప్రేమవలనను, శిక్షణవలనను రక్షింపబడగల వీరి యాత్మలు మన లోనుండు కోరికలచేతనే మరింత చెడిపోవుచున్నవి. మాయామోహ ములవలన గ్రుడ్డివార మగుచున్న మనకు వారిని దండించుట కెట్టి యధికారమును లేదు. వారి కర్మయే వారిని దండించుచుండగా మనము కూడ నీ యత్యాచారములవలన వారి నెందుకు మరింత దుఃఖపెట్టవలెను ?" అని భావించుచుండును.

మన మనస్సునందలి తర్కవితర్కములు కర్మమార్గమును సూచించును. కృష్ణశర్మ సంకోచమును అభిమానమును విడిచిపెట్టి చివరకు కర్మక్షేత్రమునందు ప్రవేశించెను.

కమల యెదుటపడినపుడు గెత్తునట్టి శర్మ యిప్పుడు దినమంతయు సానివీధియందే కనబడుచుండెను. ఎవరేమనుకొన్నను యిప్పు డాతడు లక్ష్యపెట్టుటలేదు. ఆతని కిప్పు డాత్మబలము వృద్ధిపొంది హృదయమునందు నిజమైన సేవాభావము జాగరితమైనది. లోకనిందాభయము పూర్తిగ విడిచిపెట్టెను. రాళ్లు రువ్వినను పచ్చికాయ చెట్టునుండి నేల పడదు. కాని పక్వమైన పండు దానంతట అదియే క్రిందపడును. కృష్ణశర్మయొక్క అంతఃకరణయం దిప్పుడు సేవాప్రేమల యొక్క భావములు పరిపక్వము లయ్యెను.

నారాయణదాసు సానుల కీ విషయమునందు వ్యతిరిక్తముగా నుండెను. పుట్టుకతో వేశ్యలైనవా రెన్నటికి బాగుపడజాలరని ఆతని ఉద్దేశము. తీర్మానమునకు సవరణను పెట్టిన సెహరత్ ఖాను కూడ నీ విషయమై అంత శ్రద్ధ తీసుకొనలేదు. రామదేవు తన

సంగీతసాహిత్యములలో పడి కొట్టుకొనుచుండెను. కేవలము సాధు రామానందస్వామియే కృష్ణశర్మకే కార్యమునందు అనరాగానుండెను, ఇప్పుడా యోగియందు సేవ నిజరూపముతో నవతరించిన ట్లుండెను.

౨౦

కొన్ని నెలలు గడచిపోయినవి. కాని మోహనుడు తన యీ క్రొత్త వ్యాపారమును గురించి ఇంట్లో నెవరితోను జెప్పలేదు. అతడు చీక టుండగనే లేచి స్నానము వంకజెప్పి రోజు ప్రొద్దుటే గోదావరి యొడ్డునకు పోయి పది గంటలకు తిరిగి వచ్చుచుండును. తిరిగి భోజ నము చేసి వెళ్ళి రాత్రి భోజనముల వేళ కింటికి వచ్చుచుండును. ఇప్పు డాతని పడవ మిగిలిన షికారు పడవ లన్నిటికంటె అందము గాను సౌఖ్యప్రదముగాను ఉండెను. అందులో రెండుమూడుకుర్చీలు, పరుపులు, బాలీసులు ఉండెను. అందువలన పట్టణమునందలి ధన వంతులు రసికులు దీనిపైనే షికారు వెళ్లుచుందురు. అద్దె విషయమై మోహనుడు స్వయముగ మాట్లాడక పడవవాని ద్వారానే వ్యవ హారము జరుపుచుండెను. అత డొక్కొక్కప్పుడు నదియొడ్డున పచారు చేయుచుండును. ఒకొక్కప్పుడు పడవలో షికారు వెళ్లు చుండును. "వ్యవహారమును స్వయముగ జేసికొనుట కెందుకీ ముఖ మాటము ? నే నేమియు చెడువని చేయుటలేదు. ఒకరిక్రింద బాని సనుకాను." అని అతడు మనస్సున తర్కించుకొనుచుండును. కాని ఎవ్వరైనను పెద్దమనిషి తన పడవవైపునకు వచ్చుచుండుటను జూచిన తోడనె అతని అడుగులు తమంతట అవియే వెనుకకు పోవుచుండును. అతని తండ్రి గొప్ప భూస్వామి. పినతండ్రి పెద్దవకీలు. అటువంటి

పెద్ద కుటుంబములోనివా డగుటవలన మోహను డిటువంటి "తక్కువ" పని చేయుటకు సిగ్గుపడుట సహజమే. ఈ సంకోచము వలన ఆతనికి చాల నష్టము కలుగుచుండెను. సులభముగ రూపాయి లాభము వచ్చుచోట అతనికి అర్ధరూపాయే లాభము వచ్చుచుండెను. ఏవ్యవహారమునైనను స్వయముగ జేసికొనుటవలనను, పైడాబువల నను ఎక్కువ లాభము వచ్చును. మోహానునకీ సంగతి తెలిసినప్పటి కిని సంకోచమువలన నేమియు చేయలేకుండెను. ఐనను ఆతనికి దినము నకు రెండు రూపాయలకు తక్కువ లేకుండ లాభము వచ్చుచుండెను. చేతికి కొంత సొమ్ము చేకూరగనే ఆతడు మరి రెండు సామానుపడవ లను కొని వ్యాపారము చేయుచుండెను. ఇప్పు డాతనికి స్వతంత్ర జీవ నము చేయుటకు శక్తి కలిగెను. అందువలన నదియొడ్డున చిన్న ఇల్లు కట్టుట కాత డుద్దేశించెను. ఈ ఆలోచనలవలన ఆతని మనస్సునకు సంతోషము కలుగుచుండెను. సాధారణముగ ఈ సంతోష కల్పనల తోనే ఆతనికి తెల్లవారుచుండెను.

ఈ సమయమునందే పురపాలకసంఘమువారు వేశ్యల నిమిత్తము ఊరిబైట నిండ్లను కట్టుటకు నిశ్చయించిరి. ఈ యిండ్లను భగవంత రావు కంట్రాక్టునకు తీసికొనెను. నది కీవలగట్టున నిటికలు, సున్నము, పెంకులు, బట్టీలు పెట్టుట కాతనికి స్థలముదొరకలేదు. అందువలన ఆతడు నది ఆవలియొడ్డున బట్టీలు పెట్టించుచుండెను. ఆ సామాను లన్నిటిని ఈవలి యొడ్డునకు తెచ్చుటకు భగవంతరావున కొక పడవ కావలసివచ్చెను. దానిగురించి మాట్లాడుట కాత డొకనాడు పడవల రేవునకు వచ్చెను. అక్క డాతడు మోహానుని కలుసుకొని సంగతి చెప్పగా మోహానుడు తన పడవలను జూపెను. అత డందులో నొక పడవను మాట్లాడెను. పడవ రోజునకు రెండుసార్లు సామానులను తెచ్చుట కొప్పన్నమయ్యెను. భగవంతరావు మోహానునకు బయానా

నిచ్చి వెళ్ళిపోయెను.

డబ్బాశ మిక్కిలి చెడ్డది. ఐనను మోహానునకు అన్యాయముగ డబ్బార్జించు నుద్దేశము లేదు. ఇప్పు డాతనికి తన కర్తవ్యమును పరిపాలింపవలెనను చింత తలపై పెద్ద బరువవై నుండెను. ఆతడు దీని నుండి ముక్తిని పొందుటకే రాత్రింబవళ్ళు కష్టపడుచుండెను. అతడు దమ్మిడీ దగ్గరనుండి కూడ జాగ్రత్తగా కూడబెట్టసాగెను. ఇప్పు డేలాగునైనను డబ్బు కూడబెట్టి వేగముగా నిల్లు కట్టింపవలెనను చింత గట్టిగా పట్టుకొనెను. మోహానుడు ఝూమురాత్రి యున్న దనగానె లేచి రేవునకు వెళ్ళి పడవవానిని లేపి తాను కూడ పడవతో ఆవలియొడ్డునకు వెళ్ళుచుండును. పడవ తిరిగి వచ్చునప్పు డాతడు పడవవానితో సరదాగా మాట్లాడుచు వాని కుత్సాహము పుట్టించుచుండును. మధ్యమధ్య మోహానుడు కూడ స్వాయముగా తెడ్డువేయుచుండును. తాను తెడ్డు వేయునప్పుడు పడవ వేగముగా పోవుట జూచి ఆత డుత్సాహముతో నింకను వేగముగా తెడ్డువేయు చుండును. సరంగులు కళాసులు మొదట వారిలో వారు నవ్వుకొనిరి గాని తర్వాత ఆతని బలమును జూచి ఆశ్చర్యపడుచు "మనమను కొన్నకంటె నీతడు చాల బలవంతుడు. అవసరమువచ్చిన నీబాబొక్కడే పడవను నడపగలరు. కనుక మన ఆటలు ఈయనవద్ద సాగవు." అని వారిలో వారనుకొనుచు ఆతనివద్ద మరింత భయభక్తులుగా మెలగసాగిరి. ఈ విధముగ పట్టుదలతో ఎంత రాత్రియైనను రోజుకు రెండుసార్లు పడవను నడిపించుచుండెను. ఇట్లు రెండుమాసములు గడచెను. మోహానునకు దీనివలన చాలలాభమువచ్చెను. పని ఎక్కువగా నుండుటవలన ఆతడు మరి యిద్దరు నౌకరులను కుదుర్చుకొనెను.

మోహాను డిప్పుడు పడవవారి కందరకు నాయకుడుగా నుండెను. నదిరేవొడ్డున ఆతడు కట్టించుచున్న ఇల్లు కూడ తయారయ్యెను. ఆ

యింటియందు ఒక కచ్చేరీ చావడి పడకగది, సామానుకొట్టు వంటగది కలవు. ఆ యిల్లు చాల సదుపాయముగా నుండెను. పడకగదియందు రెండు పెద్ద మంచములు, ఒక బల్ల, రెండు కుర్చీలు, కచ్చేరీ చావడియందు పెద్దబల్ల, ఐదు కుర్చీలు, పెద్ద దీపము ఉండెను. ఇంటి ముందు చిన్నతోట దాని మధ్య నొక అరుగు వేయబడి యుండెను. ఇంటిమీదకు నుంచినుంది పూలతీగలను సొగసుగా ప్రాకించుట వలన యిల్లు పొదరింటివలె జూచుట కతి అందముగా నుండెను. కళాసులు, సరంగులు పని లేనప్పుడు తోటలోని అరుగుపై కూర్చుండి కబుర్లు చెప్పుకొనుచుందురు. మోహనుడు పైయుద్యోగస్థులతో ఉత్తరప్రత్యుత్తరములను జరిపి, సరంగులను, కళాసులను వెట్టిపనినుండి తప్పించి వారి కెంతో ఉపకారము జేసెను. అందువలన వారందరు మోహనుని యెడల భయభక్తులు కలిగి మెలగుచుండిరి. ఇప్పు డాతనివద్ద నిలువ ఉండుటవలన, మోహనుడు వీరి కవసరమువచ్చినప్పుడు వడ్డీ పుచ్చుకొనకుండనే బదులిచ్చుచుండెను. ఎక్కువగా పని యుండుటవలన తన వాడుక నిమిత్త మొక సైకిలును, ఖులాసాగా నున్నప్పుడు వాయించుకొనుట కొక హార్మోనియమ్మును అతడు కొనెను. ఇంకను తన వ్యాపారమును వృద్ధిచేసికొనుచు అతడు మరి రెండు, మూడు షికారుపడవలను కొనుటకు నిశ్చయించెను. ఒక్కక్షణమైనను తన దృష్టినుండి తొలగనట్టి సుశీలాదేవికొరకే మోహనుడీ ప్రయత్నములన్నియు జేయుచుండెను. స్వతంత్రముగ సంసారమును నడపగల శక్తి ఇప్పు డాతనికి కలిగెను. కాని పినతండ్రి అనుమతి లేనిదే సుశీలను దీసికొనివచ్చుట కాతనికి సాహసము లేకుండెను. భోజనసమయమునం దీ సంగతి నాతనితో జెప్పవలెనని మోహను డనుకొనుచుండును. కాని తీరా సమయమున కాతనికి సాహసము కలుగకుండెను.

మోహనుడు తాను జేయుచున్న వ్యవహారము గురించి పిన

తండ్రితో జెప్పకపోయినను, కంట్రాక్టరు భగవంతరావువలన నీసంగతి యంతయు కృష్ణశర్మకు దెలసెను. మోహనుని స్వయంకృషిని విని సంతోషించి మరి రెండు పడవలను కొని ఇచ్చి వ్యాపారమును వృద్ధి చేయవలెనని తలచెను. కాని మోహను డీ సంగతిని తనతో స్వయముగ జెప్పనందున తాను జోక్యము కలిగించుకొనుట అనుచితమని తలచి ఊరకుండెను. ఆతడు మోహనుని మొదటినుండియు ప్రేమతోనే జూచుచుండెను. కాని ఇప్పుడు గౌరవముతో కూడ జూచుచుండెను. సుభద్రమ్మ ఆతనిని తన కొమారునివలెనే ప్రేమించుచుండెను.

ఒకనాటిరాత్రి మోహనుడు తన ఇంటివసారాలో కూర్చుని నదివైపు ధ్యానముతో జూచుచుండెను. ఆ రోజున నెందుచేతనో ఆతని పడవలింకను తిరిగి రాలేదు. ఆతనిముందు బల్లపై దీపము వెలుగుచుండెను. ఆతనిచేతియందొక పత్రిక యుండెను. గాని ధ్యానము దానియందు లేదు. పడవ లింకను రాకపోవుటవలన నేమి యుపద్రవము వచ్చినదో యని ఆతడు భయపడుచుండెను. మోహనుడు పత్రికను బల్లపై పడవైచి, ఏమియు తోచక నదియొడ్డునకు బయలుదేరెను. ఇసుకపై వెన్నెల పిండి యారబోసినట్లతి రమణీయముగ నుండెను. చంద్రకిరణములు నదీతరంగములపైబడి సొగసుగా ప్రకాశించుచుండెను. మోహనుని ఇంటి ఎదుటి అరుగుపై చాలమంది సరంగులు, కళాసులు కూర్చొని వారిలో వారు మాట్లాడుకొనుచుండిరి. ఇంతలో నిద్దరు స్త్రీలు పట్నమువైపునుండివచ్చి, ఆ పడవవారితో, "మేము నది దాటవలసియున్నది. ఎవరైనను మమ్ము నది దాటించెదరా ?" యని అడిగిరి.

మోహను డా ప్రశ్నించుచున్న ఆమె కంఠస్వరమును పోల్చెను. ఆమె కమలయే. ఆ స్వరమును వినగనే మోహనుని గుండెలు దడ

దడ కొట్టుకొని కండ్లు చీకట్లు క్రమ్మెను. ఆత డొక్కదాటున అరుగు వద్దకు వచ్చి "కమలమ్మా! నీవిక్కడ కెట్లు వచ్చితివి?" అని తడ బడుచు ప్రశ్నించెను. కమల పోలికపట్టనట్లతనివైపు నిదానముతో జూచెను. ఆమె ప్రక్కనున్న స్త్రీ తలవంచుకొని దీపము వెలుగునుండి తప్పించుకొనుట కామె వెనుకకు పోయెను. కమల ఆశ్చర్యముతో, "ఎవరు? మోహనరావుగారా?" యని పలుకరించెను.

ఇంతలో అక్కడ నున్న కళాసులు, సరంగులు వారి చుట్టును జేరిరి.

మోహ—(వారితో)మీ రందరు మీమీఇండ్లకు వెళ్లిపొండి. వీరు మాబంధువులె. ఈరోజిక్కడనే యుండెదరు. (కమలతో) కమ లమ్మా! మీకుకుశలమేనా? సంగతు లేమిటి?

కమ—అంతా కుశలమే. నుదుటవ్రాసిన వ్రాత అనుభవించుచు న్నాము. ఈరోజున మీరు పత్రిక చూడలేదు కాబోలు? ప్రభాకర రావు ఏమివ్రాసెనో కాని ఆశ్రమమునందు చాల గడబిడపుట్టినది. మే మిద్దరము అక్కడ ఒక్కక్షణమున్నను ఆశ్రమము పూర్తిగ ఖాళీ ఐపోవును. కనుక అక్కడనుండి వచ్చివేయుటయే యుత్తమమునితలచి వచ్చితిమి. మావిషయమై కొంచము శ్రమ తీసికొని, నది దాటుట కొక పడవ కుదిర్చిపెట్టండి. అక్కడనుండి బండి చేసికొని స్టేషను నకు వెళ్ళి రైలు మీద రామవరము వెళ్లిపోయెదము.

మోహ—ఇప్పుడు మీరు మీఇంటికే వచ్చినారు. రామవరము వెళ్ళుటెందుకు? పాపము మీకు చాలకష్టము కలిగినది. కాని ఇప్పుడు మీరిక్కడకు రావడమువలన నాకతి సంతోషముగా నున్నది. ఎన్నిదినములనుండియో మీవద్దకు స్వయముగా రావలెనని తలచు చుంటిని కాని పని తొందరనుండి తీరుబడియైనది కాదు. నేను ఆరు నెలలనుండి పడవల వ్యాపారమును జేయుచున్నాను. ఇది మీ ఇల్లే. లోపలకు రండి.

కమల లోపలకు వెళ్ళెను గాని సుశీల ఆచీకటిలోనే నిలువబడి లోలోనఏడ్చుచుండెను. మోహనుని నోటినుండి వచ్చిన ఆమాటలు విని నప్పటినుండియు ఆమె లోలోనదుఃఖించుచునే కాలము గడుపుచుండెను. ఆమె మాటి మాటికి తాను మోహనుని ఎడల జూపిన నిర్లక్ష్యమునకు పశ్చాత్తాపమును పొందుచుండెను."నే నప్పుడాయన కాళ్లపై బడిన ఆయనకు నాపై తప్పక దయకలిగియుండును." అని ఎల్లప్పుడును విచారించుచుండెను. మోహనుని యాకార మెల్లప్పుడామె కండ్లకు కట్టినట్లుండి. ఆతనిమాట లెల్లప్పుడును చెవులలో ప్రతి ధ్వనించుచుండెను. ఆమాటలు కొంచము కఠినముగా నున్నను, సుశీల కవి ప్రేమ దయతో కూడుకొన్నట్లు తోచుచుండెను. ఇదియంతయు నాదినముల మహాత్మ్యమనియు, దీనిలో మోహనుని తప్పేమియు లేదనియు ఆమె తన మనస్సును సమాధానపరచుకొనుచుండెను."నిజముగా పాపమాయన ఏమిచేయగలరు? తల్లిదండ్రుల యాజ్ఞను పాలించుట ఆయన కర్తవ్యము కాదా? ఆయనను ధర్మమార్గమునుండి తప్పింప జూచుట న్యాయము కాదు......ఔను నేను నా స్వామిని నిర్లక్ష్యభావముతో జూచితిని. ఆరాధ్యదైవమును అగౌరవ పరచితిని. స్వార్థపరురాలైన ఆతని నవమానించితిని." అని ఎల్లప్పుడును తనలో తలపోసుకొనుచుండెడిది. దినములు గడచిన కొలదియు ఆమె విచారము వృద్ధియగుచుండెను. విచార, పశ్చాత్తాప, విరహములవలన ఆమె జ్యేష్ఠమాసపునదివలె క్రమక్రమముగ క్షీణించిపోవుచుండెను.

కమల ఇంటిలోనికి వెళ్ళగానె మోహనుడు మెల్లగా సుశీలవద్దకు వచ్చి కంపితస్వరముతో, "సుశీలా!" యని పిలచెను. కాని మరి అతని నోటినుండి మాటరాలేదు.

సుశీల ప్రేమచే వివశురాలయ్యెను. ఆమె తనలో, "ఈ జీవిత

మేమి శాశ్వతము ? నేను కొంత కాలము జీవించెదనో లేక చనిపోయెదనో ? ఈయన దర్శనము తిరిగి నాకు లభించునో లభించదో ? కాబట్టి ఈయన కాళ్ళపైబడి నా మనసుదీర నేడ్చెదను. ఇంతకన్న మంచిసమయము మరి నాకు దొరకుట కష్టము. నాథా ! మీరొక్కసారి నన్ను మీ చేతులతో లేవనెత్తి నా కన్నీటిని తుడిచిన నా జన్మము సఫలతనొందును. నేను జీవించియున్నంతకాలమును ఈ సౌభాగ్యమును తలచుకొని సంతోషపడుచుందును. ఇదివరకు మీ దర్శనమగునను ఆశనే వదలుకొంటిని. కాని దైవ మీ యవకాశమును కలిగించినప్పుడు నాకోర్కె నెందుకు తీర్చుకొనకూడదు ?" అని విచారించుచుండెను.

ఇట్లు విచారించి సుశీల వెక్కుచు మోహనుని కాళ్ళపైబడెను. కాని వాడిపోయిన పువ్వు గాలితాకుడు తగలగానె రాలిపోయెను. మోహను డామెను లేవనెత్తి, ఓదార్చుటకు వంగెను సుశీల స్థితి జూడగనె అతని గుండె బ్రద్దలయ్యెను. ఇదివర కాతడు నదియొడ్డున జూచినప్పు డామె, సౌందర్యమైన నూతన పల్లవమువలె నుండెను కాని ఇప్పుడు వసంతఋతువునందు వాడి రాలిపోయిన చిగురుటాకు వలెనుండెను.

మోహనుని హృదయము, నదియందు ప్రకాశించుచున్న చంద్ర కిరణములవలె చలించిపోవుచుండెను. ఆతడు వణకుచున్న చేతులతో ఆచైతన్యవిహీనమైన శరీరమును లేవనెత్తెను. ఇట్టి నిరాశస్థితియం దాతడు దేవునినే నమ్ముకొనియుండెను. ఆతడు కన్నీటితో "ప్రభూ! నేను చాల పాపమును జేసితిని. అతికోమలమైన హృదయమును మిక్కిలి నిర్దయతో తిరస్కరించితిని. కాని ఆ పాపముయొక్క ప్రాయశ్చిత్త మిప్పు డనుభవించుట అశక్యముగా నున్నది. ఈ యమూల్యరత్నము నింత త్వరలో నానుండి తీసికొనిపోకు. ఓ దయా

మయా! నాపై నీ కరుణాకటాక్షములను బ్రసరింపజేయుము.” అని దైవమును బ్రార్థించుకొనెను.

మోహనుడు అచేతనురాలైన సుశీలను మెల్లగా భుజముపైని వేసికొని తీసుకొని వెళ్ళి, మంచముపై పరుండబెట్టి, శోకాతురతస్వరముతో, “కమలమ్మా! ఈమె స్థితి ఎట్లు పరిణమించినదో చూడుము. నే నిప్పుడే వెళ్లి డాక్టరును తీసికొని వచ్చెదను.

కమల ఆతృతతో తన చెల్లెలివద్దకుపోయి జూచెను. సుశీల ముఖమంతయు చెమటతోనిండి కండ్లు మూతలుపడి యుండెను. నాడి యెక్కడను కనబడుటలేదు. ముఖము వివర్ణమై యుండెను. కమల వెంటనే విసనికఱ్ఱను దీసికొనివచ్చి, మెల్లగా విసరసాగెను. సుశీల స్థితిని జూచి, కమల కామెపై నెలలతరుబడినియున్న మనసులోని కోపము దయగా మారెను. ఆమె మోహానునివైపు తిరస్కారముగా జూచుచు, “ఇదియంతయు నీ యత్యాచారముయొక్క ఫలమే. నీ చేతులార జేసిన పాపఫల మనుభవింపకతప్పునా? నీ కఠినమైన చేతులీ కోమలపుష్పమును నలిపివేసినవి. నీ మోటుకాళ్ళతో నీ లేతమొక్కను మట్టిచేసినవి. నదియొడ్డున నీ వాడిన దయావిహీనములైన మాటలను వినినప్పటినుండియు నీమె కంటినీరు కట్టలేదు. ముఖము మీద నవ్వు మాయమయ్యెను. ఎంతయో బ్రతిమాలి చీవాట్లుపెట్టిన బలవంతముగా రెండుమూడు పిడచల యన్నమును మాత్రము తిని లేచిపోవుచుండెడిది. ఎవరి ప్రేమను జూచి నీవు మోహితుడవగుచుండెడివాడవో, ఎవరి పాదముల నొత్తుటకైనను సంకోచపడకుంటివో, అట్టి కమలయొక్క చెల్లెలనియే నీవామె నిట్లవమానపరచితివి! కమలను ప్రేమించునపుడు మాత్రము నీవు నీతల్లిదండ్రుల యాజ్ఞను పాలించు పుత్రుడవు కావా? అప్పుడు మాత్రము నీవు శ్రేష్ఠమైన బ్రాహ్మణ కులస్థుడవు కావా? అప్పుడు మాత్రము నీ

చెడు ప్రవర్తనవలన నీ వంశముయొక్క పేరుప్రతిష్టలు పోలేదా? ఇప్పుడు నీ వాకాశమునందలి దేవతవై తిరుగుచున్నావు కాబోలు? చీకటియందు ఎంగిలిమెతుకులకైనను సిద్ధము. కాని వెలుగులో ఆహ్వానించినను తిరస్కారము!! ఇది కేవలము ధూర్తత్వము, దగాబాజీతనము కాక మరి ఏమి? ఈ దుఃఖితురాలి మెడల నీవుచేసిన పాపమునకు తగిన ప్రాయశ్చిత్తము దేవుడే చేయును. ఈమె అనుభవించవలసినదేదో యిదివరకే అనుభవించినది. ఈరోజు జీవించినను రేపు చనిపోవచ్చును. కాని నీవు దీనిని తలచుకొని తలచుకొని బ్రతికియున్నంతకాల మేడ్చెదవు. మరియొక స్త్రీయైన ఈ మాటలు విన్న తర్వాత నీవైపు కన్నెత్తియైనను జూడదు. నిన్ను నిష్టురములాడియుండును. కాని అట్లుగాక నీమె ఎల్లప్పుడును నీ పేరే జపించుచుండెడిది. ఐనదేదో ఐనది. విచారించిన లాభ మేమి? కొంచము చల్లని నీళ్ళను దీసికొనిరమ్ము."

మోహనుడు నేరస్థునివలె తలవంచుకొని ఈమాటల నన్నిటినివినుచుండెను. ఈనిష్టురములవలన ఆతని హృదయము కొంత చులకనబడెను. ఆతడీ తిరస్కారములకు తాను తగినవాడనే యని తలచుచుండెను.

మోహనుడు చన్నీటిని దెచ్చి కమలకిచ్చి తాను సుశీలకు మెల్లగా విసరసాగెను. కమల సుశీల ముఖముపై ఆనీటిని మెల్లగా చల్లుచుండెను. కాని ఆమె కండ్లువిప్పి ఇంకను జూడలేదు.

మోహ—డాక్టరును తీసుకొని రానా?

కమ—తొందర పడవద్దు. చల్లదనము బాగా తగులగానే తెలివి వచ్చును. డాక్టరీ జబ్బునకు మందివ్వజాలడు.

మోహనరావున కిప్పుడు కొంత మనస్థిమితము కలిగెను.

మోహ—కమలమ్మా! నేను కల్పించి చెప్పుచున్నానని నీవనుకొన్నను సరే కాని నేను నిజమునే చెప్పుచున్నాను. వినుము. ఆ

దురదృష్టపు గడియనుండియు నామనస్సునకు కొంచమైనను శాంతి లేకున్నది. మాటి మాటికిని నా మూర్ఖత్వమునుగూర్చి నేను పశ్చాత్తాప పడుచున్నాను. నా నేరమునకు స్వయముగ క్షమాపణ వేడుకొనుటకై చాల సార్లు ప్రయత్నించితిని గాని ఏ ధైర్యము చూచుకొని వేడుకొనుట యని నాకు సంకోచము కలుగుచుండెడిది. ఇంటి నుండి సహాయము వచ్చునను నాశ ఎన్నటికిని లేదుకదా? పైడాబే కాని నాయొద్ద పస ఏమియు లేదు. అందువలన ఏలాగుననైనను నాలుగు డబ్బులు సంపాదించి చిన్న యిల్లు కట్టించవలెనను తాపత్రయములో యిన్నాళ్లు కొట్టుకొనుచుంటిని. మొదట నౌఖరీకొరకు తిరిగి తిరిగి నాప్రాణము విసిగి పోయినది. కాని నౌఖరీ ఎక్కడను దొరకలేదు.

చివరకు గోదావరీ దేవియే శరణమైనది. ఇప్పుడు. దేవుని దయవలన నావడవలు నదిలో బాహాటముగా తిరుగుచున్నవి. ఇక నా కితరుల సహాయముతో పనిలేదు. నా స్వంతార్జన తోనే ఈ యిల్లును కట్టించితిని. మరికొంత డబ్బుజాగ్రత్త పెట్టినతర్వాత ఊరిలో పెద్దయిల్లు కట్టించ వలెనని అనుకొనుచున్నాను. ఇప్పు డీమెకు కొంచమైనను చైతన్యము కలుగు చున్నట్లున్నదా? కమ॥ కోపమిప్పుడు కొంత శాంతించినది. "ఆ. ఇక నేమియు భయములేదు. ఇది కేవలము మూర్ఛ. పెదవులపై నలుపు క్రమ క్రమముగ తగ్గిపోవు చున్నది రెప్పలు కదులు చున్నవి."

మోహనున కిప్పుడు తన ఆరాధ్య దేవత ప్రత్యక్ష మైనంత సంతోషము కలిగెను. "కమలమ్మా నీవు నాకు చేసిన ఉపకారమును నే నెన్నడును మరువను. మరి యొకవిధముగా జరిగిన నేనుకూడ ఆత్మహత్య చేసికొన వలసినదే."

కమ—ఎందుకిప్పు డిటువంటి అమంగళపు మాటలు? దేవుని దయవలన నీమె ఔషధము లేకుండగనే స్వస్థత పొందగలదు. మీా

రిద్దరు చిరకాలము సౌఖ్యముగ జీవించెదరు గాక! నీవే యీమె .ఔషధము. నీ ప్రేమయే యీమెకు జీవనము. నీవు చేజిక్కిన తర్వాత నిక నీమెకు కావలసినదేమి? కాని నీవు కలలోకూడ ఈమె ననాదరము కాని అవమానము గాని చేసిన తిరిగి ఈమెకీ దశయే సంభవించును. అప్పుడు నీవెంత పశ్చాత్తాప పడినను లాభముండదు.

ఇంతలో సుశీల ఒత్తిగిలి దాహ మడిగెను. కమల మెల్లగా మంచి నీళ్లగ్లాసు నామెనోటి కందిచ్చెను. ఆమె రెండుమూడు గ్రుక్కల నీళ్లు త్రాగి తిరిగి మంచముపై పరుండి తన దృష్టిపై తనకే నమ్మకము లేనట్లిటునటు ఆశ్చర్యముగా జూడసాగెను. సుశీల తుటుక్కుపడి కండ్లు మూసుకొనియే కమలతో "ఇది మన ఇల్లేనా" యని అడిగెను.

కమ—అం. అం. ఇది మనయిల్లే.

సుశీ—ఆయన యెక్కడనున్నారు? ఆయన నొకసారి పిలువు. నా స్వామీ! నా జీవనాధారమా! నాకు దర్శనమియ్యి. దహించి వేయుచున్న నా బాధను నివారింప జేయుము. (కమలతో) నేనాయనతో మాట్లాడవలెను. ఇంకను ఎందుకు రాలేదు? ఐతే ఉండు. నేనే వెళ్ళెదను. ఇప్పుడు నాకు ఆయనకు దెబ్బలాట ఉన్నది. లేదులేదు. నేనాయనతో దెబ్బలాడను. ఇంతమాత్రమే అడిగెదను. "నన్ను వదలి ఎక్కడకును పోవద్దు. మీయిష్టము వచ్చినట్లు నన్ను చూడుడు. కాని నన్ను మాత్రము విడిచిపెట్టకండి. ఇక నీవియోగమును భరింపలేను. మీరునన్ను ప్రేమించుచున్నారని ఎరుగుదును. సరే, నేనుండుటకు మీరిష్టపడుట లేదుకాబోలు? కాని నేను మిమ్ములవిడిచి పెట్టను. పోనీ, అదికాదు. నేనుకూడ మీవద్దనుండను. కాని మన యిద్దరకు వివాహము మాత్రమైనది. లేదులేదు. వివాహము కాలేదు. పోని మీతో నేను వాదించను. కాని మిమ్ములను మాత్రము విడువను. మీరు తిరిగి ముఖము త్రిప్పిన బాగుగ జరుగదు. నేనీ ప్రపంచములో

దుఃఖపడుటకు పుట్టలేదు. నామీద ఆగ్రహించకండి. నలుగురు నవ్వెదరు. పరిహసించెదరు. ఇంతేకదా? నాకొరకీ మాత్రము సహించండి. తల్లిదండ్రులు విడిచిపెట్టెదరని భయమా? ఏమి మాటలాడుచున్నారు? తల్లిదండ్రులు తమ బిడ్డల నెందుకు వదలిపెట్టెదరు? చూడుము వానిని బ్రతిమాలి తీసుకొని వచ్చెదను. మా అత్తగారి కాళ్లు కడిగి నెత్తిమీద జల్లుకొనెదను. మామగారి కాళ్లు పట్టెదను. అప్పటికినీ వారికి నాపై దయరాదా?" ఇట్టిధోరణిలోనె సుశీలకుచిన్న నిద్ర పట్టెను.

కమ—(మోహనునితో) ఈ మెకు నిద్రపచ్చుచున్నట్లున్నది. ఈ నిద్రలో స్వస్థత చెందగలదు చాలారాత్రి యైనది. నీవింటికి వెళ్లు. కృష్ణశర్మగారు నీ కొరకు గాభరా పడుచుందురు.

మోహ—మరి ఇప్పుడు వెళ్ళను.

కమ—వద్దు, వద్దు, వారు నీకొరకెదురు చూచుచుందురు. సుశీల కిప్పుడు కొంచము స్వస్థతగా నున్నది చూడు. ఎంత సౌఖ్యముగా నిద్రపోవుచున్నదో ఇన్ని దినముల కీదినమే ఈమె సౌఖ్యముగ నిద్రపోవుచుండుట జూచితిని.

కాని ఎంత చెప్పినను మోహను డింటికివెళ్లుట కొప్పుకొనక వీధివరండాలో మంచము వేసికొని పరుండెను. అతని కెంతసేపటికిని నిద్రపట్టలేదు. అనేకములైన ఆలోచన లాతని మనస్సును కలతపెట్టుచుండెను.

## ౨౧

నారాయణదాసు న్యాయప్రియుడు. సాధుశీలుడు. న్యాయమెటులాగిన నాతడటుపోవుచుండును. ఈ విషయములో నాతనికి లేశమాత్రమైనను జంకుగాని అనుమానముకాని లేదు. కృష్ణశర్మ

న్యాయమార్గమునుండి తొలగెనని ఆతనికి తోచినతోడనె శర్మ సహ వాసమును విడిచిపెట్టుటయేగాక ఆతనితో మాట్లాడుట కూడ మాని వేసెను. కాని ప్రభాకరరావు ఆశ్రమవిషయమై విమర్శించుచు కమలాబాయియొక్క చరిత్రను వెల్లడించినతోడనె నారాయణదాసు నకు చాల కోపమువచ్చెను. అప్పుడు పట్నమునం దాతని కొక్క స్నేహితుడైనను లేకపోయెను. ఇట్టి సంస్థలకు అధ్యక్షత వహించి ఇతరుల సహాయసానుభూతులపై ఆధారపడవలసిన తనవంటివాడు ఒక పక్ష మవలంబించు టనుచితమని ఇప్పు డాతనికి యనుభవ మయ్యెను. ఆశ్రమమున కెడముగానుండి అందరతో మంచిగానున్న నే దానికి లాభము చేసినవా డగుదునని యాతను తలంచుచుండెను. అది సంధ్యాసమయము. నారాయణదాసు కూర్చుని, "ప్రభాకర రావుయొక్క ఆక్షేపణల కేమని జవాబు వ్రాయుదును? సంగతులు కొంతవరకు నిజమే. కమలాబాయి నిజముగ వేశ్యయే నేని సంగతి నెరిగియుండియే ఆమె నాశ్రమమునం దుంచితిని. కార్యాలోచన సభయం దీ విషయమై ఎవ్వరితోనూ సలహా చేయులేదు. నేను నిజ ముగ నీ యాశ్రమమును స్వంత సంస్థవలె తలచితిని. నా యుద్దేశము నిజముగ మంచిదైనను, దానిని రహస్యముగ నుంచుట చాల పొర బాటు" అని ఆలోచించుకొనుచుండెను.

ఏమి చేయుటకును నారాయణదా సింకను నిశ్చయించుకొనలేదు. ఇంతలో ఆశ్రమసంరక్షకురాలు వచ్చి, "అయ్యా! ఆనందబాయి, రాజాబాయి, గౌరి ఇంటికి వెళ్ళిపోవుటకు సిద్ధపడుచున్నారు. నేనెంత బోధపరచినను ఉండుటకు వా రొప్పుకొనుటలేదు."

నారాయణదాసు చికాకుతో "వెళ్ళిపోనిమ్ము. మరేమి ఫర్వా లేదు. వారికొరకు కమలను, సుశీలను ఇక్కడినుండి పంపివేయ జాలను."

నారాయణదాసు తనలో, "ఈ స్త్రీ లేమనుకొనుచున్నారో! కమలవారితో నుండుటకు కూడ పనికిరాకపోయినదికాబోలు! ఈమె యుండుటవలన ఆశ్రమమునకు చెడ్డపేరు వచ్చుననియు దాని వలన తమకు కూడ కళంకము వచ్చుననియు వీ రనుచున్నారు. ఔను. రావచ్చు. వెళ్ళనీ. నేను వీరి నడ్డుపెట్టను."

అప్పుడే తపాలాబంటొకడు ఉత్తరములను దెచ్చి, దాసున కైదుత్తరముల నిచ్చెను. ఒక యుత్తరమునందు "నేను నాకొమార్తె విద్యావతిని యాశ్రమమునం దుంచుట యనుచితమని తలచితిని. కనుక యామెను తీసికొనిపోవుటకు త్వరలోనే వచ్చుచున్నాను." మరియొక యుత్తరమునందు "ఆశ్రమమునుండి వేశ్యలను తగిలివేయని యెడల నేను చందా నిచ్చుట మానివేసెదను." అని భయపెట్టుచూ యుండెను. మూడవ యుత్తరమునందు కూడ నిట్లే యుండెను. తక్కిన రెండుత్తరములను ఆతడు విప్పనేలేదు. ఈ ఝుడిపింపు లాతని భీతుని జేయులేదు సరికదా యాతని మనస్సును మరింత దృఢపరచెను. అతడు మనస్సులో, "నేను వీరి బెదరింపులకు వణికిపోవుదునని అను కొనుచున్నారుకాబోలు! నారాయణదా సెవ్వరిని లక్ష్యపెట్టడని వీ రెరుగరు. ఆశ్రమము నశించిననునరే కాని నేను కమలా సుశీలల నిక్కడనుండి పంపివేయుజాలను."

నారాయణదాసుయొక్క అహంకారము ఆతని సద్విచారములను జయించెను. సదుత్సాహము. దురుత్సాహము వీటి రెంటియొక్క ఆవేగ మొక్కటియే. భేదము కేవలము వానియొక్క ఆచరణ యందు కనబడును.

తనమూలముననే ఈ గడబిడయంతయు జరుగుచున్నదని కమల తెలిసికొని మనస్సులో దుఃఖపడుచు, "అయ్యో! నే నిక్కడ కెందుకు

వచ్చితిని ? నేనింత శ్రద్ధతో నీవితంతువులందరకు సేవజేసినందులకు తగిన ఫలమిదియా ? మే మిక్కడనుండి వెళ్ళిపోవుటకు దానుగా రొవ్వకొనరు. కనుక ఇక్కడనుండి మేము రహస్యముగ వెళ్ళిపో వలెను. అప్పుడే ముగ్గురు వితంతువులు వెళ్ళిపోయిరి. ఇంకిద్దరు ముగ్గురు వెళ్లిపోవుటకు సిద్ధముగా నున్నారు. చాలమం దీవిషయమై తమవారి కు త్తరములు వ్రాసిరి. ఇంతకన్న మరియొక దిక్కు లేని స్త్రీలు మాత్రమే యేమియు అనలేక నోరు మూసుకొని ఊర కున్నారు. వారు కూడ మమ్ములను చూడగానె మూతులుముడుచు కొనుచున్నారు. ఇక నీ యవమానమును నేను భరింపలేను."

కమల యీ విషయమై సుశీల సలహా నడిగెను. సుశీల కిప్పు డేటు చెప్పుటకును తోచుటలేదు. శర్మ యాజ్ఞ లేనిదే అక్కడనుండి వెళ్ళిపోవుట యనుచితమని ఆమె యుద్దేశము. ఆమె యింకను ఆశను విడువలేదు. ఆమె తనలో, "నేను సంపూర్ణముగ కృష్ణశర్మగారి యాధీనమునం దుండుటవలన నిప్పుడు స్వేచ్ఛగా నా యిష్టమువచ్చి నట్లు వెళ్ళిపోవుట కేమి యధికార మున్నది ?" అని ఆమె తలచు చుండెను. సుశీల మాట్లాడకుండుట జూచి కమల "నీ కిష్టమున్న నీ వుండు కాని నే నెంత మాత్ర మిక్కడ నుండజాలను." అని ఖచిత ముగ నామెతో జెప్పివేసెను. సుశీలకు కూడ తా నక్కడుండుట అనుచితముగానే తోచెను. కనుక చివరకు తన యక్కతో తాను కూడ వెళ్ళిపోవుటకు నిశ్చయించి యామెతో "నేను కూడ నీతో వచ్చెద" నని చెప్పెను.

కమ—ఒకవేళ శర్మగారికి కోపమువచ్చిన ?

సుశీ—ఆయనకీ సమాచారమంతయు ఉత్తరము ద్వారా తెలియజేసెదను.

కమ—మోహనునకు కోపమువచ్చిన ?

సుశీ—ఆయన ఎట్లు దండించినను సహించెదను.

కమ—బాగా ఆలోచించుకో. తరువాత పశ్చాత్తాపపడిన లాభ ముండదు.

సుశీ—న్యాయముచేత నే నిక్కడ నుండవలసినదే. కాని నీవు లేనియెడల నే నిక్కడ నొక్క నిముషమైన నుండజాలను. ఐతే మన మిప్పు డెక్కడకు పోవుటయో మొదట ఆలోచించు.

కమ—నిన్ను రామవరములో దిగపెట్టెదను.

సుశీ—మరి నీవో ?

కమ—నాకు దేవుడే దిక్కు. తీర్థయాత్రకు పోయెదను.

ఇద్ద రక్కచెల్లెండ్రు చాలసేపు మాట్లాడుకొనిరి. తరువాత నిద్దరు కొంతసే పేడ్చిరి. రాత్రి ఎనిమిది గంటలు కొట్టినతోడనె నారాయణదా సింటికి వెళ్లిపోయెను. కమలా, సుశీల లిద్దరు కలసి ఎవ్వరు చూడకుండ నా రాత్రియే ఆశ్రమమును విడిచి వెళ్లిపోయిరి. రాత్రి యీ సంగతి ఆశ్రమవాసుల కెవ్వరికిని తెలియలేదు. తెల్లవారగానె చౌకీదారువచ్చి నారాయణదాసున కీ సంగతిని జెప్పెను. ఆతడు తత్తరపడుచు ఆశ్రమమునకు వచ్చి కమలగదిలోనికివెళ్లి జూచెను. ఎక్కడి వస్తువు లక్కడనే పడియుండెను. కాని ఇద్ద రక్కచెల్లెండ్రు మాత్రము కనబడలేదు. కృష్ణశర్మగారి కెట్లు ముఖము జూపుదునా యని ఆతడు చాల విచారించెను. ఆత డీ సంగతిని ఆలోచించుచున్న కొలదియు కమలపై కోపము వచ్చుచుండెను. ఇదియంతయు కమల పనియే యనియు, ఆమెయే సుశీలను మోసపుచ్చి తీసికొనిపోయి యుండుననియు, అని అత డనుకొనుచుండగా ఆతనికి కమల మంచముపై నొక యుత్తరము కనబడెను. ఆత్రుతతో దాసు దానినిదీసి చదువసాగెను. ఆ యుత్తరము కమల ఆశ్రమమునుండి వెళ్ళిపోవుచున్నప్పుడు వ్రాసినదే. దానిని చదివినతరువాత నాతనికి కొంత

ధైర్యము కలిగెను. కాని కమల వెళ్ళిపోవుటవలన ప్రతిపక్షులు తనను పిరికివానిగ తలచి పరిహసించెదరని యాతడు విచారించెను. చివర కాతడు వారి గదికి తాళమువైచి తిన్నగా శర్మగా రింటికి బయలు దేరెను. శర్మ ఈ సంగతినివిని, నిశ్చాంతపోయి వారిప్పు డెక్కడకు వెళ్ళియుందురని ప్రశ్నించెను.

నారా—రామవరము వెళ్లియుందురు.

కృష్ణ—ఔను. అక్కడికే వెళ్లియుండవచ్చును.

నారా—దూరప్రయాణమైనప్పటికి కమలజాగ్రత్తగా నేవెళ్ళగలదు.

కృష్ణ—ఔను. ఆమెకా మాత్రము తెలివి తేటలున్నవి.

నారా—వారొకవేళ రామవరము వెళ్ళకపోయిన ?

కృష్ణ—ఎవరు చెప్పగలరు ? ఎందులోనైననుపడి చచ్చిన చావ వచ్చును.

నారా—రామనాధముగారికి తంతినిచ్చి కనుక్కొనకూడదా ?

కృష్ణ—ఏముఖముసు పెట్టుకొని తంతి నిచ్చెదను ? ఆమె నామాత్రము రక్షించలేకపోయాను. ఇప్పు డామె విషయమై ఆయు నకు వ్రాయుటకు నాకు చాల సిగ్గుగా నున్నది. నేను మిమ్మలిని నమ్మితిని. మీారింత యజాగ్రత్తగా నుండెదరని తెలిసిన, ఆమెను నాయింటియందే యుంచుకొనియుందును.

నారా—నేనే వారిని పంపివేసినానని మీారనుకొంటూయున్నారు కాబోలు ?

శర్మ—అదికాదు. మీారు వారికి ధైర్యము చెప్పుచూ ఉండిన యెడల వారెన్నటికిని వెళ్లిపోయియుండరు. తీరా చేతిలోనుండి జారి పోయినతర్వాత నిప్పుడు నాతో చెప్పిన నేమి లాభము ?

నారా—తప్పంతా నామీాదే తోసివేయడానికి మీారు చూస్తూయున్నట్లున్నది.

——కృష్ణ—ఇం కెవ్వరిమీద పెట్టుతాను. ఆశ్రమసంరక్షకులు మీరే కదా ?

నారా—సుశీల ఆశ్రమమునకు వచ్చి ఆరు నెలలకు పైగాయైనది. మీరు దారితప్పియైనను ఒకసారి ఆశ్రమమునకువచ్చి యామె సంగతిని కనుగొన్నారా ? మీరెప్పుడప్పు డాశ్రమమునకువచ్చి యామె క్షేమసమాచారములు కనుగొనుచుండిన యామెకు ధైర్యముగా యుండి యుండును. మీరు మాటవరుసకైనను ఆమె క్షేమము కనుగొననియెడల ఆమె యేధైర్యము చూచుకొని అక్కడనుండగలదు ? ఇందులో నాతప్పు కూడ ఉన్నదని నేను ఒప్పుకొంటాను. కాని మీ తప్పు లేదని మీరు ధైర్యముగా చెప్పండి.

కృష్ణశర్మ కిప్పట్లో నారాయణదాసుపై చాల కోపముగానుండెను. మొదట ఆతడు దాసు అనురోధమువలననే వేశ్యాసంస్కరణ విషయమున కలుగజేసికొనెను. కాని చివరకు పనిచేయవలసిన అవసరమువచ్చినప్పుడు దాసు మెల్లగా తప్పించుకొనుటయే గాక కృష్ణశర్మ వేశ్యలయెడల సహానుభూతి కలిగియుండుట జూచి ఆయనమీద అనుమానము కూడ పడసాగెను. వారిద్దరు కూడ తమమనస్సులలోని మంటలను పైకి చెప్పక యొకరిపై నొకరు దోషారోపణ చేసికొనసాగిరి. శర్మ ఈవిషయము నూతగొని దాసును బాగుగ నెత్తిపొడవవలెనని జూచెను గాని ఆయన ప్రతి వచనములను విని నోరుమూసుకొనవలసి వచ్చెను.

కృష్ణ—ఔను. ఆ తప్పు నాదే.

నారా—మీమీద తప్పు త్రోసివేయడం నా యుద్దేశముకాదు. తప్పంతా నాదే, మీరామె నెప్పుడు నాకు వప్పజెప్పిరో అప్పుడు మీరు నిశ్చింతగా నుండుట స్వభావము.

కృష్ణ—లేదు, లేదు నిజముగ నిదియంతయు నా పిరికితనము యొక్క ఫలము. మీరామెను బలవంతముగ నావజాలరు.

కృష్ణశర్మ తన తప్పు నొప్పుకొని వాదమునంతను తారుమారు జేసెను. మనములొంగి ఇతరులను లొంగదీయగలము కాని కోపపడి లొంగదీయలేము.

నారా—బహుశః మోహనరావుగారి కీ విషయమై తెలిసి యుండవచ్చును. ఒక్క సారి ఆయనను పిలవండి.

కృష్ణ—వాడు రాత్రి ఇంటికి రాలేదు. వా డిప్పుడు పడవల వ్యాపారమును జేయుచున్నాడు. నదియొడ్డున చిన్న ఇల్లును కూడ కట్టించినాడు. రాత్రి అక్కడనే యుండిపోయి యుండవచ్చును.

నారా—బహుశ కమలా సుశీల లక్కడికే చేరుకొనియుంటారు. నన్నా సంగతి కనుక్కోమన్నారా?

కృష్ణ—మీరు భ్రమపడుచున్నారు. కాని ఆలా జరిగియుండదు. ఆత డంత ఉదారస్వభావము కలవాడు కాడు. వీరి నీడను జూచిన వరుగెత్తునంతటి భయ మాతనికి.

ఇంతలో మోహనరావా గదిలోనికి వచ్చెను.

కృష్ణ—రాత్రి ఎక్కడకు వెళ్ళినావు? తెల్లవార్లు నీ కొరకు బెంగ పెట్టుకొన్నాము.

మోహ—(తలవంచుకొని నేలవైపు జూచుచు) మీ రాలాగు బెంగపెట్టుకొంటారని నే ననుకొంటూనేయున్నాను. రాత్రి రావడానికి వీలులేనంత అవసరమైన పనివచ్చినది. వచ్చి చెప్పుటకైనను వీలుపడినది కాదు. నేనిదివరకల్లా ముఖమూటపడి మీతో ఒకసంగతి చెప్పలేదు. కొన్ని నెలలనుండి నేను పడవలనుకొని గోదావరిలో నడిపించుచున్నాను. గోదావరి యొడ్డున నొక చిన్నఇల్లు కూడ కట్టించినాను. ఈవ్యవహార మును, దగ్గరనుండి జరిపించిన మరియూ ఎక్కువ లాభముగానుండు నని నాకు తోచుచున్నది. అందువలన ఆయింటియందుండుటకు నాకనుమతి నిమ్మని మిమ్ములను ప్రార్థించుచున్నాను.

కృష్ణ—ఈవిషయమై భగవంతరావు నాతో ఒకసారి చెప్పినాడు. కాని నీ వింతవరకు నాదగ్గరదాచడం ఏమీ బాగులేదు. మొదటనే నాతో చెప్పియుండిన నేను కూడ కొంత సహాయముచేసియుందును. పోనీ మంచిపనే చేశావు. నేను మరివకలాగ అనుకోను. నీస్వయం కృషి జూచి నాకు చాలా సంతోషముగానున్నది. కాని నే నిక్కడ ఉంటూ యుండగా నీవు వేరేఉండడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. మరికొన్ని పడవలు కూడా కొని వ్యాపారము జేసిన ఇంకను ఎక్కువ లాభముండదా?

మోహ—నేనూ ఆప్రయత్నములోనే యున్నాను. కాని ఇంకా కొన్ని పడవలు కొని వ్యవహారము పెంచిన, నదియొద్దున నుండిన గాని పని ఎంతమాత్రము జరుగదు.

కృష్ణ—నీవేమన్నా సరే కాని ఒక్కవూళ్ళోనే ఉండి మనమిద్దరం వేరు పడుట నాకేమి సమాధానంగా లేదు. కొంచం నష్టం వచ్చినా సరే కాని, నువ్వు వేరు పడడం మాత్రం నాకేమీ ఇష్టం లేదు.

మోహ—లేదు. బాబయ్యా, మీరు నాప్రార్థన అంగీకరింపక తప్పదు. నే నాలాగు వేరుండక తప్పనిసరి వచ్చినది.

కృష్ణ—ఏమిటా తప్పనిసరి? నీ సంకోచమేమిటో ఎందుకు స్పష్ట ముగా చెప్పకూడదు?

మోహ—నేను మీ యింటియందుండిన మీకు కూడ ననవసరపు చిక్కులు వచ్చును. ఇదివరకల్లా పిరికితనముచేతను, లోకనింద భయముచేతను, అజ్ఞానముచేతను నెరవేర్చలేని నాకర్తవ్యమును ఇప్పుడు నెరవేర్చుటకు స్థిరపరచుకొన్నాను. నేను మీ కుమారుడను. నాకే కష్టము వచ్చినను మీసీదనే చేరుదును. ఏ విషయమైనను, మీతో చెప్పక చేయను గాని వేరుగా మాత్ర ముండెదను. నాప్రార్థన అంగీక రించ వలసినది.

నారాయణదాసిక ఊరుకొనలేక మాట కడ్డమువచ్చి, "కమలా సుశీలలను నిన్న మీరు కలుసుకొన్నారా?" అని ప్రశ్నించెను.

మోహనుని ముఖము సిగ్గుచే ఎఱ్ఱబడెను. ఆతడు మెల్లగా "ఆఁ" అనెను.

కృష్ణశర్మ ఇప్పుడు గొప్ప ధర్మసంకటములో జిక్కుకొనెను. ఆతడు వారి విషయమై అడుగలేదు. మానలేదు. ఇంతవరకు సుశీల విషయములో తాను నిర్దోషినినియే ఆత డనుకొనుచుండెను. ఈ అన్యాయమంతయు తన అన్నయే జేసెననియు, మోహను డాతడెట్లు చెప్పిన నట్లే చేయుననియు ఆతడనుకొనుచుండెను. కాని ఇప్పుడు మోహనుని తెగువజూచి ఆతని కెడముగా నుండుటయే యుత్తమమని తలచెను. లోకు లేమనుకొందురో యను భయమాతని కిన్నటికిని లేదు. కాని తనయాసరా జూచుకొనియే మోహను డీ పసిని చేసెనని తనయన్న కెక్కడ కోపమువచ్చునో యనియే ఆతని భయము. ఒకసారి గోపాల శాస్త్రికి కోపమువచ్చిన మరికుమించుటయన్నమాట వట్టిది.

కృష్ణశర్మ చాలసేపి సందిగ్ధములో మునిగిపోయెను. చివరకాతడు మోహనునితో "మోహనా! ఈసమస్య చాల కఠినమైనది. నా పూచీపైని నేనేమియు చేయజాలను. అన్నయ్య ఆజ్ఞలేనిదే నే నౌననిగాని, కాదని కాని కూడ సలహా చెప్పజాలను. నాయుద్దేశములను నీవెరుగుదువుకదా? నీవు నీ కర్తవ్యమును నెరవేర్చుటకు స్థిరపరచుకొన్నందుకు నాకు చాల సంతోషముగా నున్నది. దేవుడు నీకు మంచిజ్ఞానమును ప్రసాదించినాడు. కాని అన్నిటికంటె అన్నయ్యగారి ఆజ్ఞయే నా కెక్కువ. ఐనను వారిద్ద రక్కచెల్లెండ్రు ప్రత్యేకముగా నుండుట కేర్పాటు చేసిన అంత బాధయుండదు. అట్లుచేసిన వారికి కూడ నంత కష్టముండదు. ఇంతకంటె మరి నాకు సామర్థ్యములేదు. తరువాత అన్నయ్య కేలాగిష్టమైతే ఆలాగు చేద్దాం"

మోహ—నాన్నగారేమంటారో మీ రెరుగరా ఏమిటి?

కృష్ణ—ఔను. తెలియకేమి?

మోహ—ఐతే ఆయన సలహా తీసుకొనుటవలన లాభమేమిటి? తల్లితండ్రుల యాజ్ఞయైన నా ప్రాణమునైనను ఇచ్చుటకు సిద్ధముగానున్నాను. కాని వారిని సంతోషపెట్టుట కొరకు నిరపరాధురాలి యొక్క గొంతుకమాత్రము కోయజాలను.

కృష్ణ—వారిద్దరక్కచెల్లెండ్రను వేరుగ నుంచుటవలన వచ్చిన నష్టమేమి?

మోహ—(కోపముతో) నే నేదైనను చెడుపనిజేసిన భయపడవలెను. గాని మంచిపనికి దావరికము భయము ఎందుకు? సుశీలను పోషించుట నా కర్తవ్యము. ఇంతవరకు పూర్తికాని వివాహసంస్కారము రేపు గోదావరి యొడ్డున ఇంటిలో పూర్తియగును. మీరు నాయందు దయయుంచి రేపక్కడకు వచ్చిన మహాభాగ్యమని తలచెదను. లేనియెడల నాకు దైవమే తోడు.

ఇట్లుచెప్పి మోహనరావు ఇంటిలోనికి వెళ్లెను. సుభద్రమ్మ యాతనిజూచి "బాగా మాయమైనావు లే. రాత్రెల్లా నీకొరకు కొక్కలాగు బెంగపెట్టుకున్నాము. ఎక్కడ ఉండిపోయావేమిటి?"

మోహనుడు రాత్రి జరిగిన వృత్తాంతమంతయు పినతల్లితో జెప్పెను. కష్టసుఖములు జెప్పుట కాతనికి పినతండ్రియొద్దనున్న జంకు పినతల్లియొద్ద లేదు.

సుభ—అతని సాహసమును ప్రశంసించుచు, తల్లితండ్రుల భయమువలన ఎవరైనను చేసుకొన్న పెళ్లామును వదలుకుంటారా? లోకులు నవ్వితే నవ్వుతారు. కాని వారి భయమువలన ఒకరి గొంతుక కోస్తామా ఏమిటి? మీయమ్మ ఏమంటారో యని భయము కాని లేకపోతే ఆపిల్లను నావద్దనే ఉంచుకొందును.

మోహ—నాకు అమ్మనాన్నా భయము లేదు.

సుభ—ఇన్నాళ్లు వాళ్ల ఇష్టప్రకారమే నడచుకొన్నావు. పాపం చాలా కష్టాలు పడ్డది. అది కాక ఆపిల్ల బుద్ధిమంతురాలుట. మరి యొకరైతే తల్లిదండ్రులను నిర్లక్ష్యపెట్టి ఈపాటే ఆపిల్లను తీసికొని వచ్చియుందురు. నీవుకనుక ఇన్నాళ్లవరకు ఓర్చుకొన్నావు.

* * * * * *

సుభద్రమ్మా! నీవీ మాటలను పవిత్రభావముతో ననిన యెడల ఆదరపాత్రురాలవే. కాని నీవీసమయమునందు ఈర్ష్య, ద్వేషముతో కూడుకొని యున్నావు. నీవు మోహనునకు పురెక్కించి ఆతని దృష్టియందు నీతోటి కోడలను తక్కువ పరచుటకు జూచుచున్నావు. మరియుమాతృహృదయమును గాయపరచి నీవు సంతోషపడుచున్నావు!

* * * * * *

మోహనుడు వెళ్లిపోయిన తర్వాత నారాయణదాసు కృష్ణశర్మతో, "మీామనస్సులోని మాటేయైనది కదా! ఇంకా వెనుకముందు లెట్లాలో చిస్తూయున్నారు!"

కృష్ణశర్మ ఏమియు జవాబు చెప్పలేదు.

నారాయణదాసు తిరిగి ఆతనితో, "ఈప్రస్తావన మొదట మీారే చేయవలసినది. కాని అట్లు చేయక దానిని అంగీకరించుటకు కూడ నింత సంకోచించుచున్నా రేమి?"

కృష్ణశర్మ దీనికి కూడ జవాబు చెప్పలేదు.

నారా—ఆతడు తన భార్యతో వేరుండిననేమి తప్పు! మీాదగ్గర నుంచుకొనరు. వేరుండనివ్వరు. ఇదేమి న్యాయము!

కృష్ణ—(రోషముతో) మీారే ఈచిక్కులలో నున్న యెడల బాగుగ బోధపడియుండును. ఒకరికి చెప్పుట సులభము. నేనూ మీావలె నితరులకు బోధించగలను. మీారే కదా వేశ్యా సంస్కరణ

విషయమై పెద్దపెద్ద ఉపన్యాసము లిచ్చి, పని చెయ్యవలసిన అవసరము వచ్చి నప్పుడు ముఖము మాటు వేశారు. మిగిలిన వాళ్లనుకూడ మీలాగే అనుకోండి. నే నేపనినైనను చేయగలను కాని అన్నయ్యకు మాత్రం కోపము తెప్పించ జాలను. ఆయనను సంతోషపెట్టుటకు నాసిద్ధాంతములను మార్చుకో వలసివచ్చినను మార్చుకొందును

నారా—జన్మముతో వేశ్యలైన వారిని బాగు పరచ గలనని నే నెప్పుడును మీతో ననలేదు. ఇంటిలోని వారి అనాదరణవలనను, చెడు సహవాసమువలనను పతితులైనవారికిని జన్మముతో వేశ్యలైన వారికిని ఏమియు భేదము లేదని మీ రనుకొనుచున్నారు కాబోలు. సాధ్యాసాధ్యములైన రోగముల కెంతభేదమున్నదో వీరియందు కూడ నంత భేదమున్నదని నాయుద్దేశ్యము. అప్పుడే అంటుకొన్న నిప్పును మీరు ఆర్పగలరు కాని లోపలనుండి అంటుకొన్న పర్వత మును ఆర్పజాలరు. అట్లార్ప జూచుట వెట్టివాని లక్షణముగాని బుద్ధిమంతుల లక్షణముకాదు.

కృష్ణ—కాని మీరు చివరకు నాకుసహాయమైనను చేయవలసి యుండెను. మీరు ఒక్కగంట మాత్రము నాతో వేశ్యల ఇండ్లకు వచ్చినట్లైన, దేనిని మీరు జ్వాలాముఖపర్వత మనుకొనుచున్నారో, అది కేవలము ఆరిపోయిన బుగ్గి కుప్పయని గ్రహించి యుందురు. మంచివారు, చెడ్డవారు అందరిలోను ఉందురు. వేశ్యలలో కూడ మంచివారు లేక పోలేదు. వారిలో దైవ నిష్ఠాపరులు, పాప భీతులు బాగుపడ నుద్దేశము కలవారు, ఎంత మంది ఉన్నారో జూచిన మీ రాశ్చర్య పడుదురు. వారిని జూచినప్పుడు నాకెంతో ఆశ్చర్యము కలిగినది. వారికేదైనను చిన్న ఆసరా దొరికిన, ఆపాప కూపము నుండి పైకి వచ్చివేయుటకు సిద్ధముగా నున్నారు. వారు మొదట నాతో మాట్లాడనైనను మాట్లాడేవారు కారు. కాని నేనే ప్రస్తావన

మీ బాగుకొరకే ప్రవేశపెట్టితిననియు, దీనివలన మీకు దురాచార ములనుండియు, దుర్మార్గులనుండియు, దుష్టత్వమునుండియు, ముక్తి పొందగలరనియు, నేను బోధపరచి చెప్పిన తర్వాత వారికి నాపై క్రమక్రమముగ విశ్వాసము కలుగసాగెను. పేరు చెప్పను గాని చాల మంది ధనవంతులగు వేశ్యలు నాకీ విషయమై ధనసహాయమును జేయుటకు సిద్ధముగా నున్నారు. కొంతమంది తమ కొమార్తెలకు వివాహము జేయుటకు కూడ సిద్ధముగ నున్నారు. మరియు రామా నందస్వామియొక్క ఉపదేశమువలన వారిలో మంచి ప్రబోధము కలుగగలదని నా కాశ కలదు. అంతా ఎగతాళి జేయువారే కాని సహాయము జేయువా రొక్కరునూ లేరు. అదియే చాల విచారకర మైన సంగతి. వేశ్యబాలికల నుంచుటకును, వారికి తగిన శిక్ష గరు పుటకును, ఒక ఆశ్రమ మివ్వడు చాల అవసరముగా నున్నది. కాని నా మాట వినువా రెవ్వరు?

నారాయణదా సీ మాటలన్నియు శ్రద్ధతో విన నుండెను. కృష్ణ శర్మ చెప్పిన సంగతులన్నియు ఆయనకు సబబుగానే తోచెను. అందువలన నాతని మాటలపై దాసునకు విశ్వాసము కలిగెను. తా నే కార్య మసాధ్యమని తలచెనో అది నిజముగా సాధ్యమేయని యాతని కప్పుడు బాగుగ బోధపడెను.

నారా—రామదేవుగారితో మీరీ విషయమై ఏమియు మాట్లాడ లేదా?

కృష్ణ—ఆc. మాట్లాడినాను. ఔనన్నది కాదని, కాదన్నది ఔనని ఊరికే వాదనలు, విమర్శనలు, గడబిడ చేయడమే కాని పని చెయ్యడని అతని సంగతి మీ రెరుగరా!

## ౨౨

మోహనరావుయొక్క వివాహసంస్కారము ముగిసెను. సరియొద్దున వారి చిన్న యింటిని బాగుగ నలంకరించిరి. ఈ కార్యమునకు బంధువులు కాని స్నేహితులు కాని రాలేదు. కృష్ణశర్మ ఆ రోజుననె తమ గ్రామమునకు వెళ్లి అన్నతో నీ సంగతినంతయు జెప్పెను. గోపాలశాస్త్రి ఈ సంగతిని వినినతోడనే మండిపడుచు, "ఆదార్భాగ్యుని నరికివేసెదను! వాడు తన మనస్సులో నేమనుకొన్నాడో! నా సంగతి ఎరుగడుకాబోలు!" ఇంతలో జానకమ్మ మాట కడ్డము వచ్చి "ఏడ్చుచు నే నీ రోజుననే బయలుదేరి వెళ్ళి వాడిని మంచి మాటలాడి బోధపరచి తీసుకొని వస్తాను. వాడు వట్టి అమాయకుడు. వెఱ్ఱిబాగులవాడు. ఆ నీచురాలు కమల మాయలలో పడిపోయినాడు. నామాట వాడెప్పుడూ మీరడు." అని ఏమేమో చెప్పుచుండగ గోపాలశాస్త్రి ఉగ్రుడై భార్యను తిట్టుచు "నువ్వు వాడి దగ్గరకు వెళతానన్న సంగతి ఎత్తుతే నీగొంతుక పిసికి నా గొంతుక పిసుకుంటాను. వాడికి సిప్పాలలో గెంతవలెనని యున్నది. గెంతనీ. పాలు త్రాగే చిన్నపిల్లవాడా ఏమిటి? వాడు వట్టి మోటపశువు. వా డడుక్కని తినకపోతే నన్నప్పుడను. నా ప్రాణం రవంతా గుటుక్కుమనగానె ఈ యాస్తి అంతా రాజాలాగు అనుభవించవలెనని అనుకుంటూ యున్నాడుకాబోలు? ఇది ఏమీ పిత్రార్జితము కాదు. వాడు హక్కుగా అనుభవించడానికి. ఇదంతా నా కష్టార్జితం. వాడి కొక్క చిల్లిగవ్వైనా దక్కనివ్వను. అంతా యే దేవుడిగుడి పేరనో వ్రాసేస్తాను" అని మండిపడుచుండెను.

ఈ కబురు నిముషములో గ్రామమంతయు వ్యాపించెను. ఎక్కడ నలుగురు చేరిననూ యీ గుసగుసలే. వైద్యనాథను కనబడినవారంద

రత్నా॥ "నింతింత ఘోరాలు జరుగుతూఉంటే ఇంక ఈ ప్రపంచము నందు ధర్మ మెక్కడ నిలుస్తుంది? ఎక్కడ జూచినా మాలకూడే. ఇంత అరాచకము? నేనే మతకర్తనైతే వీరి పాగరణచివేసి యుందును. పట్నవాసాలు మరిగి ఇప్పటివాళ్లు శుభ్రముగా చెడి పోతూ యున్నారు. మోహనరా వేముఖంపెట్టుకొని వ్రాళ్లోకి వస్తాడో చూస్తాను." అని అనుచుండెను.

శర్మ చాల రాత్రివరకూ అన్నవద్దనే కూర్చుని ఉండెను కాని అతడేమాత్రము మోహనుని ఉబుసెత్తినను శాస్త్రి అతనివైపు నిప్పులురాలు కండ్లతో చూడగానే అతని నోరు కట్టుబడిపోవు చుండెను. చివరకు శాస్త్రి పరుండబోవుటకు లేవగనే శర్మ మాతా శుడైనను మొండిధైర్యము తెచ్చుకొని "అన్నయ్యా! మోహనుడు మనతో వేరుపడినను మనవాడేకదా? వాడు మంచిచేసినను, చెడ్డ చేసినను, వాడికే అపకీర్తివచ్చినను, అది మనకు కాదా? ఈ సంగతంతయు తెలిసినవారు మనలను నిర్దోషులనియే అనవచ్చును. కాని లోకులు మోహనుని మనలను ఒక్కలాగే అనుకుంటారు. పాము చావకుండ కట్టె విరిగిపోయిన నేమి లాభము? ఒక్కప్రక్క రెండు నష్టములు ఉన్నవి. చెడ్డపేరు వస్తూయున్నది. పిల్లవాడు దూరమై పోతూయున్నాడు. రెండవప్రక్క ఒక్క నష్టమేయున్నది. మనకు చెడ్డపేరువచ్చినా మనవాడు మనదగ్గరే యుంటాడు. అందువలన మనము మోహనునివద్దకు వెళ్ళి బోధపరచి చెప్పుదాం. ఒకవేళ వాడు మనము ఎంత చెప్పినా వినకపోతే.........శాస్త్రి మాట కడ్డమువచ్చి కోపముతో "వాడు మన మాట వినకపోతే ఆ రాతిసిని వాడి మెడకు కట్టమనేనా నీ యుద్దేశము? ఆ పనిమాత్రం నా వల్లకాదు. ఒకసారి కాదు, రెండుసార్లుకాదు లక్షసార్లు చెప్పుతూ యున్నాను. నే నీఘోరమున కొడికట్టుకొనలేను."

ఒక్కక్షణమైన తరువాత గోపాలశాస్త్రి శర్మను జూచి తిరస్కారముతో "ఇదంతా నీ కళ్ళముందు జరగడం. నీ కొక్కపిసరైనను తెలియకపోవడం చూడగా నాకు చాల ఆశ్చర్యముగా నున్నది. వాడు పడవలు కొని వ్యాపారము చేస్తూయున్నాడు. ఇల్లు కట్టించాడు. ఆ యిద్దరు రాక్షసులను ఇంటిలో పెట్టుకున్నాడు. ఇంత జరిగినా నువ్వు కళ్లు మూసుకొనే కూర్చున్నావా? నువ్వేమో వాడిని బాగుచేసి, సిర్వాకంచేస్తావని నమ్మి నీదగ్గరకు వాడిని పంపాను. నువ్వు కళ్లు మూసుకొని చెవులలో వేళ్లుపెట్టుకొని కూర్చుంటావని నాకేమి తెలుసును? కొంచమైనను నువ్వు వాడిని గురించి కనుక్కుంటూవుంటే వాడింత మీరిపోయి యుండడు. నీకు చేతకాకపోతే నాపేర సూచనగానైనను వ్రాసియుంటే నేనే స్వయముగవచ్చి మంచిమాటలాడి, ఏవిధముగానైనను వాడి నిక్కడకు తీసికొనివచ్చి యుందును. తీరా కొంపమునిగిపోయిన తర్వాత ఇప్పుడా నాకు సలహా చెప్పడానికి పరుగెత్తుకొని వచ్చావు? నీ నంగినంగి మాటలు చూస్తే నాకు నీమీద కూడా అనుమానముగా నున్నది. తప్పకుండా నీవు కూడ అందులోచేరి ఉంటావు. నీ వెరిగుండే వాడిని నూతిలో ఉరకనిచ్చావు. నేను నీకేమి అపకారము చేసినానని నామీద నీవిధముగ కశి తీర్చుకుంటూవున్నావు? సరే! నేను దీనికి తగినట్టే చేస్తాను. రేపుప్రొద్దుటే నాతరపున ఒక దానపత్రంవ్రాయి. "విడిగా నున్న మూడు ఎకరముల భూమీ తప్ప మిగిలిన ఆస్తియంతయు సీతారామస్వామి కోవెల కిచ్చివేయుచున్నాను." ఇక్కడ నీకు వ్రాయుటకు వీలు లేకపోయిన కళ్యాణపురము వెళ్ళి వ్రాసి పంపు. నేను సంతకముచేసి తరువాత రిజిస్ట్రీ చేయిస్తాను." అని ఇట్లు చెప్పి గోపాలశాస్త్రి పరుండుటకు వెళ్ళిపోయెను. కాని శర్మకు మాత్రము ఆత డాడిన మాటలు చాల బాధించుటవలన ఆ రాత్రి నిద్రపట్టలేదు.

ఏ నిందనుండి తప్పించుకొనుటకు తన సిద్ధాంతములను త్రోసిపుచ్చి తన స్నేహితుల హాస్యాస్పదమునకు పాత్రుడయ్యెనో ఆ నింద ఆతనికి తప్పినదికాదు. ఇంతేకాక అన్నకు కూడ తనమీద అపనమ్మకము కలిగినది. ఇప్పు డాతనికి తన పొరబాటు స్పష్టముగా కనబడు చుండెను. నిజముగ అతడు మొదటినుండియు జాగ్రత్తగ ఆతని గురించి కనుక్కొంటూయుండినయెడల ఈ స్థితి రాకపోయి యుండును. ఈ వేదనావిచారములయందు, ఒక బాలిక రక్షింపబడినదికదాయను సంతోష మాతనికి కలుగుచుండెను.

తెల్లవారినతోడనే ఆతడు తిరిగి కళ్యాణపురము వెళ్ళిపోవుటకు ప్రయాణమగుచుండగ జానికమ్మ అతనివద్దకువచ్చి, ఏడ్చుచు, "బాబూ! మీ అన్నయ్యగారి మూర్ఖపుపట్టు చూచినావా? పిల్ల వాని గొంతుక కోయుటకు సిద్ధపడుచున్నారు. కాని నువ్వు మాత్రం ఆలోచించి పనిచెయ్యి. పొరబాట్లు పెద్దవాళ్ళకు సహితము ఒకప్పుడు వస్తాయి. వాడు వట్టి అమాయకుడు. వాడిమీద నువ్వుమాత్రము కోపగించుకోకు. ఎవరేనా కఠినముగా ఉంటే వాడు సహించలేడు. వాడి మనస్సు విరిగి ఏదేశాలకైనపోతే నేను బ్రతుకలేను. వాడి క్షేమం కాస్త కనుక్కొంటూఉండు. వాడు భోజనానికేమీ ఇబ్బంది పడకుండా చూస్తూఉండు. వాడిక్కడ నున్నప్పుడు ప్రత్యేకముగా ఒక గేదెను వాడికొరకు ఉంచేవారము. వాడికి పాలంటే ఎంతో యిష్టము. ఎన్ని పాలు తాగినా వద్దనేవాడు కాడు. కాని పప్పూ అన్నములో నెయ్యి వేస్తే ఇష్టముయేదికాదు. నేను వాడికి తెలియ కుండా పేరుకొన్న నేతిముద్ద అన్నములో కప్పెట్టి వడవేసేదాన్ని. ఇప్పు డీ సంరక్షణ అంతా ఎవరు చేస్తారు? పాపం! బిడ్డడేమి కష్ట పడిపోతున్నాడో? ఇక్కడ తినేవాళ్ళు, వాడుకొనేవాళ్ళు లేక ఎక్కడి వస్తువు లక్కడపడి దొర్లుతూ ఉన్నాయి. అక్కడవాడి వస్తువుల

కోసరము ఇబ్బందిపడుతూ ఉంటాడు. బాబూ! వాడిచేతితో వాడే పడవ నడుపుతూయుంటాడాఏమిటి ?" అని ప్రశ్నించెను.

కృష్ణ—లేదు. ఇద్దరుముగ్గురు సరంగులను జీతముల కుంచినాడు.

జాని—ఐనా వాడు ఎండలోను, వానలోను తిరగాలికాబోలు? జీతాలు ఇస్తేమాత్రం కనుక్కోకపోతే నౌఖర్లు తిన్నగా పనిచేస్తారా? నాకు మరియొక ఆసరాలేదుకదా? నిన్నేనమ్మి, వాడిని నీకే వప్ప చెప్పివేశాను. వాడి నొక అనాథునిగ తలచి, వాడి క్షేమ సమాచారములు కనుక్కుంటూ ఉండు. నువ్వు వెయ్యేళ్లు ఆయుష్షుపోసుకొని వర్ధిల్లాలి. నేను కార్తీకమాసములోవచ్చి వాడిని తప్పకుండా చూస్తాను. మీయమ్మ నిన్ను తలచుకొని, తలచుకొని ఏడుస్తూఉన్నదని వాడితో చెప్పు. ఈ సంగతి వింటే వాడికి కాస్త ధైర్యముగా ఉంటుంది. వాడిది చాలా మెత్తని మనస్సు. నన్ను తలచుకొని కంట తడిపెట్టుతాడు కాబోలు. నాదగ్గర ఈసొమ్ము ఉన్నది. ఇవి తీసికొనివెళ్ళి వాడి కియ్యి.

కృష్ణ—మీరీ రూపాయ లివ్వడ మెందుకు? నే నక్కడేకదా ఉంటాను. వాడిని దేనికీ ఇబ్బందిపడనివ్వను.

జాని—ఔను. నువ్వు అన్ని విధముల వాడికి సంరక్షణచేసి కనుక్కుంటూ నేయున్నావు. ఐనా ఈ రూపాయలు కూడ వాడి కియ్యి. అవసరమునకు పనికివచ్చును. ఈ చెంబుతో నెయ్యి ఇస్తాను. వాడికి పంపించు. బజారు నెయ్యి ఇంటి నెయ్యివలె ఎట్లుండును. దానికి కమ్మతనమూ ఉండదు. సువాసనా ఉండదు. వాడికి తాంద్రం టే చాలా ఇష్టము. మన తోటలోని తియ్యమామిడి పండ్లతోపాటు, అది, మన పెరటిలో కాసిన కూరలు మూటకట్టి ఇస్తూయున్నాను. మీయమ్మ బ్రతికిఉన్నంతకాలము నీకే లోపము ఉండదనియు, దేనికీ ఇబ్బంది పడవద్దనియు వాడితో చెప్పు. మంచివాడేనా, చెడ్డవా

డేనా, అసలుసాక్షి దేకదా, నాకాధారము ? లోకానికి వెరచి వాడిని దగ్గర ఉంచుకొనలేకపోయినా నామనస్సునకు దూరము చేసికొనలేదుకదా ?

## ౨౩

సుందరములైన భావములవలన కవిత్వమునకు జీవము వచ్చునట్లును, సుందరములైన రంగులవలన చిత్రపటమునకు జీవకళలు వచ్చునట్లును, కమలా సుశీలలా యింటియందుండుటవలన దానికి జీవకళ వచ్చినట్లుండెను. గ్రుడ్డికండ్లకు దృష్టి వచ్చినట్లయ్యెను. ఎండిపోయిన మొగ్గవంటి సుశీల ఇప్పుడు వికశించిన పుష్పమువలె శోభాయమానముగా నుండెను. ఎండిపోయిన గోదావరి క్రొత్తప్రవాహముతో పొంగిపోవుచున్నట్లుండెను. జ్యేష్ఠవైశాఖముల ఎండవేడిమికి వడగొట్టికొనిపోయిన యాపు శ్రావణమాసములో పొలములయందలి పచ్చిగడ్డిని మేయుచు పుష్టిగలిగి, ఆనందముగా నున్నట్లు ఆమె యును విరహముచే విలపించిన రమణి ఇప్పుడు నూతన శోభనుదాల్చి ప్రేమస్వరూపురాలయ్యెను.

ప్రతిదినము ప్రాతఃకాలమునందా నదియొద్దున నున్న ఇంటినుండి ఇద్దరు కోమలాంగులు నదీ స్నానమునకు బయలుదేరు చుందురు. వారిలో నొకయువతి లావణ్యముగను, చురుకుగను ఉండి కలకలలాడు చుండును. రెండవ యువతి సాధారణముగను, నెమ్మదిగను నుండును. మొదటి ఆమె నదియందు సంతోషముతో గంతులు వైచుచు, నీదులాడుచు స్నానము చేయుచుండును. రెండవ యామె నెమ్మదిగ స్నానము చేయుచుండును. ప్రభాతమందలి బంగారు కిరణముల యందీ రమణులిద్దరు మరింత ప్రకాశించుచుందురు.

సుశీల ఆనందముతో పాడుచుండును. కమల వంట వండుచుండును. సుశీల తలను దువ్వుకొనుచు, శృంగారించుకొనుచు, ఉండును. కమల బట్టలు కుట్టుచుండును. సుశీల అత్యాస్వాద్యముగ భుజించుచుండును. కమల రోగిణివలె వరధ్యానముగా నుండి హితవులేనట్లు భుజించు చుండును.

మోహనుని స్వభావమునందు కూడ నిప్పుడు చాల మార్పుకలిగెను. ఆతడు ప్రేమయొక్క ఆనందము ననుభవించుటయందు తన్మయుడైయుండెను ఇప్పుడాతడు చాల ప్రొద్దెక్కినగాని నిద్రనుండి లేవడు. గంటలకొలది స్నానము చేయుచుండును. తర్వాత తల దువ్వుకొని, బట్టలు వేసికొని, అత్తరు సెంట్లను రాసుకొని సొగసుగా తయారగుట కొరకు గంటపట్టును. అప్పుడు నెమ్మదిగ ఫలాహారముచేసి కాఫీ పుచ్చుకొని కచ్చేరీ చావడిలోనికి వెళ్లును. కాని అతని మనస్సు మరియొకచోటున నుండుటవలననొక్క నిమిషమైన నక్కడ స్థిరముగ కూర్చొనలేడు. మాటిమాటికి ఇంటిలోనికి పోవుచుండును. చావడిలో నెవరితోనైనను చాలసేపు మాటలాడవలసి వచ్చిన లోపలకు పోవువరకు ఆతనికి తొందరగా నుండును. సుశీల ఇప్పుడాతనిపై వశీకరణమంత్రము ప్రయోగించినది.

కమల ఇంటిపనియంతయు జేయుటయే గాక పైపనికూడ చూచుచుండును. ఆమె ఝామురాత్రి యున్నదనగానె లేచి తనస్నానమును జపమును ముగించి కళాసులను పడవవారిని పనులలోనికి పంపును. తర్వాత మోహనునికొరకు ఫలహారము తయారు చేయును. తొమ్మిదిగంటలు కొట్టుసరి కామె వంటపనియంతయు ముగించును. పదకొండు గంటలగుసరికి ఇంటిపనియంతయు పూర్తిచేసి కుట్టుపనులు చేతిపనులు చేయుచుండును. రాత్రి అందరు భోజనములుచేసి పరున్న తరువాత ఒంటరిగ కూర్చుని పురాణము చదువుచుండును. ఆమెక

రామాయణమన్న చాలఇష్టము, ఒక్కొక్కప్పుడామె భక్తవిజయము వివేకానంద రామతీర్థుల ఉపన్యాసములను కూడ చదువుచుండును. విదుషీమణుల చరిత్రలను చదువుట యందామెకు చాల యాసక్తి. మీరాబాయి యనిన యామెకు మిక్కిలి భక్తి. కమల సాధారణముగ ధార్మిక గ్రంథములనే చదువుచుండును. కాని జ్ఞానమునందు కంటె భక్తియందే ఆమెకు మనశ్శాంతి కలుగుచుండెను.

కళాసుల భార్యలు సరంగుల భార్యలు కమలను చాల భక్తిగౌరవములతో చూచుచుందురు. వారిలో వారికి తగవులు వచ్చినప్పుడామెయే వారిని సమాధాన పరచుచుండును. వారి చిన్నపిల్లలకు ఆమె చొక్కాలు టోపీలు కుట్టి యిచ్చు చుండును. వారి నిమిత్తము కాటుక అగరు మొదలైనవి కూడ తయారుచేసి యిచ్చుచుండును. వారికి గాని వారిపిల్లలకు గాని రోగములు వచ్చిన కమల వారిఇండ్లకు వెళ్ళి వారికి చిన్న చిన్న మందులిచ్చియు, పథ్యములు చెప్పియు సాహాయ్యము చేయుచుండును.

కమల ఈవిధముగ కూలిపోయిన తన గౌరవమును లేవనెత్తుచుండెను. ఆచుట్టుపట్ల నున్నవారందరు ఆమెను చాల గౌరవించుచుండిరి. బైట నీవిధముగ గౌరవము జరుగుచున్నను, నింటియందు మాత్రమా గౌరవములేదు. కమల ఒడలు దాచుకొనకుండ నింటి భారమంతయు వహించి, అన్నిపనులు సవరించు చున్నప్పటికి మోహనుని నోటినుండి ఒక్క కృతజ్ఞతా సూచకమైన మాటయైనను రాలేదు. సుశీలకూడ అక్కయెడల నిర్లక్ష్యము చూపసాగెను. భార్యాభర్తలిరువురు ఆమెనింటి దాసివలె జూచుచు పనులు చేయుటకే ఆమె యున్నట్లు తలచి నిశ్చింతగా నుండిరి. ఈపనుల యలసటవలన కమలకప్పుడు తలనొప్పియు, జ్వరమును వచ్చుచుండెను. అట్టి సమయములయందుకూడ ఆమె మామూలు ప్రకారము మింటిపనులు చేయక తప్పి

డిది కాదు. ఆమె యొక్కొక్కప్పు డేకాంతముగ కూర్చుని తన దుర్దశను తలచుకొని ఏడ్చుచుండును. కాని ఆమెకు ధైర్యము చెప్పి యోదార్చు వారెవ్వరు?

కమల స్వభావము చేతనే మానవంతురాలు. ఆమె ఇదివరకెక్కడ నున్నను యజమానురాలిగనే యుండెను. తనభర్త ఇంటియందు న్నప్పుడెన్ని కష్టము లనుభవించినను యజమానురాలుగనే యుండెను. విలాసనగరమునందు నివసించి యున్నంత కాలమూ మెదే రాజ్యముగా నుండెను. వితంత్వాశ్రమమునందుకూడ శేవాధర్మముల నాచరించుచు అందరకు గౌరవ పాత్రురాలయ్యెను. అట్టివాలవ నిప్పుడిక్కడ నీయవస్థయందుండుట ఆమెకు చాల అసహ్యముగను, కష్టముగను ఉండెను. మోహను డప్పుడప్పు డామెను ప్రశంసించుచు ఆమె సల హాలను పుచ్చుకొనుచు ఆమె యెడల గౌరవము చూపుచున్న యెడలను, సుశీల ఆమెయొద్ద కూర్చుని ఆమె మాటయందు గౌరవ ముంచి సంతోషపెట్టుచున్న యెడలను కమల యుత్సాహముతో నింతకన్న ఎక్కువ కష్టపడి ఇంటిపనులన్నియు చక్కబెట్టగలిగి యుండును కాని ఆదంపతు లిద్దరకు వారి సంతోష తరంగములం దితరములేవియు గోచరించుటలేదు. ఒక వస్తువును గురిచూచి బాణము వేయునప్పుడు దృష్టియంతయు కేవల మావస్తువునందే లీన మగును. ప్రేమాసక్తుల స్థితికూడ నిట్టిదే.

సుశీలా మోహనులయొక్క ఉదాసీనత ప్రేమోన్మాదమువలన గాక మరియొకటి గాదు. కుష్ఠురోగులయెడల మనకు జాలియున్ననూ, వారిని సమీపించుటకు సాహసము లేక వారికి దూరముగా తొలగు నట్లు మోహనుడు కమలనుండి తప్పించుకొని తిరుగుచుండెను. ఆమె రూపలావణ్యములను జూచి తన భర్త ఎక్కడ లొంగిపోవునో యని సుశీల భయపడుచుండెను. మోహనుడు తనంతట తానే కమలకన్నుల

బడకుండ తిరుగుటవలన బాధ లేకపోయినది. లేనియెడల సుశీల అవమానముచే దహించుకొనిపోయి యుండును. భార్యాభర్త లిరువురు కూడ చేతిలో నున్న పామును కండ్ల పడకుండునట్లు ప్రయత్నించుచుండిరి. కాని సంకోచమువలన వారిలో వారీవిషయమై చర్చించుటకు భయపడుచుండిరి.

క్రమక్రమముగా కమలకీ సంగతి బోధపడెను. ఒకనాడు సుభద్రమ్మ వెంకటస్వామిచేత అరటిపండ్లను వారింటికి పంపెను. ఇంతకుముందు కూడ వెంకటస్వామి వారింటికి పెక్కుసార్లు వచ్చెను. కాని కమల ఎన్నడును వాని కంట బడలేదు. ఆమెకు వాని కంట బడుట ఇష్టము లేదు. కాని ఈసారి వాడామెను జూచెను. ఇక నేమున్నది? వాని కడుపులో ఎలుకలు పరుగెత్తసాగెను. వాడు రాళ్ళనైనను తిని అరిగించుకొనగలడు కాని రహస్యములను వాడు మనస్సునందిముడ్చుకొనజాలడు. వెంటనే వాడు సరంగులనాయకునివద్దకు చుట్టత్రాగు మిషపై వెళ్ళి, వాని చెవిలో నీసంగతి యంతయు నూదెను. "ఒరే! ఈవిడ సానిది. మొగుడు ఇంటినుండి తగిలేస్తే మా పంతులుగారింట్లో వంటకు కుదిరింది. అక్కడనుండి మేము తగిలేస్తే సానివీధిలో ప్రవేశించింది. ఇప్పుడు తిరిగీ వీరింట్లో హాజరైంది." సరంగులీమాటలు విని నిర్ఘాంతపోయిరి. ఆ చుట్టుపట్ల ఉన్న ఆడువారందరు ఈవిషయమై గుసగుసలాడుకొనసాగిరి. ఆరోజునుండి ఆ చుట్టుపట్ల వారు మోహనుని ఇంటిలో నీళ్లు కూడ త్రాగుట మానివేసిరి. ఒకనాడు భగవంతరావు పడవకంట్రాక్టు విషయమైన లెక్కలు పరిష్కరించుకొనుటకు వీరింటికి వచ్చెను. అప్పుడాతనికి దాహము వెయ్యగా ఏదో వంక జెప్పి నదికి పోయి నీరు త్రాగి వచ్చెను. తన ఇంటికి వచ్చి, నదికి వెళ్ళి నీళ్లు త్రాగుట మోహనునకు గుండెలలో శూలము పెట్టి పొడిచినట్లుండెను.

వీరి యింటికి వచ్చి రెండేండ్లయ్యెను. క్రమక్రమముగ మోహనరావు చిన్నచిన్న విషయములలో సహితము కమలపై చిరాకుపడుచు విసుగుకొనుచుండెను. ఈ పరిస్థితులను బట్టి చూడగ తా నిక్కడుండుట అసంభవమని కమలకు తోచుచుండెను. చెల్లెలు మరదితో నిక ఋణము తీరిపోయినది కదా యని విచారించెను. చెల్లెలివద్ద నుండి వారి సంరక్షణ జేయుచు ఏదో విధముగ తన జీవితమును గడుపుకొనవలెనని ఆమె ఇదివరకు తలచుచుండెను. ఆమె కింతకన్న మరియొక కోరిక లేదు. కాని అయ్యో! పాప మీ ఆసరా కూడ ఆమె కాళ్లక్రింద నుండి జారిపోయెను. ఆమె ఇప్పుడు నడిసముద్రములో నున్నట్లుండెను.

కమలకు తన పరిస్థితులవలన ఎంతో దుఃఖము కలుగుచున్నను సుశీలతో గాని మోహనునితో గాని ఎన్నడును ఆయూసెత్తలేదు. తన అవస్థవలన కలిగిన జ్ఞానమును, ధర్మచింతయు ఆమెను మరింత వినయవంతురాలినిగను సహనశక్తిగలదిగను జేసెను. ఆమె ఎల్లప్పుడు తనలో "ఎక్కడకు పోవుదును? నన్ను కాపాడువారెవ్వరు?" అని విచారించుచుండును. ఎటువైపు జూచినను ఆమెకు అగాధమువలె కనబడుచుండెను. ఇప్పటివరకామె యొక్క నిర్మలాత్మ అవలంబనమును కోరుచుండెను. ఏ యాసరా లేక ఈప్రపంచమునందు తన జీవితమును గడపవలసి వచ్చునని తలచునప్పుడెల్ల భయముచే ఆమె హృదయము కంపించి పోవుచుండెను. ఆమె వంటరికత్తె. అసహాయురాలిగ నీ సంసార సంగ్రామమునందు ప్రవేశించుటకు సాహసించలేకపోవుచుండెను. గొప్పగొప్ప నేర్పరులు, ధర్మశీలురు, దృఢమనస్కులు కూడ నీ సంసారసంగ్రామమునందు దెబ్బ తినుచుండగా నిక నాగతి చెప్పేదేమి? నన్ను రక్షించువా రెవ్వరు? నన్నోదార్చువారెవ్వరు?" అని యెల్లప్పుడు దుఃఖపడుచుండును. ఎంత యనాదరము

జరుగుచున్నను ఈ భయసంశయము లామె నక్కడనుండి కదల నిచ్చుటలేదు.

ఒకనాడు మోహను డెక్కడకో వెళ్ళి తిరిగి తిరిగి పదిగంటలకు వచ్చి తన భార్యతో, "ఇంకా భోజనమున కెంత యాలస్య మున్నది. వేగముగా వడ్డించుము. బాబయ్యగా రింటికి రామనాథముగారు వచ్చినారట. నేను వెళ్ళి ఆయనను కలుసుకొనవలెను."

సుశీ—ఆయన ఈయూ రెందుకు వచ్చిరి?

మో—నా కా సంగతి తెలియదు. ఆయన ఈరోజు ప్రొద్దుటే వచ్చిరనియు తిరిగి ఈ సాయంత్రమే వెళ్ళిపోయెదరనియు వెంకట స్వామి వచ్చి చెప్పినాడు. ఆయన ఇక్కడకే రావలెనని అనుకున్నా రట కాని (కమలవైపు సంజ్ఞ చేసి జూపుచు) ఏదో కారణముచేత రాలేదట.

సుశీ—ఐతే కొంతసే పాగండి. ఇంకా కొంచెము ఆలస్య మున్నది.

కమ—(చికాకుతో) ఆలస్య మేమిటి? వంట అయినది. పీటవేసి చెంబుతో నీళ్లు పెట్టు. వడ్డిస్తాను.

సుశీ—కొంచం సేపు కూర్చుంటే ఏమి మునిగిపోయినది? ఉడికినది ఉడకపది తినుటకు అవతల రైలువేళ ఏమి మించిపోవడంలేదు.

మోహ—రోజంతా ఏమి చేస్తున్నారో నా కేమి బోధపడడం లేదు. ఈమాత్రం వంటవండడం పెద్దబ్రహ్మాండము ఐపోతూయున్నది.

మోహనుడు భోజనముచేసి వెళ్లిపోయిన తర్వాత కమల సుశీలతో, "సుశీలా! నే నిక్కడ ఉండడం మీ కిష్టములేదా ఏమిటి? నిజముగా చెప్పు, మీ మనస్సులలో ఏమున్నదో నాకు బాగా తెలుసును. కాని మీనోటినుండి ఆ కాస్తమాటా వచ్చేవరకు నే నిక్కడనుండి వెళ్ల దలచుకొనలేదు. నా కింతకంటె వేరుగతి లేదుకూడను.

సుశీ—ఏమిటక్కయ్యా! అటువంటి మాటలాడుచున్నావు. నువ్వుండబట్టేకదా ఏచిక్కూ లేకుండా ఈ సంసారము జరిగిపోతూయున్నది. నువ్వు లేకపోతె నాచేత ఏమౌతుంది?

కమ—ఇటువంటి ముఖంతుడువుమాట లెక్కడ నేర్చుకున్నావు? మీ రిద్దరు కూడా నన్ను తృణప్రాయముగ చూచుచున్న సంగతి నాకు బోధపడలేదనుకొన్నావా? ఇందాకా మీ రిద్దరు నన్ను జూచి సంజ్ఞలు చేసికొనుట నేను చూడలేదనుకొన్నావా?

సుశీ—నువ్వు నిజంగా చూశావు? ఏమి చూచి ఏమనుకొన్నావో!

కమ—నేను చెప్పిన మాట లబద్ధమని నా ముఖమువైపు సమముగా జూచి చెప్పు.

సుశీ—ఐతే నీ కంత బాగుగ తెలిస్తే నే నెందుకు చెప్పడము?

కమ—ఎందుకనగా అన్నీ చూస్తూఉన్నా నాకండ్లమీద నాకే నమ్మకం పుట్టడములేదు. లోకులు నన్నెంత నీచముగా జూచినను వారిని నే నేమియు అనను. వారికి నా మనస్థితి తెలియదు కాని అన్ని సంగతులు తెలిసిన నీవు నీ మగడు నన్ను నీచముగా జూచుచుండుట జూచి నాకు చాల నాశ్చర్యముగా నున్నది. నేను మీతో రెండు సంవత్సరములనుండి కలసి ఉన్నాను. అందువలన నా నడవడి గురించి మీకు బాగుగ తెలిసియుండవలెను. తెలిసికొనవలెను కూడాను.

సుశీ—లేదక్కయ్యా! నేను దైవసాక్షిగా చెప్పుచున్నాను. నువ్వన్నది నిజముకాదు. మామీద నిష్కారణముగ అంత నింద మోపకు నువ్వు నాకు చేసిన మేలు నే నెన్నటికిని మరచిపోను. కాని సంగతి ఇది. ఆయనకు నిష్కారణముగ చెడ్డపేరు వచ్చుచున్నది. లోకులు ఇష్టమువచ్చినట్టూ అంటారు. అది కాక సుభద్రమ్మగారు ఇక్కడకు రావలెనని ప్రయాణమైనారట కాని నీ విక్కడ ఉన్నావని రావడం

మానివేసినారట. ఈసంగతి ఆయన చెప్పారు. అక్కయ్యా! నువ్వు మరివక విధముగా అనుకోకు. ప్రపంచవ్యవహార మీలాగుంటే మే మేమి చెయ్యగలము?

కమల మరేమియు వాదించలేదు. చివరకామె అనుకొన్నట్లే యైనది. కాని ఆమె వెళ్లిపోవుట కింకొక ఆటంకము మాత్ర మున్నది. సుశీల కొద్దిదినములలోనే పిల్లతల్లియగుటకు సిద్ధముగా నున్నది. "ఈ సమయములో వెళ్లిపోయిన వీరు చాల కష్టపడిపోవుదురు. కనుక నింక కొన్నిరోజులోర్చి యుండెదను. ఇన్నిరోజులు సహించియున్నప్పు డిక రెండుమూడు మాసము లేపాటి? నానుండి వీరు నిష్కారణముగ చిక్కులు పడుచున్నారు. కాని ఇట్టి స్థితిలో మాత్రము వీరిని వదలి పెట్టి వెళ్లుట ధర్మముకాదు. అట్లు వెళ్లిపోవుటకు నామనస్సు కూడ వప్పుటలేదు." అని కమల తన మనస్సును సమాధానపరచుకొనెను.

కమల కిప్పుడు రోజొక యుగముగ నుండెను. కాని అట్లే ఆమె సహించి యుండెను.

రెక్కలులేని పక్షి పంజరములో బంధింపబడి యుండుటయే తనకు క్షేమకరమని తలచును కదా?

## ౨౪

కృష్ణశర్మ నాలుగైదు నెలలనుండి పడుచున్న శ్రమకు ఫలితముగ నిరువదిమంది వేశ్యలకు పైగా తమ పిల్లలను ఆశ్రమమునకు పంపుట కొప్పుకొనిరి. ముగ్గురువేశ్యలు తమ యాస్తి నంతను ఆశ్రమమున కిచ్చి వేసిరి. ఐదుగురు వేశ్యలు వివాహము చేసికొనుట కొప్పుకొనిరి. నిజ మైన హితాకాంక్షి ఎన్నడును నిష్ఫలుడు కాడు. ఆతడు నిజమైన దేశ

శేవకుడనియు, స్వార్థ రహితుడనియు, తన్నుద్ధరించుననియు, సంఘమునకు విశ్వాసము కలిగిన అది ఆతని ననుసరించును కాని ఆ విశ్వాసము నిజమైన శేవకునియందు తప్ప తదితరులయందు కలుగదు. అంతఃకరణము విశాలమైనది కానియెడల ఆ ప్రకాశముయొక్క ప్రతిబింబము ఇతరులయందు ప్రసరింప జాలదు. కృష్ణశర్మయందు నిజమైన శేవాభావ ముదయ మయ్యెను. సంఘమునందు నిజముగా నిటువంటి సజ్జనులెందరో కలరు. వారి మనస్సులయందు దేశశేవ చేయవలెనను యుద్దేశము కూడ నుండును. కాని చాలవరకు వారు తమ ఖ్యాతిప్రతిష్టలకొరకాశపడెదరు. సాధారణముగ మనమేపని చేయ దలచినను దాని వలన మన పేరు ప్రఖ్యాతి గాంచవలెననియు, ఏదైన నొక పుస్తకము గాని, వ్యాసము గాని వ్రాసిన ప్రజ లేకగ్రీవముగ దానిని ప్రశంసించ వలెననియు ఆశించెదము. ఈ స్వార్థమునకు కొంత కాకపోయిన కొంతయైనను ప్రతిఫలము దొరకును. కాని లోకులయొక్క హృదయమునందు మనము జొరపడ జాలము. ఒక మనుష్యుడు తానెంత దుఃఖములో నున్నను నిజమైన మిత్రుడు కాని వానితో తన దుఃఖములను చెప్పుకొనుట కిష్టపడడు.

ఇప్పుడు కృష్ణశర్మకు తరుచుగ సానివీథికి వెళ్లవలసిన యవసరము కలుగుచుండెను. వేశ్యల జీవితముల గురించి ఆతని కనుభవము కలుగుచున్న కొలదియు ఆయనకు దుఃఖ మధిక మగుచుండెను. ఇటువంటి రమణీమణులు భోగ విలాసముల కొరకు తమ సర్వస్వమును పోగొట్టుకొనుట జూచి, ఆయన హృదయము కరుణామయ మగుచు కండ్ల వెంట నీరు కారుచుండును. ఈ స్త్రీలు ఆలోచన లేనివారు. బుద్ధిహీనులు, భావశూన్యులు కారని ఇప్పు డాతనికి బోధపడుచుండెను కాని వారు మాయలలో పడి తమ బుద్ధిసామర్థ్యములను విపరీత మార్గములయందు పెట్టుచున్నారు. కృష్ణహరి హృదయములను నిర్బల

ములుగ జేసివైచెను. కృష్ణశర్మ ఈ మాయాజాలమును త్రుంచి వేయుటకును, అచేతనములైనవారి యాత్మలకు చైతన్యమును కలిగించుటకును, అజ్ఞానావస్థనుండి వారిని తప్పించుటకును ప్రయత్నించుచుండెను. కాని ఆ మాయాజాలము దృఢముగాను, అజ్ఞానబంధనము బలముగాను, నిద్రమత్తు గాఢముగాను ఉండుటవలన మొదటి దినములలో యాతని పరిశ్రమమునకు తగినంత ఫలము కలుగలేదు. సారాయి మత్తువలన మనుష్యుని స్థితి ఎట్లుండునో అట్లే ఆవేశ్యల స్థితి కూడ నుండెను.

అక్కడ ప్రభాకరరావు అతని మిత్రబృందము ప్రస్తావనయొక్క మిగిలిన భాగములను తిరిగి కౌన్సిలునందు ప్రవేశపెట్టిరి. ఇదివరకు వారికి కృష్ణశర్మపై కోపము వచ్చుటవలన ఆ తీర్మానమునకు వ్యతిరిక్తముగ నుండిరి. కాని ఇప్పుడు శర్మ వేశ్యలపై చూపుచున్న అభిమానమును జూచి ఆయన ఆయుధముచేతనే ఆతనికి విఘ్నము కలిగింప దలచిరి. కృష్ణశర్మ ఆరోజున కౌన్సిలునకు వెళ్లలేదు. డాక్టర్ శ్యామలరావు నీలగిరి వెళ్లిపోయెను. కనక ఆ రెండుభాగములు నిర్విఘ్నముగ ఆమోదింపబడెను.

మ్యునిసిపాలిటీవారు కళ్యాణపురము బైటను వేశ్యల నిమిత్తము ప్రత్యేకముగ నిండ్లను కట్టించుచుండిరి. కంట్రాక్టర్ భగవంతరావు చాల శ్రద్ధగాను, చురుకుగాను పనిచేయించుచుండెను. కొన్ని చిన్న యిండ్లు, కొన్ని పెద్దయిండ్లు కొన్ని మేడలు ఒక చిన్నబజారు ఔషధాలయము, పాఠశాల కట్టించుచుండిరి. షికారు తిరుగుటకు చిన్న పార్కును రామశాస్త్రి కట్టించుచుండెను. హాజీహాస్సీమ్ చిన్న మశీదును సుబ్బయ్యసెట్టి రామమందిరమును ధర్మార్థము కట్టించుచుండిరి. నియమితకాలమునకు ముందుగనె ఈపని నంతను పూర్తి చేయించెదనని భగవంతరావు ఖరారుచేసెను. కాని ఎక్కువపని

యగుటవలన ఎంత తొందరపడినను పని పూర్తియగుసరికి సంవత్సరము పట్టెను. ఇండ్లన్నియు తయారు ఐనతోడనె, "శీఘ్రముగా పట్టణమును వదలి క్రొత్తయిండ్లకు వెళ్లవలసినది" అని మ్యునిసిపాల్టీవారు వేశ్య లందరకు నోటీసులను పంపిరి.

వేశ్య లీ నోటీసులను లక్ష్యపెట్టరని పురవాసు లనుమానపడిరి. కాని వా రందరు ప్రసన్నవదనముతో నీ యాజ్ఞను పాలించుట జూడగా పుర జనుల కందరకు చాల నాశ్చర్యము కలిగెను. ఒక్కదినములోనే పట్టణ ములోని వేశ్యాగృహము లన్నియు ఖాళీయయ్యెను. రాత్రి యంతయు నతి సందడిగా నుండు ఆ యిండ్లన్నియు శూన్యముగాను, నిశ్శబ్దము గాను ఉండెను.

సూర్యకాంతయను ధనవంతురాలగు నొక వృద్ధవేశ్య తన సర్వ స్వమును ఆశ్రమమున కిచ్చివేసెను. సాయంత్రమగుట తోడనె వేశ్య లందరు ఆమె యింటివద్ద సమావేశమైరి. ఆసభయందు సూర్యకాంత మిట్లుపన్యసించెను.

"సోదరీ మణులారా!

ఈరోజున మన జీవితమునందొక క్రొత్తయుగము ప్రారంభమైనది. దైవమికనైనను మనయందు దయజూపి మనలను మంచిమార్గమున నడిపించుగాక. మనమిన్ని దినములు అవమానకరమైన, నీచాతి నీచమైన జీవితమును గడపితిమి. ఇంతవరకు మనము పిశాచము చేతులలో నుంటిమి. మన యాత్మలు, మన దేహములు చాలవరకు చెడిపోయినవి. ఈయవ్వన మదమునందు మనస్థితినేగాక మనలను మన మేమరచిపోతిమి. ఈవీధియంతయు మన పాపములచే నపవిత్రమై పోయినది. ఇప్పుడు పరమేశ్వరుడు మనస్థితినిజూచి దయతలచి మనల నీపాపములనుండియు, నీనరక కూపమునుండియు విముక్తురాండ్రను జేయుచున్నాడు. కనుక ఇక ముందెన్నడును మనము దైవనిర్ణయములను

దాటక, దైవభక్తి, పాపభీతి కలిగి ప్రవర్తింపవలెను. ఈవీధిని విడిచి పెట్టుట మనలో కొందరు సోదరీమణులకు కష్టముగా నుండుననుటలో సందేహములేదు. మరికొందరు సోదరీమణులకు దైవము తమను రక్షించుననను నమ్మకముకూడ లేకపోవచ్చును. ఆసోదరీమణులకు నేను చేయు విన్నప మేమనగా, జీవితముయొక్క స్వాతంత్ర్యమును దైవ మందరకొక్క విధముగనె ప్రసాదించినాడు. మీరు సద్వర్తనులుగా నుండు శక్తి మీయందే యున్నది. ఇప్పుడు మన జీవిత విధానములను మార్చుకొనుట వలన మనకు కష్టములు సంభవింపవచ్చును. ఐనను మనము వాటిని శాంతముతో ననుభవింపవలెను. మనకు ముందు ముందెన్ని కష్టములు వచ్చిన, మన పాపములయొక్క బరువంత తగ్గి పోవును. మన యాత్మల నుద్ధరింపవలసిన దనియు, ఎన్ని కష్టములు వచ్చుచున్నను సన్మార్గమును విడువకుండ మనోదార్ఢ్యమును ప్రసాదింపమనియు దైవమును మరియొక సారి ప్రార్థించు చున్నాను."

తర్వాత రామతిలక మిట్లుపన్యసించెను. "మనము వకీలు కృష్ణ శర్మగారికి హృదయపూర్వకముగ వందనములు చేయవలసియున్నది. ఆమహనీయుడే మనకీ ధర్మమార్గము నుపదేశించెను. దైవ మాయన నెల్లప్పుడును రక్షించుగాక!"

తర్వాత చంద్రావతి ఇట్లుపన్యసించెను.

" సోదరీమణులారా!

పాపములకు నీచవర్తనమునకు దూరముగానుండుడని మాలక్క చెల్లెండ్రను కోరుచున్నాను. సంగీతము సాహిత్యము మన నిజమైన వృత్తులు. కనుక మనము వాటిని బాగుగ వృద్ధిచేసికొనవలెను. కామాతురులచేతి కీలుబొమ్మలముకాక మనము జాగ్రత్తగ నుండవలెను. చాల దినములనుండి మనము పాపములకు బానిసలమై యున్నాము. ఇప్పుడు మనలను మనమే రక్షించుకొనవలెను. మన సౌందర్యము,

యవ్వనము, హృదయము, మర్యాద, సిగ్గు, తెలివితేటలు, మొదలైనవి పాపాత్ములైన రసికపురుషుల కాహుతిచేయుటకేనా భగవంతుడు మనలను సృజించినాడు? యవ్వనవంతులగు రసికపురుషులు మనలను జూచి మోహించిన మన కెంత సంతోషము కలుగుచుండెడిది? వారలను జూచి మనమెంత పొంగిపోవుచుండెడి వారము? తప్పిపోయిన బంగారుపిట్ట మన పంజరములో ప్రవేశించినట్లు మన మానందించుచుండెడివారము. కాని సోదరీమణులారా! ఇదియంతయు మన అజ్ఞానమే. మనము వారిని ఖరీదిచ్చి లోబరచుకొనుట లేదు. మనమే వారి సొమ్ముల కాసించి వారికి బానిసలమగుచున్నాము. మనలను వారు వెండిబంగారులతో కొనుచున్నారు. దానికి బదులుగ మనము మన పవిత్రములైన, అమూల్యములైన ఆత్మలను కోల్పోవుచున్నాము. ఇకముందు మనలో ఎవ్వరైనను మనము చేసికొన్న కట్టుబాట్లను తప్పి, నీచముగా ప్రవర్తించిన వారిని మనము బహిష్కరించవలెను."

తర్వాత సుందరీబాయియను వేశ్య ఇట్లు చెప్పెను.

"మన సోదరి చంద్రావతి మంచి యుక్తియుక్తముగ జెప్పినది. నాయుద్దేశముకూడ నదే. మనలను ఏ పురుషుడైన మోహించిన ఆతడెటువంటివాడో మనము మొదట కనుగొనవలెను. అతని ప్రేమ నిజమైనదై మన మనస్సుకూడ నాతనియందున్న యెడల వెంటనే ఆతనిని పెండ్లిచేసి కొనవలెను. ఆతడు పెండ్లి చేసికొనుట కిష్టపడక పూర్వము వలె నింటికివచ్చుట ప్రారంభించిన, వెంటనే వానిని తిరస్కరించి పంపివేయవలెను. మన మర్యాదను డబ్బున కమ్ముకొన గూడదు."

రామప్యారీ ఇట్లు చెప్పెను.

"స్వామీ రామానందు మనకు పుస్తకముల నిచ్చియున్నారు. వానియందు సౌందర్యము మన పూర్వజన్మ సుకృతఫలమనియు, మనము పూర్వజన్మ సంపాదితమును కూడ నీ జన్మమున నష్టపరుచు

కొనుచున్నామనియును వ్రాయబడియున్నది. మన సోదరి చంద్రావతి చెప్పిన సంగతుల నామోదించినవారు చేతులెత్తవలసినదని కోరు చున్నాను.”

వెంటనే సుమా రిరువదిమ్మొదుగురు వేశ్యలు చేతుల నెత్తిరి. “దీనికి వ్యతిరేకులు చేతులెత్తవలసినదని కోరుచున్నాను.” అని రామప్యారి కోరెను. కాని ఒక చెయ్యియు పైకి లేవలేదు. “ఎవ్వరును వ్యతిరిక్త ముగ చేతుల నెత్తలేదు. దీనివలన చంద్రావతి ఉద్దేశ్యమును అంద రును ఆమోదించినట్లు తెలియుచున్నది. ఈదినము చాల శుభప్రద మైన దినము.” అని రామప్యారీ పలికెను.

వృద్ధ సూర్యకాంత తిరిగి ఇట్లు చెప్పెను.

“డబ్బది యెలుకలను చంపి తిని, పిల్లి తీర్థయాత్రకు బయలుదేరిన ట్లున్నదని మీ రందు రేమో యని నాకు చాల భయముగా నున్నది. కాని నేను నిజముగ వారము దినములలో తీర్థయాత్రకు బయలుదేరు చున్నాను. నా జీవితమంతయు నీవిధముగ జరగిపోయినది. కాని జరి గిన దానికి విచారించిన లాభమేమి? ఇప్పుడు మీయొక్క నియమము లను జూచి నా మనస్సెంత సంతోషపడుచున్నదో నేను మాటలతో చెప్పజాలను. మీయొక్క ఈపవిత్రోద్దేశములను దైవము సఫలీకృత మొనర్చుగాక ”

కొంతమంది వేశ్యలు వారిలో వారు గుసగుస లాడసాగిరి. వారికీ మాటలు రుచించనట్లు వారి ముఖములవలననే తెలియుచుండెను. కాని వారు జవాబు చెప్పుటకు సాహసించలేక పోయిరి. చెడుభావ ములు మంచిభావముల ముందు ఈవిధముగనే అడగిపోవును.

సభ ముగియగనే వేశ్యలందరును కాలినడకను దైవమును దర్శిం చుటకు యాత్రికులు బయలుదేరునట్లు ఆ క్రొత్తపురమునకు బయలు దేరిరి.

సానివీధి పాడుపడిన ట్లుండెను. సంగీతధ్వని కాని, మర్దలతాళముల ధ్వనికాని ఎక్కడను వినబడుటలేదు. రసికుల రాకపోక లాగిపోయినవి. కోతలైన తరువాత పొలమువలె ఆవీధి యుండెను.

## ౨౫

కొన్ని నెలలవరకు గోపాలశాస్త్రి తనవద్దకు వచ్చిన వారందరదగ్గరను మోహనుని దిట్టుచు, వాడు వట్టి భ్రష్టుడనియు, వంశము చెడబుట్టినా డనియు, తుచ్ఛుడనియు, వాని కొక్కదమ్మిడీయైనను ముట్టనివ్వ ననియు, బిచ్చమెత్తుకొను గతి పట్టిన నప్పుడు బోధపడుననియు కేకలు వేయుచుండెను. దానపత్రము వ్రాసి పంపుమని తమ్మునిపేర ఎన్నియో సార్లు వ్రాసెను. జానికమ్మ ఎప్పుడైనను మోహనుని ఊబుసెత్తిన కోపముతో నామెమీద మండిపడుచు నింటినుండి లేచిపోయి సన్యా సము పుచ్చుకొందుననియు, ఆధూర్తుని ముఖమిక జూడననియు కేకలు వేయుచుండును.

కొన్ని నెలలు గడచిన తర్వాత ఆతని మనోస్థితియందు మార్పు కలిగెను. ఆతడు మోహనుని ఊబుసెత్తుటయే మానివేసెను. ఎవరైనను మోహనుని దూషించిన విచారగ్రస్థుడగుచు, "బాబు! వాడి నెందుకు దూషించెదరు? వాడు చేసినది వాడే అనుభవిస్తాడు. వాడు మంచి వాడైనను చెడ్డవాడైనను దూరముగా నున్నాడు కదా? ఏవో నాలుగుడబ్బులు సంపాదించుకొని కాలక్షేపము చేయుచున్నాడు. అలా పడి ఉండనివ్వండి. వాడి ఊబుసు మనకెందుకు" అని అనుచుండును.

వైద్యనాథము ప్రతిదినము ఏదో యొక క్రొత్తకబురు తెచ్చుచుం డును. ఒకనా డాతడు గోపాలశాస్త్రివద్దకు వచ్చి, రామనాథము

మోహనునకు వెయ్యిరూపాయ లిచ్చెననియు, ఆసొమ్ముతో నాతడు నదియొడ్డున ఇల్లుకట్టించి తోట వేయించుచున్నాడనియు, వ్యవహారము చేసి సొమ్ము బాగుగ నార్జించి ఖర్చుపెట్టుచున్నాడనియు, నాల్గు కల్పించి చెప్పెను.

ఇదివిని గోపాలశాస్త్రి కోపముతో, "ఐతే వాడు ముప్పెత్తుకుంటూ వుంటె నీకు సరదావా ఏమిటి? రామనాథం వాడికి సొమ్మెందు కిస్తాడు? ఇదివరకుచందా జమచేసి పెండ్లిచేసినాడుట. వాడార్జించి ఖర్చుపెట్టుకుంటూ యున్నాడు. నువ్వు చూచినట్టు చెప్పేస్తూ యున్నావు. వాడెంత చెడ్డవాడైనను దుష్టుడుమాత్రం కాడు. కాలములో ఉన్నవాడు. సరదాలు కలవాడు. ఆర్జించుకొనుచూ ఉన్నాడు. ఖర్చుపెట్టుతూ యున్నాడు. కాని ఎవ్వరికి అపకారం చేయడం లేదు కదా? ఈ యూరిలో ఎంతమంది పోకిరీ కుఱ్ఱవాళ్లులేరు? వారు ఒక్క పైసా యైనను ఆర్జించలేరు సరికదా ఇంటిలోని సొమ్మును దొంగిలించి దుర్వ్యయములు చేయుచున్నారు. మావాడు వాళ్లకంటె సహస్రాంతము నయము."

ఈమాటలు విని వైద్యనాథము సిగ్గుపడిపోయెను. ఈవిధముగ గోపాలశాస్త్రి మనస్సు రోజులు గడచినకొలదియు మెత్తపడసాగెను. మోహనునియొక్క ప్రతిబింబము ఆతని కండ్లయెదుట తిరుగుచున్నట్లుండెను. ఆతని మాటలే ఎల్లప్పుడును జ్ఞాపకమునకు వచ్చుచుండెను. ఒకనా డాతడు భార్యతో, "చూడు. వా డెంత నిర్దయుడై పోయినాడో? మన మాటే మరచిపోయినాడు. నేను ఈ యిల్లు వాకిలి భూమి పుట్ర నా నెత్తిని కట్టుకొనిపోతానా ఏమిటి? ఒక్కమా టిక్కడకు రావడమునకు వాడి కంత తీరుబడి లేకపోయినదా? ఓరీ పాపాత్ముడా! నా దగ్గరా నీ గర్వము? నీకొరకు ఈలా కుళ్లికుళ్లి చచ్చిపోయిన తరువాత పరుగెత్తుకొని వచ్చి, నన్ను తలచుకొని తలచుకొని ఏడుస్తావు కాబోలు?

నన్ను చూడడమున కొక్కసారి రాలేవు? సరే చూద్దాం. నువ్వెక్కడకు పోతావో? ఎక్కడకు పోతే అక్కడకు వచ్చి నీపని పట్టిస్తాను."

భోజనముచేసి తీరుబడిగ కూర్చున్నప్పు డెల్ల "తన భార్యతో కొడుకును గురించియే మాట్లాడుచుండును. "చూచావు! చిన్నప్పటి నుండి వీడిది మొండిపట్టె. ఏదైనను ఒక వస్తువు కావాలని అన్నాడంటే అది ఇచ్చేవరకు ఆలా ఏడుస్తూనే యుండేవాడు. నీకు జ్ఞాపకము ఉన్నదో లేదో కాని వకసారి నా జెపమాలకొరకు ఎంత కింకపెట్టి ఏడ్చాడు? చివరకు అది చేతిలో పెట్టితేనే కాని ఊరుకొన్నాడు కాడు. మహా మొండివాడు. చూడు ఒక యుత్తర మైనను వ్రాసినాడు కాడు. నిమ్మళముగా చెవులలో వేళ్లు పెట్టుకొని కూర్చున్నాడు. మనము చచ్చిపోయినామని అనుకొన్నాడు కాబోలు." అనుచు బాధ పడుచుండెను.

జానికమ్మ ఈ సంగతులు వినుచున్నప్పు డెల్ల ఏడ్చుచుండును. గోపాలశాస్త్రియొక్క ఆత్మాభిమానము, పుత్రప్రేమ ముందు నిలువ లేకపోయెను.

ఈప్రకార మొక సంవత్సరమునకు పైగా జరిగిపోయెను. గోపాల శాస్త్రి మోహనునివద్ద కొకసారి వెళ్లవలెనని ఆలోచించుచుండెను. కాని ఆ యాలోచనను కార్యరూపమునందు పెట్టలేకపోవుచుండెను. ఒకసారి సామా నంతయు సర్దుకొని ప్రయాణమై తిరిగి ఆ సామానుల నెక్కడ వక్కడ పడవేసి ప్రయాణమును మానుకొనెను. ఇంకొకసారి స్టేషనువరకు కూడ వెళ్లి తిరిగి వచ్చివేసెను. ఆతని హృదయము మోహనునకును, ఆత్మాభిమానమునకును ఆటవస్తువై పోయెను.

ఇప్పు డాతని మనస్సు గృహవ్యవహారములయం దేమియు వెళ్లకుండెను. వారికి స్వంతవ్యవసాయము చాల కలదు. వెళ్లి కనుగొనక పోవుటచేతను, సమయమునకు మళ్లకు నీరు పెట్టించకపోవుటచేతను

ఆ సంవత్సరపు పంట పూర్తిగ చెడిపోయెను. ఆతడు రైతులవద్ద సిస్తులు సహితము తిన్నగా వసూలుచేయుట మానివేసెను. రైతులు సిస్తులను తెచ్చినను వాటిని పుచ్చుకొని రసీ దిచ్చుటకు కూడ శాస్త్రికి కష్టముగా నుండెను. అందువలన వారిని తిరిగి రమ్మని చెప్పి పంపివేయుచుండెను. ఇంటియందు బెల్లము నీరై పోవుచుండెను. కాని దానిని అమ్మించుట కత డేమియు ఏర్పాటును చేయలేదు. జానికమ్మ ఈ విషయమై జెప్పిన ఆమెపై చీకాకు పడుచు "ఈ యిల్లు వాకిళ్లు మట్టిలో కలసిపోనియ్యి. ఎవరికొరకు నీ నిర్వాక మంతయు చేసితినో వాడికే అక్కరలేనప్పుడు నా కెందుకీ తాపత్రయము" అని అనుచుండును. తన జీవితము, ధర్మనిష్ఠ, కర్మశీలత, ఆనందము అన్నియు కూడ నొక్కవస్తువుపైనే ఆధారపడి యున్నవనియు, ఆవస్తువే మోహనుడనియు ఆతని కిప్పుడు బోధ పడెను.

కృష్ణశర్మ చాల దినములై వారి గ్రామమునకు వెళ్లలేదు. ఆత డిప్పుడు పెద్ద కార్యభారములో మునిగిపోయి యుండెను. శాస్త్రి తమ్మునకు ఉత్తరములు వ్రాయుట మానివేసెను. కాని అతనివద్దనుండి ఉత్తరము వచ్చినప్పుడు మాత్రము ఆతృతతో చదువుచు ఆ యుత్తరములో మోహనుని విషయమై ఏమియు లేనియెడల చిన్నబోవుచుండును.

ఒకనాడు గోపాలశాస్త్రి వీధి చావడిలో కూర్చుని ప్రేమసాగరమును చదువుచుండెను. కృష్ణునియొక్క బాల్యక్రీడలు చదువుచున్నప్పుడాతనికి మిక్కిలి ఆనందము కలుగుచుండెను. ఇంతలో సాయంత్రమై చీకటి పడుటవలన ఆతడు మరి చదువ లేకపోయెను. కాని అక్కడనుండి లేచుట కాతనికి బుద్ధి పుట్టినది కాదు. ఇంతలో కుక్కలరచి, గ్రామములోనికి ఎవ్వరో క్రొత్తవారు వచ్చుచున్నట్లు సూచించెను. మోహనుడు రాలేదుకదా? యని గోపాలశాస్త్రి గుండె దడ దడ

లాడ సాగెను. ఆతడు వెంటనే పుస్తకమును మూసి లేచుచుండగా కృష్ణశర్మ వచ్చి ఆతనికి నమస్కరించెను.

గో. శా—అందరూ క్షేమముగా నున్నారా?

కృష్ణ—దేవుని దయవలన అంతా క్షేమముగా నున్నారు.

గో. శా—ఆదిక్కుమాలిన వాడి సంగతు లేమైనను తెలుస్తూ యున్నవా?

కృష్ణ—ఆఁ కులాసాగానే యున్నాడు. నాలుగైదు రోజుల కొక సారి మాయింటికి వస్తూయుంటాడు. నేను కూడా అప్పుడప్పుడు వెళ్ళి వాడి యోగక్షేమము కనుక్కుంటూ యుంటాను. మరేమీ యిబ్బంది పడకుండా కులాసాగానే యున్నాడు.

గో. శా—ఆకర్కోటకుడు మాగురించి ఎప్పుడైనను తలుస్తూ యుంటాడా? లేక మేము చచ్చిపోయామని ఊరుకున్నాడా? ఇక్కడకు రానని పట్టుపెట్టుకున్నాడా ఏమిటి? మేము చచ్చిన తరువాత వస్తాడు కాబోలు. వాడి యుద్దేశమే ఆలావుంటె మేమెక్కడకైనా పోతాము. ఈయిల్లు వాకిలి, భూమి పుట్ర చూచుకుంటూ వాడే యీసంసారము చక్కపెట్టుకోనీ. అక్కడ ఒక పెద్దయిల్లు కట్టిస్తూ యున్నాడని విన్నాను. వాడక్కడే ఉండిపోతె ఇక్కడ ఉండేవాళ్లెవరు? ఈయాస్తి అంతా ఎవరు తినను?

కృష్ణ—ఇల్లు కట్టించడములేదు. ఏమిలేదు. ఈసంగతి మీతో ఎవరు చెప్పారో కాని వట్టి అబద్ధము. సున్నపుబట్టీలు, ఇటుకబట్టీలూ మాత్రము పెట్టిస్తూ యున్నాడు. అది కాక నది ఆవలియొడ్డున ఒక స్థలము కొనవలెనని అనుకొంటూ యున్నాడు.

గో. శా—ముందు ఈయింటికి నిప్పంటించి తరువాత అక్కడ భూమి పుట్ర కొనుక్కోమను.

కృష్ణ—మీరెందు కిటువంటి మాటలాడుతారు? మీరేమంటారో

అను భయము వలన వాడిక్కడకు రావడంలేదు. మీరు వాడిని క్షమించారని ఇప్పుడు తెలిస్తే ఈక్షణములో రెక్కలు కట్టుకొని ఇక్కడ వాలుతాడు. నాదగ్గరకు వచ్చినప్పుడెల్ల మీగురించే మాట్లాడుతూ యుంటాడు. ఆజ్ఞయైన రేపే ఇక్కడకు వస్తాడు.

గో. శా—వద్దు వద్దు. నేను వాడిని రమ్మనమని అనను. వాడికి మే మేమౌతామని వాడిక్కడకు వస్తాడు? ఒకవేళ వాడిక్కడకు రాదలచుకొంటే వడలు బాగా గట్టిపరచుకొని మరీరమ్మను. వాడిని చూచిన తోడనే నాకు వెఱ్ఱెత్తుకొని వస్తుంది. కఱ్ఱపట్టుకొని బయలు దేరుతాను. మూర్ఖుడు. నేనంటే అంత నిర్లక్ష్యమా? చిన్నప్పుడు వీడితో ఇంతంత అల్లరి పడ్డానా? తిన్నగా జపమైనా చేసుకో నిచ్చేవాడు కాడు. అన్నమైనా తిన నిచ్చేవాడు కాడు. నావిస్తరిలోనే కలియ పడేవాడు. వాడినుండి బట్టలు ఒక్కనాడైనను తెల్లగా ఉండేవి కావు. తెల్లబట్టలు కట్టుకొన్నాననే సరికి ఎక్కడనుండో మన్నులో ఆడుకుంటూ ఉన్నవాడు పరుగెత్తుకొనివచ్చి నెత్తిమీద సవారీ అయ్యేవాడు. ఆ చనువంతా ఏమైనదో? ఇప్పుడు నా దగ్గరకువస్తే చిన్నతనములో త్రాగిన పాలు గొంతుకలోనికి వచ్చేలాగు గూబలు సాగదీస్తాను.

తరువాత నిద్దరన్నదమ్ములు నింటిలోనికి వెళ్లిరి. జానికమ్మ పెరటిలో కూర్చుని ఆవులకు కుడితి పెట్టించుచుండెను. కొమార్తెలిద్దరు పువ్వులు కోసుకొనుచూ ఆడుకొనుచుండిరి. జానికమ్మ మరదిని జూచినతోడనే లేచి నిలువబడి, "పోని ఇన్నాళ్ళకైనా దర్శనమైనది. నాలుగడుగులలో నున్నారు. నెల కొకసారియైననువచ్చి ఇంటిలోనివారేమైనారో కనుక్కోవద్దూ? అక్కడ అందరు క్షేమముగానున్నారా?

కృష్ణ—ఆఁ. మీ ఆశీర్వచనమువలన అంతా క్షేమమే. ఏమిటి వండుతూయున్నారో ముందుగా చెప్పండి. నాకు క్షీరాన్నము,

మిఠాయిలు పెట్టితే, మీకొక మంచి శుభవర్తమానం చెప్పుతాను. మీకు మనుమడు పుట్టినాడు.

జానికమ్మ ముఖము సంతోషముచే వికసించెను.

జాని—పదండి. మిమ్ములను పాలుమిఠాయిలతో ముంచివేస్తాను. ఎంత తినగలరో చూద్దాం.

గో. శా—(వికసించిన ముఖముతో) నువ్వు చాల చెడ్డకబురు చెప్పినావు. దేవుని దర్బారునందు కూడ న్యాయము తల్లక్రిందు లగునా? నా కొమారుని ఎడబాపుచెయ్యడం. వాడికి కొమారుని ఇవ్వడం. ఇప్పుడు ఒకడి కిద్దరైనారు. వాళ్ళతో నేను చాలగలనా? ఇక లొంగిపోవలసినదే. వాడిక ఏలాగున్నైనను నన్నక్కడకు ఈడ్చుకొనివెళ్ళకమానడు. నా అరికాలప్పుడే దురదవేయుచున్నది. నిజముగా దైవము దుష్టులకే మంచి కూర్చుతూ ఉంటాడు. ఇప్పుడు నాకు మరిపచింతా లేదు. పోని ఏదోయొకవిధముగ దేవుని దయవలన మన వంశము నిలువబడినది. ప్రసవమై ఈ రోజున కెన్ని దినములైనది?

కృష్ణ—ఈ రోజున కెనిమిది దినములైనది. ఇంతకంటె ముందుగానే వచ్చి, ఈ శుభవర్తమానము చెప్పవలెననుకున్నానుగాని వీలు పడినదికాదు.

గో. శా—ఐతే ఏమైనది? పదకొండవ రోజునకు వెళ్ళి గొప్పగా బారసాల చేసికొనవచ్చును. నువ్వు రేపు ప్రొద్దుటే బయలుదేరు.

జానికమ్మ సంతోషముతో ఉప్పొంగిపోవుచుండెను. బాజాభజంత్రీలతో పుత్రోత్సవము పంచిపెట్టవలెననియు, ఇంటివద్ద సందడి చేయవలెననియు ఆమె మనస్సులో సరదాపడుచుండెను. ప్రపంచములో మరి యెవ్వరికిని సంతానము లేనట్లును తానే పుత్రపౌత్రవంతురాలైనట్లును ఆమె గర్వపడుచుండెను. ఇంతలో నౌఖరు వచ్చి

వాకట్లో నొక సాధువు బిక్షకొరకు నిలువబడియున్నాడని చెప్పెను. ఆమె వెంటనే నలుగురికి సరిపోవు స్వయంపాక మిచ్చి పంపెను. రాత్రి భోజనములైన తరువాత అందరు కూర్చుని చాలసేపటివరకు మోహనుని సంగతులు సంతోషముతో చెప్పుకొనిరి.

## ౨౬

మనుష్యుడు లోభవశమున, ఒక వస్తువును దొంగలించి తన తప్పును తెలిసికొన్న తరువాత ఆ వస్తువువైపైనను జూచుటకు సిగ్గుపడునట్లు మోహనుడు కమలను జూచుటకు సిగ్గుపడుచు ఆమెను తప్పించుకొని తిరుగుచుండెను. ఆతడు పగలంతయు వ్యవహారపు పనులను జూచుకొనుచు సాయంత్రము సున్నపుబట్టీలవద్ద కూలీలచేత పనులు చేయించుచు తంటాలు పడుచుండెను. ఆతనికి విసువుగానున్నప్పుడు "ఈ కమలనుండియే నేను ఇంటికి దూరమైతిని. ఈమెవలననే నాకీ చిక్కులు వచ్చినవి. లేనియెడల ఏచింతయు లేకుండ నింటివద్ద హాయిగా యుండియుందును. ఇష్టమువచ్చినది తిని, ఏ తాపత్రయమును లేకుండ కులాసగ తిరుగుచూయుండి యుందును. ఇప్పు డీమెయే ఈ చిక్కులన్నియూ నా నెత్తిని పులిమినది." అని విసుగుకొనుచుండును.

మొదట ప్రేమోన్మాదుడై నిస్సంకోచముగ ఆత డామె చేతి వంటను దినెను. కాని ఇప్పుడు తన తప్పునకు పశ్చాత్తాపమును పొందుచుండెను. ఆమె సంపర్కమును ఏలాగుననైనను తప్పించుకొనుటకు జూచుచుండెను. పూర్వము కమలయన్న ప్రాణమిచ్చుచు, ఆమె చిరునవ్వుకు, మధురవాక్కులకు, కృపాకటాక్షములను తన జీవితము

నైనను ధారపోయుటకు సిద్ధపడిన మోహనుడే యీతడు. ఇప్పు డా కమలయే ఆతని దృష్టియందు ఇంత నీచముగా కనబడుచున్నది. మానవప్రకృతి ఎంత చంచలమైనదో. ఆతడు స్వయముగ అనుభవించి నను ఇప్పుడు మరచిపోయెను.

మోహనుడు చాల దినములనుండి చదువుటయు, వ్రాయుటయు మానివేసెను. ఈ సున్నపుబట్టీలను పెట్టించుచున్నప్పటినుండియు ఆత నికి వార్తాపత్రికను చదువుటకు కూడ అవకాశము లేకుండెను. "ఏపని పాటులు లేకుండ రోజంతయు తీరుబడిగ యుండేవారికే యీ పుస్తక ములు, పత్రికలుగాని నావంటివానికి కా"వని ఆతడు తలచుచుండెను. కాని హార్మోనియమ్ వాయించుటయు, శృంగారించుకొనుటయు మానలేదు. వాటికిమాత్రము ఆతనికి సమయము దొరకుచుండెను.

అత డప్పుడప్పుడు తన పూర్వపు సంగతులను తలచుకొని "నేనప్పు డెందుకంత మూర్ఖుడనైపోతిని ? ఈ కమలనుజూచి నేనప్పు డెందు కంత మోహపడితినో" అని తనలో ననుకొనుచుండెను.

ఇప్పు డాతడు తన సద్వర్తనమునకై చాల గర్వపడుచుండెను. ఆతడు ప్రతిదినము గోదావరియొద్దను స్త్రీలను జూచుచున్నను, ఆతని మనస్సునందు చెడుతలంపులు పుట్టుచుండుటలేదు. అది యంతయు తన బలమే యని ఆతడు తలచుచుండెను.

సుశీలకు ప్రసవదినములు సమీపించుటవలన ఆమె తరచుగ పరుం డియే యుండును. ఇప్పుడు మోహనుడు పనినుండి వచ్చుటతోడనె సుశీల మునుపటివలె చిరునవ్వుతో ఎదురుగావెళ్లి స్వాగతమిచ్చుటలేదు. ఆమె తరచు తలనొప్పివలనను జ్వరమువలనను బాధపడుచుండెను. ఆమె ముఖము నెత్తురు లేనట్లు పాలిపోయియుండెను. ఆమె స్థితిజూచి మోహనునకు చాల దుఃఖము కలుగుచుండెను. ఆతడు తరచు ఆమె వద్ద కూర్చుని ఆమెకు సంతోషముకలుగు సంగతులను చెప్పుచుండును.

కాని అక్కడ కూర్చొనుట ఇష్టము లేనట్లు ఆతని ముఖమువలన తెలియుచుండెను. కొంతసేపైనతరువాత ఏదిమోవంకబెట్టి అక్కడ నుండి లేచివెళ్లిపోవుచుండును. ఆతని విలాసతృష్ణ తిరిగి ఆతని మనస్సును చలింపజేయసాగెను. నదికివచ్చు స్త్రీల నాతడు కామదృష్టితో జూడ మొదలుపెట్టెను. చివర కొకనాడీ చెడుతలంపులచే వికలుడై యాతడు సానివీథివైపు బయలుదేరెను. ఆతడు చాల నెలలై అటువైపునకు వెళ్ళలేదు. అప్పుడు రాత్రి యెనిమిదిగంటలయ్యెను. కామతృష్ణ ఆతనిని ముందునకు తీసుకొనిపోవుచుండెను. ఆతని జ్ఞానవివేకములు ఇప్పు డీ యావేగముక్రింద అణగిపోయినవి. ఆతడు ముందునకు రెం డడుగులు వైచి చటుక్కున ఆగి ఆలోచించుచుండును. తిరిగి ముందునకు బయలుదేరుచుండును. పత్యాపత్యములు విచారింపక తీపిపదార్థములను జూచి, తినవలెనని ఆతృతపడు రోగిస్థితివలె ఇప్పు డాతని స్థితి యుండెను.

ఆతడు సానివీథిని ప్రవేశించెను కాని ఇప్పు డది మునుపటివలె సందడిగాలేదు. తమలపాకులదుకాణములు, చిల్లరదుకాణములు ఉన్నను మిఠాయిదుకాణములు, పువ్వులు అంగడులు మూసివేయబడియుండెను. మేడలపైననుండి తొంగిచూచు వేశ్యలు కనబడుటలేదు. మధురమైన సంగీతధ్వనులు కాని వాయిద్యముల ధ్వనులుకాని మునుపటివలె వినవచ్చుటలేదు. అప్పు డాతనికి వేశ్య లక్కడనుండి వెళ్లిపోయిరను సంగతి జ్ఞాపకమునకువచ్చి చాల విచారము కలిగెను. కాని ఒక క్షణములోనె ఆతని కొక విచిత్రమైన ఆనందము కలిగెను. కఠినులైన పోలీసువారి చేతులనుండి విడువబడిన ట్లాతడు ఇప్పుడీ చెడుతలంపుల నుండి విముక్తుడయ్యెను. మోహను డిప్పుడు తన మనోదార్బల్యము నకు తనలో దానే సిగ్గుపడుచుండెను. ఇదివర కాతనికి తన మనోబలముపైగల గర్వ మిప్పుడు సిథిలమయ్యెను. ఆత డింటికివెళ్లిపోవలెనని

తలచెను కాని నాల్గువైపుల నొక్కసారి షికారు తిరుగవలెనని బుద్ధి పుట్టుటవలన తిరిగి బయలుదేరెను.

కమల పూర్వము నివసించు ఇంటివద్ద కాతడు వచ్చుసరికి ఆయింటి నుండి ఒక మధురమైన సంగీతధ్వని ఆతనికి వినబడెను. ఆత డాశ్చర్యముతో తలను పైకెత్తి చూడగా నొకబల్ల యాతనికి కనబడెను. దానిపై సంగీతపాఠశాల యని వ్రాయబడి యుండెను. మోహనుడు వెంటనే మేడపైకి పెళ్లెను. ఆత డదివరకు చాలసార్లు ఆమేడయందే కమలతో సరససల్లాపము లాడియుండెను. అతని మనస్సున కిప్పుడు పూర్వపుసంగతులన్నియు జ్ఞాపకమునకు వచ్చెను. ఆత డక్కడనున్న బల్లపై కూర్చుని సంగీతము వినుచుండెను. ఇరువదియైదుగురు విద్యార్థులు వాయిద్యములతో తమ స్వరములను కలిపి, అభ్యసము జేయుచుండిరి. ఒకడు చితారు, ఇంకొకడు తబలా, వేరొకడు వీణ, మరియొకడు ఫిడేలు, ఈవిధముగ అంద రన్నివాయిద్యముల వాయించుచుండిరి. ఒక సంగీతాచార్యుడు వారికి వంతులప్రకారము పాఠములు నేర్పుచుండెను. ఆతడు సంగీతవిద్యయందు మంచి నిపుణుడు. ఆ మధురగానమును విని మోహనుడు తన్మయుడై అట్లే కొంతసేపక్కడ కూర్చుండెను. తానుకూడ ప్రతిదినము అక్కడకువచ్చి సంగీతము నేర్చుకొనవలెనని ఆతనికి బుద్ధిపుట్టెను. కాని తమ యిల్లు అక్కడకు చాల దూరమగుటవలన అంతరాత్రివేళ అక్కడకు వచ్చుట కష్టమని ఆతనికి తోచెను. ఆతడు లేవబోవుచుండగా సంగీతాచార్యుడు వీణమీద నొక పాటను ప్రారంభించి పాడుచుండెను.

జయ ! జగదీశ్వరీ ! ఆజనని ! శక్తిస్వరూపిణి ! జయ !

భారతదేశము బాధలలోజిక్కె దానిబంధనములనుండి బాపిరక్షింపుమా ! ॥జయ॥

నీదుఖియోగముచే వ్యాకులపడుమమ్ము నీయొడినిజేర్చి కాచిరక్షిం

పుమా ! ॥జయ॥

మాయజాలములోఁబడి మతిలేకయున్న మాభారత జాతినిదయజూచి గావుమా ! ॥జయ॥

దాస్యశృంఖములోఁజిక్కి కుందుచున్న నీప్రియసుతులను రక్షించి బ్రోవుమా ! ॥జయ॥

ఈ గానము మోహానునియొక్క హృదయమునందు సద్భావముల నుదయింపజేసెను. దేశోపకారము, జాతీయసేవ, దేశగౌరవము మొదలగు పవిత్రభావము లాతని హృదయమునం దిప్పుడు ప్రతిధ్వనించుచుండెను. జగజ్జననియొక్క దయాస్వరూప మాతని హృదయక్షేత్రమునందు ప్రత్యక్షమై నట్లుండెను. దుఃఖితుడు, దరిద్రుడు శల్యావశిష్టుడు నగు నొక బాలకుడు దీనభావముతో దేవివైపుజూచుచు తన రెండు చేతులనుపైకెత్తి సజలనేత్రములతో "దేవి! భారతదేశమును రక్షింపుము" అని ప్రార్థించుచున్నట్లాతనికి తోచెను. ఆకల్పనయందు తాను దరిద్రులగు కృషికుల సేవ జేయుచున్నట్లును, దీనులగు కృషికులను రక్షింపుమని జమీందారులను తాను వేడుచున్నట్లును, కృషికులు తన కాళ్ళపై బడుచున్నట్లును, వారి స్త్రీలు తన నాశీర్వదించుచున్నట్లును, ఆతడు భావించెను. మోహాను డీ కల్పిత వివాహమునందు పెండ్లికొడుకై, జాతిసేవను జేయవలెనని సంకల్పించుకొని అక్కడనుండి బయలుదేరెను. ఆతడు తన తలంపులయందు మగ్నుడై ఎవ్వరితోడను మాట్లాడకుండనె అక్కడనుండి కొంతదూరము వెళ్లి, సుందరీబాయి మేడయందు చాలమంది మనుష్యులు సమావేశమై యుండుటను జూచెను. వీరంద రక్కడ ఎందుకు సమావేశమైరని వారిలో నొకరి నాత డడిగెను. "రామదేవుగారు "రహితుల సహాయసంఘము"ను స్థాపింపబోవుచున్నారు." అని ఆతడు చెప్పెను. రహితులను జమీందారుల అత్యాచారములనుండి రక్షించుటయే ఆ సభయొక్క

ముఖ్యోద్దేశము. మోహనుని మనస్సునందు, అప్పుడప్పుడే ఉదయించిన సానుభూతి మందగించిపోయెను. మోహనుడు కూడ జమీందారుడే. కృషికులను దయగా చూడవలెనని ఆతడు కూడ కోరుచున్నను వారిని జమీందారులకు వ్యతిరిక్తముగా లేవనెత్తుట కాతడిష్టపడ, కుండెను. అతడు తనలో, "వీరు జమీందారుల హక్కులను తొడగించవలెనని జూచుచున్నారు. ద్వేషభావముచే ప్రేరేపింపబడి వీల సంస్థను స్థాపింపజూచుచున్నారు. కనుక నేను కూడ బాగుగ నాలోచించి మమ్ములను మేము రక్షించుకొనవలెను." అని ఆలోచించుకొనుచుండెను. మానవప్రకృతి ఒకరిక్రింద అణగియుండుటయన్న ఎంత అసహ్యము? అప్పుడు పదిగంటలయ్యెను. అక్కడ ఆగుట వ్యర్థమని మోహను డింటికి బయలుదేరెను.

## ౨౭

సాయంసమయ మయ్యెను. ఆకాశమునం దంతటను ఎఱ్ఱని దుప్పటి పరచినట్లుండెను. పిల్లవాయువులు నదీ తరంగములపై ఆటలాడుచు, వాటిని మెల్లమెల్లగ కదలించుచుండెను. ఆకాశదేవత తన ఎఱ్ఱని నేత్రములతో జూచుచు అప్పు డప్పుడు పకపక నవ్వుచుండెను. నవ్వునప్పుడు ఆణిముత్యములవంటి పండ్లు ధగధగ మెరయుచున్న ట్లుండెను. మోహనుని గృహము పువ్వులతోను, లతలతోను రమణీయముగ అలంకరింపబడి యుండెను. కళాసులు, సరంగులు వీధిలో మూగి యుండిరి. లోపల స్త్రీలందరు కూర్చొని పాటలు పాడుచుండిరి. ఈరోజున మోహనుని కుమారునియొక్క బారసాల ఉత్సవము.

ఆ రోజున మోహనుడు చాల విచారముగ కనబడు చుండెను.

ఆతడు వీధి యరుగుపై కూర్చొని, నదివైపు తదేక దృష్టితో జూచు చుండెను. ఆతని హృదయమునందు కూడ విచార తరంగములు లేచు చుండెను. "లేదులేదు వారు రారు. రాదలచినచో నైన ఈ పదకొండవ నాటికే వచ్చియుందురు. వారు రారని తెలిసియుండిన బాబయ్యతో నీసంగతిని చెప్పకపోయి యుందును. నేను చచ్చిపోయినట్లు వారు భావించుచున్నారు కాబోలు? నాతో సంబంధమును వారు పూర్తిగ విడగొట్టు కున్నట్లున్నది. నేను బ్రతికియున్నను, చచ్చిపోయినను వారికి విచారము లేదు. ఎంత కఠినులైనను నిటువంటి సమయమందు తమ శత్రువుల ఇంటికైనను వెళ్లెదరు. ప్రేమచే రాకపోయినను నలుగురు ఏమనుకొనెదరో యని నైనను వచ్చెదరు. వ్యవహార రీత్యా నైనను వచ్చెదరు. ఏప్రకారముగా నైనను వచ్చిన ప్రపంచములో నావారు ఉన్నారు కదాయని సంతోషించు చుందును. పోనీ వారు రాకపోయినను, పని తెరపి చేసికొని ఒకసారి నేనే వెళ్ళి, ఏదో తెగు తెంపులు జేసికొని వచ్చెదను. పిల్లవాడు ఎంత అందముగా నున్నాడు? పెదవులు ఎట్లుగా దొండపండువలె నున్నవి. అచ్చముగా నావలెనే ఉండును. కళ్లు మాత్రము సుశీలవి. నావైపు ఎంత ధ్యానముతో జూచును. నాన్నగారి మాట జెప్పను గాని అమ్మ వాడిని జూచిన తప్పకుండ ఎత్తుకొని ముద్దులాడును." ఇట్లనుకొనుచుండగా మోహానున కకస్మాత్తుగా మరియొక తలపు కలిగెను. "ఒకవేళ నేను చచ్చిపోయిన వీరిగతి యేమగును? ఈ పిల్లవానిని ఎవరు పోషించెదరు? ఈ ప్రపంచములో వాడి కెవ్వరును లేరా? లేదులేదు. నేను చచ్చిపోయిన నాన్నగారికి తప్పక వానిపై దయ కలుగును. ఆతడంత నిర్దయుడు కాజాలడు. సేవింగు బ్యాంకీలో ఎన్ని రూపాయలున్నవి? వెయ్యి రూపాయలైనను పూర్తిగ లేవు. నెల కేబది రూపాయల చొప్పున కూడబెట్టిన సంవత్సరమునకు ఆరువందలగును. రెండువేలు

పూర్తి యైనతోడనె ఇల్లు కట్టుటకు ప్రారంభించెదను. ముందు రెండు గదులు, లోపున కైదుగదులు, వీధిలో కచేరీచావడి, మేడమీద మూడుగదులు ఉన్నయెడల ఇల్లు సదుపాయముగా నుండును. పునాదులు ఎత్తుగా వేయించిన ఇల్లు అందముగానుండి, గాలి బాగుగా వచ్చును. అథమము ఐదడుగులు ఎత్తుగా నైనను పునాదులు వేయించెదను." మోహనుడీ కల్పనలలో మునిగి ఆనందించు చుండెను. అప్పటికి బాగుగ చీకటి పడెను. ఇంతలో రోడ్డుమీదనుండి ఒకబండి వచ్చుచున్నట్లు కనబడెను. దాని రెండువైపుల నున్న దీపములు పిల్లికండ్లవలె మెరయుచుండెను. ఎవరు వచ్చుచున్నారు? బాబయ్యయే యై ఉండును. ఆయన తప్ప మరి నాకున్నవా రెవ్వరు? అని మోహనుడనుకొను చుండగ బండి గుమ్మములో నాగెను. గోపాలశాస్త్రి కృష్ణశర్మ ఆ బండినుండి దిగిరి. దాని వెనుక నింకొక బండికూడ యుండెను. దానినుండి జానికమ్మ, సుభద్రమ్మ మోహనుని ఇద్దరు చెల్లెండ్రును దిగిరి. వెంకటస్వామి లాంతరు పట్టుకొని ముందు నడచుచు వారికి త్రోవ చూపించు చుండెను. ఇందరు వచ్చుచుండుట జూచి మోహనుడు తనవారే వచ్చుచున్నారని నిశ్చయించు కొనెను. కాని వారిని కలుసుకొనుట కాతడు వారి కెదురుగా పరుగెత్తలేదు. ఆతడు వారిని గౌరవించు సమయ మిప్పుడు పోయినది. ఇప్పుడు వారాతనిని గౌరవించు సమయము వచ్చినది. ఎవరినీ జూడనట్లు మోహనుడు అరుగుదిగి ఇంటిలోనికి వెళ్లిపోయెను. ఆతడు తనలో తాము లేని యెడల నేను దిక్కులేని వాడివలె ఉంటాననుకున్నారు కాబోలు? వారు నన్ను ఏలాగు నిర్లక్ష్యముగా జూచిరో ఆవిధముగ నేను కూడ వారిని నిర్లక్ష్యముగా జూచెదను." అని అనుకొనుచు, మోహనుడు లోనికి పోయి వారేమి చేయుచున్నారో యని తలుపుచాటునుండి తొంగి చూచుచుండెను. ఇంతలో వెంకటస్వామి లోనికి వచ్చి

మోహనరావు బాబుగారు! అని గట్టిగా పిలువసాగెను. అప్పుడు మోహనుడు పైకివచ్చి దూరమునుండియే తల్లికినమస్కరించి ప్రక్కకు నిలువబడెను.

గో-శా—(మోహనుని జూచి) మమ్ములను పోలిక పట్టనట్లు ఆలాగున ప్రక్కకు నిలువబడినావేమి? నాకు కాకపోయిన మీయమ్మ పాదముల కైనను నమస్కరించి, ఆశీర్వాదమును పొందుము.

మోహ—నేను తాకిన మీరు మైల పడిపోదురేమో?

గో-శా—(తమ్మునితో) వీడి పెడసరపు మాటలు విన్నావా? మమ్ములను వీడు మరచిపోయి యుండునని నేను మొదటనే చెప్ప లేదా? నామాటలు వినక నమ్ముల నిక్కడ కీడ్చుకొని వచ్చితివి. తల్లిదండ్రులు గుమ్మములో నిలచియుండగా జూచి యైనను వీని మనస్సు కరిగినది కాదు.

జాని—(ముందునకువచ్చి) బాబూ? మోహనా! నాన్నగారి పాదములకు నమస్కరించు. నీవు బుద్ధిమంతుడవు కదా? ఇటువంటి మాటలాడెదవా?

మోహనుని బింకము సడలిపోయెను. కండ్లవెంట నీళ్లు కారుచుండగా నాతడు తండ్రికాళ్లపై బడెను. శాస్త్రికి కూడ కండ్లవెంట నీరు వచ్చెను. తర్వాత మోహనుడు తల్లికాళ్లపై బడెను. జానికమ్మ యాతనిని లేవనెత్తి కౌగలించుకొని యాశీర్వదించెను.

ప్రేమ భక్తులమలయొక్క దృశ్యమెంత మనోహరమైనది? ఎంత ఆనందమైనది? తల్లిదండ్రుల హృదయములు ప్రేమచే పులకితములగు చుండెను. పుత్రుని హృదయసాగరమునందు భక్తితరంగములు లేచు చుండెను. ఈభక్తి ప్రేమలయొక్క నిర్మలజ్యోతులవలన హృదయముల యందలి చీకటిగదులన్నియు ప్రకాశవంతములయ్యెను. మిథ్యాభిమానము, లోకనిందా యను భయంకరమైన కీటకములు ఆజ్యోతియం

దొక్క సారిగ నశించెను. ఇప్పుడక్కడ నిజమైన ప్రేమయు భక్తియు తమ నివాసముల నేర్పరచుకొనెను.

సంతోషమువలన మోహనుని కాళ్లు నేల నానుటలేదు. ఆతడు కళాసులకును సరంగులకును పనులు పురమాయించుచు తనకున్న పలుకుబడి నంతను కనబరచుచుండెను. ఒకడు మంచములువేసి పక్కలు పరచుచుండెను. ఇద్దరు గోదావరినుండి నీళ్లను తెచ్చుచుండిరి. సామానులను తెచ్చుటకొరకొకడు బజారునకు పరుగెత్తెను. ఇది యంతయు జూచి సంతోషమును పట్టజాలక గోపాలశాస్త్రి తమ్మునితో మెల్లగా, మోహనుడు చాల చతురుడైనాడే. ఇబ్బందిపడుచు ఏదో విధముగ సంసారమును గడపుకొనుచున్నాడని అనుకొంటిని. కాని ఇక్కడ సౌఖ్యపడుచు చాల గౌరవముగా నున్నాడు.”

ఇంతలో తోటికోడం డ్రిద్దరును లోపలకు వెళ్లిరి. జానికమ్మ నాల్గువైపుల నాశ్చర్యముతో జూచుచు “ఇల్లెంత శుభ్రముగానున్నది? ఎక్కడ ఉండవలసిన వస్తువు లక్కడ బాగుగ సర్దినారు. దీనియక్క చాల తెలివైన దానివలె కనబడుచున్నది.”

వారు పురిటిగదిలోనికి వెళ్లుటతోడనె సుశీల లేచి అత్తగారి ద్దరకు నమస్కరించెను. జానికమ్మ మనుమని ఒడిలో పెట్టుకొని ముద్దులాడ సాగెను. ఆపిల్లవా డామెకండ్లకు కృష్ణావతారమువలె కనబడుచుండెను. ఆమె సంతోషమును పట్టజాలక కండ్లవెంట ఆనందబాష్పములను కార్చెను.

కొంతసేపైన తరువాత ఆమె గోపాలశాస్త్రివద్దకు వెళ్లి సంతోషముతో “ఐనదేదో యైనది. కాని మీరు చాల అదృష్టవంతులు. మంచి అందమైన కోడలిని సంపాదించినారు. నిజముగా గులాబీపువ్వే. ఇక మనుమడు సాక్షాత్తు కృష్ణావతారమే!”

గో-శా—ఎంత తేజోవంతుడు కాకపోయిన, గోపాలశాస్త్రి

నిక్కడ కీడ్చుకొని రాగలడా ?

జాని—కోడలు చాల శీలవంతురాలుగ కనబడుచున్నది.

గో. శా—కనుకనే దానికొరకు వాడు తల్లిదండ్రులనుకూడ విడిచి పెట్టినాడు. అందరూకూడ నీవిధముగ నెవరిసందడిలో వారుండిరి. కాని వకరికినికూడ నిర్భాగ్యురాలగు కమల ఎక్కడనున్నదోయను చింతయే లేకపోయెను.

౨౮

స్నానముచేసి నీళ్లు తెచ్చుటకు చీకటిపడుచుండగా కమల నదికి వెళ్లెను. ఆమె తిరిగి వచ్చుసరికి గుమ్మముముందు బండ్లు నిలువబడి యుండెను. అరుగుపై కొందరు కూర్చుని ఉండిరి. ఆమె కృష్ణశర్మను పోలికపట్టి, మోహానుని తల్లిదండ్రులు వచ్చియుందురని ఊహించెను. ఆమె మరిముందునకు వెళ్ళలేకపోయెను. ఆమె కాళ్ళకు సంకెళ్ళు తగిలించినట్లయ్యెను. అక్కడ తనకిక స్థానములేదనియు, వారితో తనకుగల సంబంధమువదలిపోయినదనియు, ఆమె తలచెను. ఆమె రాతిబొమ్మవలె నిలువబడినచోటనే నిలువబడిపోయి, ఎక్కడకు పోవుదునాయని ఆలోచించసాగెను.

ఇప్పుడొక నెలనుండియు సుశీల కమలను చాల నిర్లక్ష్యముగ జూచుచుండెను. విధవాశ్రమమునందున్నప్పుడు దయాశాంతములు మూర్తీభవించినట్లున్న సుశీల ఇప్పుడు కమలను విసిగించుచు మాటిమాటికిని ఆమెపై చీదరపడి కేకలువేయుచు, ఆమెకు మిక్కిలి దుఃఖమును కలిగించుచుండెను. ఒకరిపైని ఆధారపడియున్న దినములలో మనము ఎంత వినయవంతులముగను, కర్తవ్యపరాయణులముగను

ఉందుమో స్వతంత్రులమైన తరువాతకూడ ఆవిధముగనె ప్రవర్తించిన మనము దేవతుల్యులమే. సుశీలకప్పుడు సహానుభూతియొక్క అవసర ముండెను. ప్రేమయొక్క కోరిక ఆమె చిత్తమును ఉదారవంతముగను, కోమలముగను, నమ్రతకలదిగను చేసివైచెను. కాని ఇప్పుడామె తన ప్రేమరత్నమును సంపాదించి, దరిద్రునకు ధనముదొరకినట్లామె హృదయము కఠోరమయ్యెను. మోహనుడు కమల మాయలలో నెక్కడ చిక్కుకొనునో యను భయమామెను దహించివేయుచుండెను. కమల యొక్క సద్గ్రంథకాలక్షేపమునకును భక్తిశ్రద్ధలకును ధర్మనిష్ఠకును ఆమె దృష్టియందు కొంచమైనను విలువలేకుండెను. ఇదియంతయు వట్టి నటనయే యని సుశీల తలచుచుండెను. కమలకు చిన్నతనము నుండియుకూడ సుచిగాను, శుభ్రముగాను ఉండుట అలవాటు. ఇప్పుడామె తలను దువ్వుకొని సుభ్రమైన చీరను కట్టుకొన్న సుశీల మరియొక విధముగ తలచుచుండెను. కమలయొక్క ఆచారవ్యవహారముల నామె తీవ్రదృష్టితో జూచుచుండెను. ఈ పరిస్థితులను జూచి కమల మోహానునితో ఏవిషయము చెప్పవలసివచ్చినను సుశీలతోనే జెప్పుచుండెను. సుశీల సుస్తీచే గదిలో పడుకొన్నప్పటికిని మోహానుని భోజనసమయమునందు ఏదోయొక వంకబెట్టుకొనివచ్చి అక్కడనే కూర్చొనుచుండును. తన పురిటిసమయమునకుముందే కమల నెక్కడకైనను పంపివేయవలెనని చూచుచుండెను. తాను పురిటిగదియందు కట్టుపడిఉండగా కమలను కనిపెట్టలేదుకదా ? ఆమె ఏకష్టమునైనను సహించుటకు సిద్ధముగానుండెనుగాని అనుమానమును మాత్రము సహించజాలకుండెను.

కమల ఇదియంతయు జూచుచున్నను జూడనట్లును, వినుచున్నను విననట్లును ఉండెను. నదియందుములిగిపోవుచున్న మనుష్యునివలె ఆమె యీ ఆధారమును విడువజాలకుండెను. ఆమె తన జీవితమార్గ

మును ఏవిధముగను స్థిరపరచుకొనలేకుండెను. కాని ఇప్పుడు మోహనునియొక్క తల్లిదండ్రులను అక్కడ జూచిన తర్వాత ఆ యాధారమును వదలుకొనవలసివచ్చెను. ఇచ్ఛయు శక్తియు నెరవేర్చలేనిక్రియను అవస్థచేయించుచుండెను. కమల చివరకు నదియందు పడిపోవుటకే నిశ్చయించెను.

ఆమె నెమ్మదిగ నడుగులువేయుచు పెరటిగుమ్మమువైపువెళ్లి వారు తనగురించి ఏమనుకొనుచున్నారోయని వినసాగెను. ఆమె అర గంటవరకు అట్లే నిలువబడియుండెను. జానికమ్మ సుభద్రమ్మ మాట్లాడుకొనుచుండిరి. చివరకు జానికమ్మ సుభద్రమ్మతో "దీని యక్క ఇప్పు డిక్కడ ఉండుటలేదా ?"

సుభ—ఇక్కడ ఉండక మరి యెక్కడకు వెళ్లును ?

జాని—ఎక్కడను కనబడుటలేదు ?

సుభ—ఎక్కడకైనను పనిమీద వెళ్లినదేమో ? ఆమెయేకదా ఇంటి పనియంతయు జూచుచున్నది.

జాని—అది వస్తే పైనే ఉండమని చెప్పవలెను. మోహానుడు దానిచేతివంటే తినుచున్నాడు కాబోలు ?

సుశీ—(పురిటి గదిలో నుండియే) లేదు లేదు. మొన్నటివరకు నేనే వండుచుంటిని ఈ పదిరోజులై ఆయన చేతితో ఆయనే వండు కుంటూ ఉన్నారు.

జాని—ఐనా కాని కుండలు బిందెలు అదిముట్టుకోకుండా ఉన్నదా ఏమిటి ? కుండలన్నియు అవతల పారేయించి, సామానులన్నీ తో మించి ఇల్లూ వాకళ్లు కడిగి వేయించవలెను.

సుభ—పాప మామె పైనపడుకొనుటకు చోటెక్కడ ఉన్నది ?

జాని—చోటు లేకపోయినా నేను దానిని లోపల పడుకోనియ్యను ఇటువంటి దానిని ఎవరు నమ్మమన్నారు.

సుభ—లేదక్కయ్యా! ఇప్పుడామె మునుపటి మనిషే కాదు. ఎల్లప్పుడు వ్రతోప వాసములు చేయుచు చాల నియమముగా నుండును.

జాని—చాలు, దాని నియమం నిప్పన్ను అన్ని వాయిద్యములు వాయించి ఇప్పుడు నిప్పాపరు రాలైనది కాబోలు? దేవతా విగ్రహమునకైనను విరిగిన చెయ్యి అతుకునా? ఇప్పుడది దేవతా సమానురాలైనను నేను దానిని నమ్మను.

కమల ఇక నామాటలను వినలేక పోయెను. ఆమెకు కాల్చినశూలములతో గుండెలలో పొడుచు చున్నట్లుండెను. ఇక నొక నిముషమైన ఆమె అచ్చట నిలువలేక ఆచీకటిలో వచ్చిన త్రోవనే బయలుదేరెను.

చీకటి దట్టముగా నల్లుకొని యుండెను. త్రోవయైనను బాగుగ కనబడుటలేదు. కమల అట్లే పడుచు లేచుచు వెళ్లు చుండెను. ఎక్కడ నుండి ఎక్కడకు వెళ్లుచున్నదో ఆమెకే తెలియదు. ఆమెకిప్పుడు ఒడలిమీద స్పృహయేలేదు. దెబ్బలుతిని భయపడిన కుక్కవలె ఆమె మూర్ఛావస్థయందే వెళ్లిపోవుచుండెను. ఆమె తన మనస్సును స్థిరపరచుకొన వలెనని ఎంత ప్రయత్నించినను స్థిమితపడ కుండెను. ఇంతలో నొక పెద్ద ముల్లామె కాలిలో దిగపడిపోయెను. మరి నడచుటకు స్వాధీనము లేక కాలుపట్టుకొని ఆమె అచ్చటనే చతికిలపడిపోయెను.

మూర్ఛనుండి తెలివివచ్చిన మనుష్యునివలె కమల తులుక్కుపడి నిటునటు చూడసాగెను. నలువైపుల నిశ్శబ్దముగ నుండెను. చీకటి గాఢముగా నుండెను. నక్కలు మాత్ర మప్పుడప్పుడు భయంకరముగా నఱచుచుండెను. తానక్కడ వంటరిగా నుంటినని తలపునకు వచ్చినతోడనే ఆమె ఒడలుగడగడ వణకెను. ఒంటరితన మనిన నేమో ఇప్పుడామెకు బాగుగ బోధపడెను. చుట్టుప్రక్కల నెవ్వరును లేరనియు తానక్కడ ఒంటరిగా నుంటిననియు ఆమెకు తెలిసి నప్పటికి నాలుగు వైపులను క్రిందను మీదను అనేక జీవులు పరుగెత్తు చున్నట్లామెకు

కనబడుచుండెను. ఆమె ఆదృశ్యమును చూడజాలక భయముచే రెండు కండ్లను గట్టిగా మూసికొనెను. ఒంటిరి తన మనేక విధములైన భయంకర కల్పనలను పుట్టించు చుండును. కమల తనలో "నేనెంత నిర్భాగ్యురాలను? ఇతరుల మాట యట్లుండగా నా స్వంత చెల్లెలే నాముఖమును జూచుటకు కూడ నిష్టపడకున్నది. ఆమెను నమ్ముకొన్నందుకు నాకు తగిన శాస్తిచేసినది. ఎంత ప్రయత్నించినను నాకు వచ్చిన కళంకమును నేను పోగొట్టుకొనజాలను. ఆమెను నిందించుట ఎందులకు? ఇది యంతయు నా పాప కర్మఫలమే. అయ్యో నా కాలెంత బాధ పెట్టుచున్నది? ఈ ముల్లెట్లు పైకివచ్చును? లోపల విరిగినట్లున్నది. ఎంత పోటుపెట్టుచున్నది? అయ్యో! నేనెవ్వరిని నిందింప జాలను. పాపమును జేసితిని దాని ఫల మెవ్వరనుభ వించెదరు? భోగ తృష్ణ నాకీ దుర్గతిని తెచ్చిపెట్టినది. నేనెంత గ్రుడ్డిదాన నైపోతిని? కేవల మింద్రియ సౌఖ్యముల కొరకాత్మ నాశనమును జేసికొంటిని. నిజముగ నాకప్పుడు కష్టముగానే యుండెను. మంచి బట్టలకు నగలకు భోజనమునకు ప్రేమకు కూడ నేనప్పుడు వాచిపోతిని. అప్పుడు నా జీవితమే నాకు దుఃఖ మయముగా దోచుచుండెను. ఆయవస్థ కూడ నాపూర్వ జన్మ పాపఫలమే. ఇంతకంటె కష్టములు పడుచు తమ ఆత్మలను రక్షించుకొను స్త్రీలులేరా? దమయంతి కెన్నెన్ని మహా కష్టములు వచ్చినవి. సీతను రామచంద్రు డింటినుండి పంపివేసినప్పుడామె అడవి యందు సంవత్సరముల తరుబడిని ఎన్నెన్ని కష్టము లనుభవించినది? సావిత్రి ఎటువంటి దుఃఖములను సహించినది? కాని వీరందరును ధర్మమునందు దృఢ మనస్కులై యుండిరి. అంతదూర మెందులకు? మా యిరుగు పొరుగుల నెంతమంది స్త్రీలు ఏడ్చుచు దినములు గడుపుట లేదు? రామవరమునందు పాపమా గొల్ల సుబ్బ ఎన్నెన్ని బాధలనుభవించు చుండెడిది? దాని మగడు రంగమువెళ్లి ఎన్ని సంవత్సరములో

మైనది. పాపమది ఉపవాసములు జేయుచునట్లే పడియుండెడిది. అయ్యో! ఈ సౌందర్యము నన్నెంత పాడుచేసినది? ఈ సౌందర్య గర్వమే నన్నీ స్థితికి దెచ్చినది.

హా! ఈశ్వరుడా? సౌందర్యము నిచ్చి మనస్సు నెందుకు చంచలమైన దానిగ జేసితివి? సుందర యువతులు సాధారణముగా చంచల స్వభావులే బహుశః ఈశ్వరుడీ యుక్తిచే మా యాత్మలను పరీక్షించుచున్నాడు కాబోలు? లేక జీవిత మార్గమునందీ యడ్డునుపెట్టి ఆత్మలను బలకరములుగను, ధైర్య వంతములుగను జేయుచున్నాడో? సౌందర్యమను అగ్నియందు ఆత్మలను పడవేసి వాటికి ప్రకాశమును కలిగింప జూచుచున్నాడో? అయ్యో అజ్ఞాన వశమున మనమేమియు కనిపెట్టలేకున్నాము. ఈ యగ్ని మనలను కాల్చివేయుచున్నది. ఈ యాటంకము మనలను చలింప జేయుచున్నది.

ఈ బాధ ఎట్లుతగ్గును? ఈ ముల్లును ఎవరు తీయుదురు. ఇక్కడ నేనెంత ఏడ్చినను వినువారెవ్వరు? ఇది భోగ తృష్ణయొక్క దోషము కాదు. సౌందర్యముయొక్క దోషమును కాదు. ఇది యంతయు నా అజ్ఞాన దోషమే. మహాప్రభూ! నాకు జ్ఞానమును దయచేయుము. నీవే నన్నిప్పు డుద్ధరింపగలవాడవు. నేను విధవా శ్రమమునందు ప్రవేశించి చాల తప్పుచేసితిని, సుశీల వద్ద నుండుట కూడ చాల పొరబాటే. మనుష్య మాత్రులు నన్ను రక్షించెదరని ఆశపడుట వట్టి వెఱ్ఱితనము. వారుకూడ నావలెనే అజ్ఞానావస్థయందు పడియున్నారు. అటువంటి వారు నన్నెట్లు రక్షించగలరు? నేనా పరమేశ్వరునే శరణు జొచ్చెదను. కాని ఎట్లు పోవుదును? త్రోవయేది? రెండు సంవత్సరముల నుండి ధర్మ గ్రంథములను చదువుచున్నాను. కాని ఏమియు బోధపడుటలేదు. భగవంతుడా నిన్నెట్లు చేరుకొందును? నన్నీ యంధకారమునుండి రక్షింపుము. నీవు దివ్యుడవు. జ్ఞానమయుడవు. నీ ప్రకాశము

నందీ యంధకారము విచ్ఛిన్నమైపోవును. ఈయాకులెట్లు గలగలలాడు చున్నవి? ఏదైనను క్రూర జంతువు వచ్చుట లేదుకదా? ఔను తప్పక ఏదో వచ్చుచున్నది.” అని అనుచు కమల లేచి నిలువబడెను. ఆమె మనస్సిప్పుడు చాల దృఢముగాను, నిర్భయముగాను ఉండెను.

కమల చాల సేపటివరకీ తలంపుల యందే మగ్నురాలై యుండెను. ఈ తలంపులవలన ఆమె మనస్సునకు శాంతి కలుగుచుండెను. ఇప్పటి వరకీ విధముగ ఆమె యెన్నడును ఆత్మ విచారమును జేసి కొనలేదు. ఈ యాపదల వలన ఆమెయొక్క సద్విచారములు జాగ్రతములయ్యెను.

ఈ తలంపులతో చాల రాత్రి గడచిపోయినది. వసంతకాలపు చల్లనిగాలి వీవసాగెను. కమల బట్టను సర్దుకొని మోకాళ్లపై తల నిడుకొని కూర్చుండెను. ఈ ఋతువునందే, ఈ సమయమునందే తాను తన భర్త ద్వారమువద్ద కూర్చుని “ఎక్కడికి పోవుదును” అని యాలోచించిన సంగతి ఇప్పు డామెకు జ్ఞాపకమునకు వచ్చెను. ఆసమయమునం దామె భోగతృష్ణయందు మండిపోవుచుండెను. ఇప్పు డామెకు భక్తి యను చల్లనినీడ ఆశ్రయ మిచ్చెను.

ఇంతలో నొక్కసారి కమల కండ్లు మిరిమిట్లు గొల్పిన ట్లయ్యెను. సాధు రామానందస్వామి మృగచర్మమును ధరించి దయాపూర్ణనేత్రములతో జూచుచు తనయెదుట నిలువబడియుండుటను ఆమె జూచెను. కమల వెంటనే అతని కాళ్లపై బడి స్వామీ! నన్నుద్ధరింపుడని వేడుకొనెను. రామానందస్వామి దయతో ఆమె తలను నిమురుచు “భగవంతు డందుకొరకే నన్ను నీవద్దకు పంపినాడు. నీ కేమి కావలెనో జెప్పు? ధనము కావలెనా?” యని ప్రశ్నించెను.

కమ—వద్దు స్వామి. ధనమునం దాశలేదు.

స్వామి—సన్మానము కావలెనా?

కమ—సన్మానమునందు కూడ నాకు కోరికలేదు.

స్వామి—భోగవిలాసమో?

కమ—స్వామి! దయచేసి ఆసంగతి మాత్రము జ్ఞాపకము చేయకుడు. నాకు జ్ఞానమును దయచేయుడు.

స్వామి—సరే. ఐతే విను. కృతయుగమునందు మనుష్యుని ముక్తి జ్ఞానమునందును, త్రేతాయుగమునందు సత్యమునందును, ద్వాపర యుగము నందుభక్తియందును ఉండెను. కాని యీకలియుగమునందు మనుష్యుని ముక్తి కేవలము సేవయందేయున్నది. ఈసేవామార్గము నే యనుసరించిన నీ వుద్ధరింపబడగలవు. ఈ ప్రపంచమునందు నీకంటె కూడ దీనులు దుఃఖితులు కలరు. వారి సేవ జేయుము. వారి యాశీర్వాదములే నిన్నుద్ధరింపగలవు. కలియుగమునందు భగవంతుడీ దుఃఖసాగరమునందే నివశించును.

కమల కండ్లు విప్పి యిటు నటు జూచెను. తాను మేలుకొంటిననియే ఆమె నమ్ముచుండెను. కాని స్వామి ఇంత త్వరలో నెట్లదృశ్యుడయ్యెనో యని ఆమె ఆశ్చర్యపడుచుండెను. ఇంతలో నకస్మాత్తుగ నతడు లాంతరును చేత నిడుకొని ఎదురుగా నున్న వృక్షములక్రింద నిలువబడియున్నట్లామెకు కనబడెను. ఆమె వెంటనే లేచి కుంటుచు ఆతని వైపునకు బయలుదేరెను. ఆ చెట్లసమూహము తనకు నూరు గజముల దూరములలో నున్నట్లామె తలచెను కాని నూరుగజములకు బదులు మూడు నాలుగువందల గజముల దూరము కూడ నామె వెళ్లెను. ఆమె యనెంత దూరము వెళ్లినను, ఆ వృక్షముల సమూహము, వాటిక్రింద లాంతరు చేత నిడుకొనిన స్వామియు నూరుగజముల దూరములోనే కనబడుచుండెను.

కమలకు భ్రమ కలిగిన ట్లయ్యెను. "నేను నిదురపోవుచుండుటలేదు కదా? ఇది స్వప్నమా? నే నెంతదూరము వెళ్లినను ఆయన అంత

దూరములోనే కనబడుచున్నారు." అని యనుకొనుచు "స్వామీ! నేను వచ్చుచున్నాను. మీరు కొంచ మాగుడు." యని గట్టిగా నరచెను.

"వేగముగా రా. నేను నిలువబడియే యున్నాను. అను మాట లామె చెవుల బడెను. కమల తిరిగి బయలుదేరెను. కాని రెండువందల గజముల దూరము వెళ్లిన తరువాత ఆమె అలసిపోయి మరి నడువలేక క్రింద చతికిలబడిపోయెను. ఆ వృక్షముల సమూహాము వాటిక్రింద స్వామియు పూర్వమువలె నూరుగజముల దూరములోనే కనబడు చుండెను.

భయముచే కమల ఒడలు కొయ్యబారెను. గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. కాళ్లు వణకుచుండెను. ఆమె గట్టిగా కేకలువేయ దలచెను గాని గొంతుక లేచినది కాదు.

కమల సావధానముతో నీ రహస్య మేమి యని ఆలోచించుటకు కోరుచుండెను. ఇవి యన్నియు పిశాచములయొక్క చేష్ట లేమో యని ఆమె శంకించుచుండెను. కాని ఏదియో అజ్ఞాతశక్తి ఆమెను ముందునకే తీసికొని పోవుచుండెను. ఇచ్ఛాశక్తి మనస్సును వదలి ఈ రహస్యము వెనుకనే పరుగెత్తుచున్నట్లుండెను.

కమల తిరిగి బయలుదేరెను. ఇప్పు డామె పట్టణమునకు దగ్గరగా వచ్చెను. స్వామి ఒక చిన్న కుటీరములోనికి వెళ్లిపోయినట్లును, వృక్ష సమూహాము మాయమైనట్లును ఆమెకు కనబడెను. ఇదియే ఆయన కుటీరమని కమల తలచెను. తాను స్వామిని కలిసికొనగలననియు, ఆయనవలన నీ రహస్య మంతయు తెలియగలదనియు ఆమెకు ధైర్యము కలిగెను. కమల కుటీరద్వారమువద్దకు పోయి, "స్వామీ! నేను కమలను" అని మెల్లగా ననెను.

ఆ కుటీరము రామానందస్వామిదే. కాని ఆయన లోపల నిద్రించు

చుండెను. కనుక కమల మాట కేమియు ప్రత్యుత్తరము రాలేదు. కమల సాహసించి లోపలకు తొంగిచూచెను. అగ్నిహోత్రము మండు చుండెను. రామానందస్వామి కంబళి కప్పుకొని నిద్రించుచుండెను. "ఈయన ఇప్పుడే కదా కుటీరములోనికి పోయిరి. ఇంత త్వరలో నెట్లు నిద్రపట్టినది? లాంత రేమైనది?" అని ఆశ్చర్యపడుచు "స్వామి!" యని మరియొకసారి గట్టిగా పిలచెను.

రామానందస్వామి నిద్రనుండి మేల్కాంచి లేచి కూర్చొని కమలవై పాశ్చర్యముతో జూడసాగెను. అత డట్లే యొక నిముషము ధ్యానముతో జూచి "ఎవరు వారు కమలా?" యని ప్రశ్నించెను.

కమ—ఔను. స్వామీ నేనే.

రా-స్వా—నే నిప్పు డిప్పుడే నిన్ను కలలో జూచినాను.

కమ—(ఆశ్చర్యముతో) మీ రిప్పు డిప్పుడే కదా కుటీరములోనికి వెళ్లిరి?

రా-స్వా—లేదు. నేను కుటీరములో పరుండి చాలసేపైనది. నే నింతకుముం దెక్కడకును వెళ్లలేదు. కలలో మాత్రము నిన్ను జూచినాను.

కమ—నేనిప్పుడే కదా నదియొద్దనుండి మీ వెనుక వెనుక వచ్చినాను. మీ రింతవరకు లాంతరు పట్టుకొని నాముందునే కదా నడచినారు?

రా-స్వా—(చిరునవ్వుతో) నువ్వు చాల మోసపోయినావు.

కమ—మోసమైన నేను వినని చూడని ఈ స్థలమున కెట్లు రా గలుగుదును? నేను నదియొద్దున కూర్చొని ఎట్లు ముక్తిని పొందగలుగుదునా యని ఆలోచించుచు, నన్ను దయజూచి రక్షింపుమని దేవుని ప్రార్థించుచుంటిని. ఇంతలో మీ రక్కడకు వచ్చి నాకు సేవాధర్మమును ఉపదేశించితిరి. ఇంకను మి మ్మెన్నియో సంగతుల నడుగవలెనని అనుకొనుచుండగా మీ రకస్మాత్తుగ మాయమైరి. కాని ఒక్క

క్షణమైన తరువాత మీరు లాంతరును పట్టుకొని దూరముగా నగు పడిరి. అప్పుడు నేను మీవెంట బడితిని. ఈ రహస్య మేమో నాకు బోధపడుటలేదు. దయచేసి దీని యర్థ మేమో తెలుపీయుడు.

రా-స్వా—అలాగే ఐ ఉండవచ్చును. కాని దాని యర్థము నీ కిప్పుడు బోధపడదు.

కమ—ఏదేవత యైనను మీ వేషమును ధరించి నన్ను మీ ఆశ్రమమునకు చేర్చినదేమో?

రా. స్వా—అదికూడనసంభవమే. నీవు చెప్పినదంతయు నేను కలలో జూచితిని. నీకప్పుడు సేవాధర్మమునుకూడ నుపదేశించితిని. కమలా! నీవు నన్ను బాగుగ నెరుగుదువు. నావలన నీవు చాల దుఃఖముల ననుభవించితివి. చాల కష్టములను సహించితివి. నేనెంత నీచుడనో, ఎంత అధముడనో నీవెరుగుదువు. నా నీచత్వమును తలచుకొన్న నాకే మిక్కిలి దుఃఖము కలుగుచుండును. నీవాదరింపబడుటకు తగినదాన వైనను నిన్ను నేను తిరస్కరించితిని. ఇదియే మన దురవస్థలయొక్కయు, దుఃఖములయొక్కయు మూలకారణము. మన దేశ స్త్రీలు గౌరవింపబడుకాలము దైవ మెన్నడు దయచేయునో? మన స్త్రీలు మాసి చినిగినబట్టలను కట్టుకొనుచు నగలునాణెములులేక, ఒకపూట పట్టెడన్నమును తినియైనను కొంపలోపడియుండి, ఇంటిచాకిరీనంతను జేయుచు, కష్టములనన్నియు సహించుచుకూడ నానందముతో జీవితమును గడపగలరు. కేవలము ప్రేమాదరములే వారికున్న చాలు. అట్టి ప్రేమాదరములు లేనియెడల రాజాంతఃపురములందు నివశించుచున్నను సౌఖ్యముగా నుండజాలరు. అజ్ఞానము, విద్యావిహీనత, యను అంధకారములలోపడియుంటిని. ముక్తిపొందుసాధనములేవియు నావద్దలేకుండెను. జ్ఞానములేదు. విద్యలేదు. భక్తిలేదు. పనిచేయు సామర్థ్యములేదు. కనుక నేను నాబంధుగులకు సేవజేయుటకు నిశ్చ

యించుకొంటిని. ఈ మార్గమే నాకన్నిటికంటె సులభముగా కనబడి నది. అప్పటినుండి నా శక్త్యానుసారము ఈమార్గమునే అనుసరించు చున్నాను. ఆత్మోద్ధరణయొక్క మార్గమునందు నామాంతరములే భేదములని అనుభవమువలన నాకిప్పుడు బోధపడినది. ఈ మార్గము ననుసరించుటవలన నామనస్సున కిప్పుడు శాంతి కలుగుచున్నది. అందువలన నీమార్గమే అన్నిటికంటె ఉత్తమమైనదని నీకుకూడ నుప దేశించుచున్నాను. నేను నిన్ను విధవాశ్రమమునందు జూచితిని. మోహనరావింటియందు జూచితిని. నీవప్పుడు సేవావ్రతమునందు మగ్నురాలవై యుంటివి. నేను నీకొరకు దీనినిగురించి యేదేవుని నెల్లప్పుడును ప్రార్థించుచుంటిని. నీహృదయమునందు దయయున్నది. ప్రేమయున్నది. సహానుభూతియున్నది. ఇవియే సేవాధర్మముయొక్క ముఖ్యసాధనములు. సేవాద్వారము నీకొరకు తెరువబడియే యున్నది. అది నిన్ను తనవైపునకు పిలుచుచున్నది. దానియందు ప్రవేశింపుము. దైవము నీకెల్లప్పుడును తోడ్పడుగాక."

కమలకు రామానందుని ముఖమునందు విమలజ్యోతియొక్క ప్రకాశ మగుపడుచుండెను. ఆమె యంతఃకరణయందాతనియెడల అద్భుతమైన శ్రద్ధాభక్తు లుదయించెను. ఆమె తనలో "వీరి యాత్మ యందెంత దయాప్రేమలున్నవి ? అయ్యో నేనిటువంటి నరరత్నమును నాబుద్ధిహీనతవలన తిరస్కరించితిని. వీరిసేవజేయుచుండిన నాజీవితము సఫలతనొందగలదు." అని యనుకొనుచు రామానందస్వామితో మహానుభావా ! మీరు నాకు దైవస్వరూపులు. మీవలననే నేను ముక్తిని పొందగలుగుదును. గనుకనాశరీరమును, ఆత్మను మీసేవయందే యర్పించుచున్నాను. ఈ ప్రతిజ్ఞ నేనే నొకసారి చేసియుంటిని. కాని అజ్ఞానవశమున నేను దానిని పాలించలేకపోతిని. ఆ ప్రతిజ్ఞ నాహృద యమునుండిపోలేదు. ఈ దినమున నిజమైన మనస్సుతోనే నీప్రతిజ్ఞను

తిరిగిచేయుచున్నాను. మీరు నాపాణిగ్రహణమునుజేసితిరి. కనుక నేను పతితురాలనైనప్పటికిని ఉదారస్వభావులగు మీరు నాకు క్షమాదానమును దయచేయుడు. నన్ను సన్మార్గమునకు తీసికొనిపొండు."

రామానందస్వామి కిప్పుడు కమల ముఖమునందు ప్రేమపవిత్రతల యొక్క తేజము కనబడుచుండెను. అది జూచి ఆతడు వ్యాకులుడయ్యెను. సంవత్సరములతరుబడిని ఆతడణచియుంచినభావములు జాగ్రతములుకాజొచ్చెను. సౌఖ్యానందములయొక్క నవీనభావము లుత్పన్నముకాసాగెను. ఆతనికి తన జీవితము శుష్కముగను, సారహీనముగను, ఆనందరహితముగనుదోచెను. ఈ కల్పనలవలన నాతడు భీతుడయ్యెను. తన మనస్సునందే భావములు నిలిచిపోయిన తన వైరాగ్యము, నియమనిష్టలు, సేవావ్రతము ఈ ప్రవాహమునందు తృణప్రాయములుగ కొట్టుకొనిపోగలవని యాతనికి భయముకలిగెను.

రా. స్వా—ఇక్కడ ఒక అనాథాలయము స్థాపింపబడియున్నదని నీవెరుగుదువా ?

కమ—ఔను. దానినిగురించి కొంచెము వినియుంటిని.

రా. స్వా—ఈ అనాథాలయమునందు చాలవరకు వేశ్యలు మాకు వప్పజెప్పిన బాలికలే యుందురు. అక్కడ నిప్పుడు రమారమి యాబదిమంది కన్యకలుగలరు.

కమ—ఇదియంతయు మీ యుపదేశముయొక్క ఫలమే.

రా. స్వా—కాదదికాదు. దీని శ్రేయమునకు ముఖ్యులు వకీలు కృష్ణశర్మగారే. నేను కేవలమా యన సేవకుడను. ఈ అనాథాలయమున కిప్పుడొక పవిత్ర వంతురాలైన యువతి ఆవశ్యకమైయున్నది నీవే దానికి తగినదానవు. నేను చాల వెతకితిని కాని ఈ పనిని సేవా ప్రేమ భావములతో నెరవేర్చుచు, బాలికలను కన్న తల్లివలె సంరక్షించి, తన ప్రేమవలన ఇంతమంది బాలికలయొక్క మాతృ స్థాన

మును పూర్తి చేయగల యువతి నాకెక్కడను కనబడలేదు. వారికి వ్యాధులు వచ్చిన సంరక్షణ చేయవలెను. వారి మల మూత్రములకు చిదుము చీడలకు అసహ్య పడకూడదు. తన నడవడివలన వారి యందు పవిత్ర భావముల నుదయింపజేసి, వారి జీవితములు సుఖ ప్రదములగునట్లు జేయవలెను. ప్రేమ లేనియెడల నీ యుద్దేశములు పూర్తి కాజాలవు. ఈశ్వరుడు నీకు జ్ఞాన వివేకములను దయచేసినాడు. నీ హృదయమునందు, దయా శాంతి ధర్మము లున్నవి. కనుక నీవే ఈ కర్తవ్య భారమును వహింపగలవు. నా ప్రార్థన నంగీకరింపవా?

కమల కండ్లు అశ్రు పూరితములయ్యెను. తన విషయమై, ఒక జ్ఞాన వంతుడైన మహాత్మునకిట్టి మంచి యుద్దేశము కలదని తెలిసి కొని ఆమె హృదయము ఆనంద పరవశమయ్యెను. తానింత విశ్వాస పాత్రురాలగుదు ననియు, నిటువంటి మహాసేవ జేయు గౌరవము తనకు ప్రాప్తించుననియు, ఆమె స్వప్నము నందైనను దలచ లేదు. దైవమే రామానందస్వామి నిట్లు ప్రేరేపించెనని యామె భావించెను. ఇంతకు పూర్వమామె, పిల్లలు మట్టిలోదొర్లి ఒడలు కుళ్ళుచేసికొనిన, అస హ్యించుకొను చుండెడిది. కాని రామానంద స్వామి ఆమెపై విశ్వా సముజూపి, ఆమె అసహ్యమును జయించెను. ఆమెయందు ప్రేమ భావ ముదయమయ్యెను. మనము మన యందు విశ్వాస ముంచువారిని నిరాశ పరచుట కిష్టపడక, అసాధ్యమని తలచిన ఇటువంటి మహా భారములనుకూడ వహించుటకు సిద్ధపడుదుము. విశ్వాసము వలననే విశ్వాసము వృద్ధి పొందును. కమల అత్యంత వినయ భావముతో "మీరు నన్నింత యోగ్యురాలినిగ భావించుట మహాభాగ్యము. ఒకరి సేవజేయ గలుగుటయే, ఒకరియవసరములను దీర్చగలుగుటయే, నా పరమ ధర్మమని నేనిప్పుడు భావించుచున్నాను. మీరు సెలవిచ్చిన ఆధర్మములను నేను జేరజాలక పోవుదునేమో కాని నాశక్తి వంచన

లేక మీయాజ్ఞను పరిపాలించెదను." ఇట్లు చెప్పుచు కమల నిస్తబ్ధురాలయ్యెను. ఆమె తలను వంచుకొనెను. కండ్లవెంట జొట జొట నీరు కారజొచ్చెను. ఆమె నోటినుండి చెప్పజాలని మాటలామె ముఖ భావములవలన ప్రకటితములగు చుండెను.

"మీరు నాపై నింత విశ్వాసముంచుట మీ యనుగ్రహమే, నావంటి నీచురాలెక్కడ? ఇటువంటి మహాపదవి యెక్కడ? కాని భగవంతుడు దయదలచిన, మీ విశ్వాసమునకు పశ్చాత్తాప పడవలసిన అవసరముండదు." అని చెప్పునట్లుండెను.

రా-స్వా—నాకు నీయందిట్టి యాశయున్నది. దైవము నీకు శుభమును చేకూర్చుగాక.

ఇట్లు చెప్పుచు రామానందస్వామి లేచి నిలువబడెను. అప్పుడే అరుణోదయ మగుచుండెను. పక్షుల కలకల రావములు మనోహరముగ వినబడుచుండెను. అతడు కమండలమును దీసికొని నదిలో స్నానము చేయుటకు వెడలిపోయెను.

మనము నిద్రనుండి మేల్కాంచి జూచునట్లు కమల కుటీరము బయటికి వచ్చిజూచెను. సమయమెంత సుఖప్రదముగను, ఎంత శాంతిమయముగను, ఎంత ఉత్సాహ పూర్ణముగను నున్నది? ఆమెభవిష్యత్తు కూడ నిట్లే యుండునా! ఆమె భవిష్యత్ జీవితముయొక్క ప్రభాతము కూడనగునా? దానియందు కూడ నిటువంటి యుషఃకాంతులు ప్రకాశించునా? ఆ జీవితము నందెన్నడైనను సూర్యుడు ప్రకాశించునా? ఆఁ ప్రకాశించును. ఈ సుఖప్రదమైన, శాంతిమయమైన ప్రభాతము ఆ రాబోవు దిన రూపమైన జీవితముయొక్క ప్రభాతమే.

ఒక సంవత్సరము గడచెను. మోహానుడింటికి వచ్చినతోడనే తానొక్కదినమైన నక్కడ నాగక తీర్థయాత్రకు బయలుదేరవలెనని మొదట గోపాలశాస్త్రి స్థిరపరచుకొనెను. కాని మోహాను డింటికి వచ్చిన తరువాత మరచిపోయెనను ఆతడు తీర్థయాత్రల ఉబుసెత్తుట మానివేసెను. ఆతడెల్లప్పుడును మనుమని వడిలో కూర్చుండబెట్టుకొని రైతులతో మాటలాడుచు, వ్యవహారములను జూచుకొనుచుండెను. ఇట్లాతడు తిరిగి సంసారమోహములో మునిగిపోయెను. జానికమ్మ ఇప్పుడే తాపత్రయమును లేక నిశ్చింతగా నుండెను. సంసారభారమంతయు సుశీల వహించి జరపుచుండెను. జానికమ్మ మనుమని చంకబెట్టుకొని ఇరుగు పొరుగిండ్లకు పోయి పెత్తనములు జేయుచు, సౌఖ్యముగ కాలమును గడుపుచుండెను.

కృష్ణశర్మ వకీలువృత్తిని మానివేసెను. పురపాలకసంఘమునకిప్పుడు ఆయనయే అధ్యక్షుడు. ఈ పనియందాయనకు మిక్కిలి అభిరుచికలదు. ఆతడు చాలకష్టపడి పట్టణమును అభివృద్ధిలోనికి దెచ్చుచుండెను. ఒక సంవత్సరములో నెన్నియో క్రొత్తరోడ్లను వేయించెను. పట్టణమధ్య స్థలములందు రెండుమూడు అందమైన పార్కులను గట్టించెను. కుళ్ళునీళ్ళుపోవు కాలువలనన్నిటిని బాగుగ మరమ్మత్తుచేయించెను. మార్గస్థులకొక ధర్మశాలను కట్టించవలెనని ఇప్పుడు ప్రయత్నించుచుండెను. శర్మకిప్పుడు పూర్వపుమిత్రులు శత్రువులైరి. పూర్వపు శత్రువులు మిత్రులైరి. కాని నారాయణదాసు యందు మాత్రమాతనికి శ్రద్ధాభక్తులు దినదినాభివృద్ధి నొందుచుండెను. దాసునకు పురపాలకసంఘము నందొక ఉద్యోగమిప్పించవలెనని ఆతనికి చాలకోరికగా

నుండెను. కాని దానందుల కొప్పుకొనలేదు. స్వార్థరహితముగ సేవ చేయవలెనని తాను చేసికొనిన ప్రతిజ్ఞకు తప్పిపోవుట కాతడిష్టపడకుం డెను. విడిగా నున్నప్పుడు చేయగలిగినంత సేవ ఉద్యోగములోనుండి చేయజాలమని ఆతనియుద్దేశ్యము. ఆతడు నిర్వహించుచున్న వితంతు శరణాలయ మిప్పుడు చాలవృద్ధిలో నున్నది. పురపాలకసంఘమువారు దానికి చాలసహాయమును జేయుచుండిరి. వ్యవసాయదారుల సహా యార్థమాత డొక సహకారసంఘమును స్థాపించుటకు ప్రయత్నించు చుండెను. విత్తనములను, సొమ్మును నామమాత్రపు వడ్డీతో బదు లిచ్చిన, వారు వృద్ధిపొంది, తద్వారా దేశము బాగుపడగలదని యాతని ఉద్దేశ్యము. ఈ కార్యమునందు నారాయణదాసునకు మోహనరావు కుడిభుజమువలె నుండెను.

మోహనరావునకు విష్ణువర్ధనములో నుండుట చాలచీదరగా నుం డెను. ఆతడు సుశీలను కొమారుని తల్లిదండ్రుల వద్దనుంచి తాను కళ్యాణపురములో గోదావరియొడ్డున ఉన్న ఇంటియందుండి పడవల వ్యాపారమును వృద్ధిపొందించు చుండెను. ఆతడు తరచుగ వారమున కొకసారియైనను విష్ణువర్ధన గ్రామమునకు వెళ్ళుచుండును. ఇప్పుడాతనికీ వ్యాపారమునందు నెలకు వందలకొలది లాభము వచ్చుచుండెను. ఆత డిప్పుడొక స్టీమరునుకూడ కొనవలెనని ఆలోచించు చుండెను.

రామానందస్వామి ఇప్పుడు తరుచుగా గ్రామములయందే నివ శించుచుండెను. నిరుపేదలగు కన్యలను రక్షించుటయందే యాతడు తనజీవితము నంతను అర్పించివేసెను. పట్టణమునకు వచ్చినను ఆత డక్కడ రెండుమూడు దినములకన్నను ఎక్కువ యుండుటలేదు.

అది కార్తీకమాసమగుట వలన కృష్ణశర్మయు, సుభద్రమ్మయు గోదావరిస్నానమునకు వెళ్లిరి. వారు తిరిగివచ్చు నప్పుడు కృష్ణాపు రము వైపుబండిని తోలించిరి. సుభద్రమ్మ కిటికీలోనుండి తొంగి

చూచుచు నీనిశ్శబ్దమైన స్థలము నందీ వేశ్య లెట్లు నివసించుచున్నారో యనియు, వీరికెట్లుబుసుపోవుచున్నదో యనియు యోచించుచుండెను.
ఇంతలో ఆమెకొక అందమైన భవనము కనబడెను. దాని ముఖ ద్వారమునందు పెద్ద పెద్ద అక్షరములతో నిట్లు వ్రాయబడియుండెను.

# సేవాశ్రమం

"ఇదియే నా కమలాబాయి సేవాశ్రమము?" అని సుభద్రమ్మ కృష్ణశర్మ నడిగెను. శర్మయు పేక్షతో ఆఁ అని జవాబుచెప్పెను. ఈ వైపెందుకు వచ్చితిమా యని యాతఁడు పశ్చాత్తాపపడుచు తనలో, ఈమె ఆశ్రమమును చూడకమానదు. నన్నుకూడ తనతో రమ్మని బలవంతము పెట్టు. ఇప్పుడు చాల చిక్కువచ్చినదే'' యని అనుకొను చుండెను. శర్మ ఇంతవర కొక్కసారియైనను ఆశ్రమమునకు వెళ్లియుం డలేదు. రామానందస్వామి ఆతని నక్కడకు తీసుకొని వెళ్ళవలెనని ఎన్నియోసార్లు ప్రయత్నించెను. కాని శర్మ ఎప్పటికప్పుడు ఏదోయొక వంకజెప్పి తప్పించుకొనుచుండెను. ఆతడు ఏపనినైనను జేయగలుగు చుండెనుగాని కమలయెదుట మాత్రము పడజాలకుండెను. ఆమె పార్కు నందు హారము నిచ్చుచు ఆడిన మాటలాయన కెన్నటికిని మరపునకు రాకుండెను. ఇంత సాధ్వీమతల్లియుఁ సచ్చరిత్రురాలును అగు స్త్రీ కేవలము లోకులేమను కొందురో యను తన పిరికితనమువలన పతితు రాలైనదనియు, ఆమె ఈ నరకకూపములో పడుటకు తానే కారకు డననియు, ఆతడెప్పుడును విచారించు చుండెను.

సుభ—ఒక్కసారి బండి నాపించండి. నాకాశ్రమమును జూడవలెననియున్నది.

కృష్ణ—ఇప్పుడు చాల ప్రొద్దెక్కినది. కనుక మరియొకసారివచ్చి చూడవచ్చును.

సుభ—ఇప్పటికిది స్థాపించి సంవత్సరమైనది. ఇంతవరకు ఒక్కసారియైననువచ్చి చూడలేకపోతిమి. ఇప్పుడు కాకపోయిన తిరిగి మనకెన్నిరోజులకు తీరుబడియగునో?

కృష్ణ—మరియొకసారి నువ్వు ఒక్కరితెవు వచ్చి చూడరాదా? నిన్నడ్డుపెట్టువారెవ్వరు? ఇదివరకు నువ్వే రాలేదు.

సుభ—బాగానే ఉన్నది. సరే ఇదివరకు రాలేకపోయాము కనుక రాలేదు. ఇప్పుడేలాగో వచ్చినాము కనుక ఎందుకు వెళ్ళకూడదు?

కృష్ణ—వెళ్ళుటకు నాకేమియు అభ్యంతరములేదు. కాని ప్రొద్దెక్కిపోవుననియే నా భయము. ఇప్పటికే తొమ్మిదిగంటలవేళ దాటిపోయినది.

సుభ—ఇక్కడెందుకు ఆలస్యమగును? పదినిముషలలో చూచి వచ్చివేయుదము.

కృష్ణ—నీకు పట్టుబట్టుట చాల పాడలవాటు. నాకాలస్యమయిపోవునని ఎంతచెప్పినను వినవు.

సుభ—ఫరవాలేదు. త్వరగా కారుమీద యింటికివెళ్లి పోవచ్చును.

కృష్ణ—ఐతేసరే. నువ్వు వెళ్ళు. సాయంత్రములోగా నీ యిష్టము వచ్చినప్పుడు రావచ్చును. నేను త్రోవలో అద్దెబండిని చేయించుకొని వెళ్లిపోయెదను.

సుభ—అద్దెబండి చేయించుకొని వెళ్లడమెందుకు? మీకు లోపలకు వచ్చుటకు ఇష్టము లేకపోయిన కారులోనే కూర్చొనుడు. నేను

నిముషములో ఆశ్రమమును జూచి వచ్చివేయుదును.

కృష్ణ—(కారుదిగి) నేను వెళ్ళిపోవుచున్నాను. నీ ఇష్టమువచ్చి నప్పుడురా.

ఈ విధముగ కృష్ణశర్మ వంకలుజెప్పి తప్పించుకొనుటకు కారణమును సుభద్రమ్మ గ్రహించెను. ఆమె పత్రికలయందు సేవాశ్రమమును గురించిన ప్రశంసలను ఎన్నియోసార్లు చదివియుండెను. ప్రభాకరరావునకు సేవాశ్రమము నందిప్పుడు పరిపూర్ణానురాగము కలిగినది. సుభద్రమ్మ ఆశ్రమప్రఖ్యాతిని పత్రికలలో చదువుచుండుట వలనను, పైగా వినుచుండుట వలనను, ఆమెకు దానియందు ప్రేమయు కమలయందు గౌరవమును కలిగెను. ఈ యవస్థయందు కమలను జూచుటకామె మిక్కిలి కుతూహలపడుచుండెను. కమల పతితురాలై నప్పటికిని తిరిగి జ్ఞానవంతురాలయి, మానవసేవ జేయుచు, పత్రికలచే కొనియాడబడుచు, ఉండుటవిని యామెకు మిక్కిలి యాశ్చర్యము కలుగుచుండెను. తనభర్తను బాగుగ ముదలకింపవలెనని సుభద్రమ్మకు బుద్ధి పుట్టెను గాని, మోటారు తోలువాడు దగ్గర నిలువబడి యుండుటవలన ఏమియు అనలేక పోయెను.

ఆమె కారుదిగి ఆశ్రమద్వారములోనికి వెళ్ళునరికి ఒకస్త్రీలోపలకు వెళ్లి, ఆమె వచ్చుచున్నట్లు కమలతో జెప్పెను. వెంటనే కమల ఆమెను ఎదురుకొనుటకు వచ్చెను. నగలేమియులేక, తెల్లనిబట్టను కట్టుకొని యోగినివలె నున్న కమలనుజూచి సుభద్రమ్మ చాల ఆశ్చర్యపడెను. ఆమెయందు మునుపటి కోమలత్వములేదు. చపలత్వము లేదు. ముఖమునందా చిరునవ్వులేదు. రూపలావణ్యములకు బదులు పవిత్రత యామె ముఖమునందు వెలుగుచుండెను. కమల సుభద్రమ్మకు నమస్కరించి కన్నీళ్ళు కార్చుచు, "మీరిక్కడకు దయచేయుట మాసౌభాగ్యము" అని మెల్లగా ననెను. సుభద్రమ్మ కండ్లుకూడ నీళ్ళతో

నిండిపోయెను. ఆమె కమలను కౌగలించుకొని గద్గదస్వరముతో "సో దరీ! నే నెన్ని రోజులనుండియో ఇక్కడకు రావలెనని అభిలాష పడు చుంటిని. కాని తీరుబడిలేకను, అశ్రద్ధవలనను, ఇంతవరకు ఆలస్యమై నది." అని అనెను.

కమ—కృష్ణశర్మగారు కూడ వచ్చిరా? లేక మీరొక్కరే వచ్చి తిరా?

సుభ—ఆయన నాతో కూడనే వచ్చిరి. కాని ఆలస్యమగుటవలన మరియొక బండిమీద నింటికి వెళ్ళిపోయిరి.

కమ—(విచారముతో) ఆలస్యమేమిటి? ఇక్కడకు వచ్చుటకా యన కిష్టములేదు కాబోలు? ఇదియంతయు నాదురదృష్టము. ఆయ నయే ఈ యాశ్రమస్థాపకులై యుండియు, నా వలన ఆయన కాశ్రమ ముపై నింత అసహ్యము కలుగుట నాకు చాలదుఃఖముగా నున్నది. మీ రిద్దరుకలసి, ఇక్కడకు వచ్చుటయే నా ముఖ్యాభిలాషగా నుం డెను. ఈ రోజున ఆ యభిలాష సగముపూర్తియైనది. మిగిలినదికూడ నెప్పుడో యొకప్పుడు పూర్తికావచ్చును. అదియే నా ఉద్ధారణదినము కాగలదు.

తరువాత కమల సుభద్రమ్మకు ఆశ్రమమును జూపుట ప్రారంభిం చెను. ఆ భవనమునందు ఐదుపెద్దగదులు కలవు. మొదటిగదియందు సుమారు ముప్పదిమంది బాలికలు, పాఠములను చదువుకొనుచుండిరి. వారివయస్సు పండ్రెండునుండి పదియేను సంవత్సరముల వరకు నుండెను. సుభద్రమ్మను జూచిన తోడనే ఉపాధ్యాయురాలు లేచి, ఆమెకు నమ స్కరించెను. అప్పుడు కమల వారిద్దరకు పరిచయమును కలిగించెను. ఆ యువతి బారిష్టర్ సివరామ్‌గారి సతీమణి యని తెలియగనె సుభద్ర మ్మకు చాల, ఆశ్చర్యముకలిగెను. బారిష్టరుగారి భార్య ప్రతిదినమును రెండుగంటలు ఆశ్రమములోని బాలికలకు చదువు చెప్పుచుండును.

రెండవతరగతి యందుకూడ నంతమంది బాలికలే యుండిరి. వారి వయస్సు ఎనిమిదినుండి పంద్రెండువర కుండెను. వారిలో కొందరు బట్టలు కత్తిరించుటను నేర్చుకొనుచుండిరి. కొందరు కుట్టుచుండిరి. మరి కొందరు అల్లికపనులను, చమ్కీపనులను జేయుచుండిరి. నిక్కడ నుపాధ్యాయురాలు లేదు. ఒకముసలిదర్జీవారికి కుట్టుపనిని నేర్పుచుండెను. కమల సుభద్రమ్మకు ఆ పిల్లలు తయారుచేసిన చొక్కాలను, జాకెట్లను, లేసులను, రకరకముల చమ్కీలను జూపించెను. మూడవ తరగతియందు ఇరువదిమంది బాలికలు ఉండిరి. వారిలో కొందరు ఐదుసంవత్సరములకు లోపువారుకూడ నుండిరి. వారిలో కొందరు బొమ్మలతో నాడుకొనుచుండిరి. కొందరు బొమ్మల పుస్తకములను జూచుకొనుచుండిరి. ఈ భాగమునకు కమలయే ఉపాధ్యాయురాలు.

అక్కడనుండి వారు తోటలోనికి వెళ్ళి పిల్లలు వేసిన పూల మొక్కలను తదితర మొక్కలను జూచుచుండిరి. కొంతమంది బాలికలు వంగమళ్ళకు కూర పాదులకును నీళ్ళు పోయుచుండిరి. వీరిని జూచి ఆ బాలికలు సొగసుగా నొక గులాబీ గుత్తిని కట్టి సుభద్రమ్మకు బహుమతిగా నిచ్చిరి.

భోజనశాలయందు కొందరు బాలికలు భోజనములను చేయు చుండిరి. వారు తయారుచేసిన వంటకములను సుభద్రమ్మకు జూపెను. సుభద్రమ్మ కిక్కడ ఏర్పాటులను, శాంతి మయ జీవనమును, కన్యకల యొక్క శీల స్వభావమును జూచిన మిక్కిలి యానందము కలిగెను. ఆమె తనలో "కమల ఇంత పెద్ద ఆశ్రమము యొక్క భారమును వహించి నడపుచుండుట జూడ ఆశ్చర్యము కలుగుచున్నది. నావంటి దాని కిది యసంభవము ఒక బాలికయైనను అపరిశుభ్రముగ గాని, విచారముగ గాని కనబడుటలేదు." అని యనుకొను చుండెను.

కమ—నేనీ భారమేమో నాపైని బెట్టుకొంటిని గాని దీనిని నిర్వ

హించు శక్తి నాయందులేదు. మహనీయులిచ్చు సలహాలే నాకాధార ములు. మీకీ ఆశ్రమము నందేమైన లోపములు కనుబడిన వానిని, దయచేసి చెప్పగోరు చున్నాను. దాని వలన నాకెంతో యుపకార మగును.

సుభ—(నవ్వుచు) సోదరీ! నన్ను సిగ్గు పరచకు. నేనీ యేర్పాటులను జూచి చాల నాశ్చర్యపడు చున్నాను. నేను నీకేమిసలహా నియ్య గలను? వినంతు శరణాలయము నందలి యేర్పాటులకంటె నిక్కడి ఏర్పాటులు చాల బాగున్నవని మాత్రము చెప్పగలను.

కమ—మీరు చెప్పుటకు సంకోచించు చున్నట్లున్నది?

సుభ—లేదు. నిజముగానే జెప్పుచున్నాను. నేను వినిన దానికంటె నీ యాశ్రమ మెన్నియోరెట్లు వృద్ధిలో నున్నది. కాని ఒక్క సంగతి. ఈ బాలికల తల్లులు వీరిని జూచుటకు, ఎప్పుడైన నిక్కడకు వచ్చుచుందురా?

కమ—వచ్చుచుందురు కాని సాధ్యమైనంతవరకు వారి కలయిక నడ్డుపెట్టుచుందును.

సుభ—సరే వీరికి వివాహము లెట్లగును?

కమ—అది చాలకష్టము. ఈ బాలికలను సచ్చరిత్రు రాండ్రుగను మంచి గృహిణు లగుటకు యోగ్యులుగను, స్వతంత్రముగ జీవించుట కర్హురాండ్రుగను జేయుట మన కర్తవ్యముకాని వీరిని సంఘ మాద రించునో యాదరింపదో ఆ సంగతిని మాత్రము చెప్పజాలను.

సుభ—బారిష్టరు గారి భార్యకీ పనియందు చాల యభిలాష కాబోలు?

కమ—ఆశ్రమాభి వృద్ధికి ముఖ్యులలో నామె యొకతె యని చెప్పవచ్చు. సాధారణముగ నేనామె సలహాల ననుసరించియే పని చేయుచుందును.

సుభ—నా కేమియు చేతకాదు. లేనియెడల నేను కూడ నేదో విధముగ నీయాశ్రమమునకు సాయము జేసియుందును.

కమ—అనగా అనగా ఇన్ని రోజులకు తమ రిక్కడకు వచ్చినారు. అదియైనను శర్మగారి యనుమ్మతిపైననే. ఆయన ఇక్కడకు వచ్చు వరకు నే నొప్పుకొనను.

సుభ—లేదులేదు. ఈ యాదివారమునాడు, ఆయనను బలవంతముగానైనను నిచ్చటకు తీసికొని వచ్చెదను. సరే నేనుకూడ ప్రతి దినము నిక్కడకు వచ్చి బాలికలకు వంటవండుట, అందముగా పూల దండలు కట్టుట, జాజి బద్దలతో బుట్టలల్లుట మొదలైన పనులను నేర్పెదను.

కమ—(నవ్వుచు) ఈ పనులయందు మీరెంతమంది బాలికలను మీకంటె నిపుణురాండ్రుగ జేయగలరో ఇంతలో మంచి దుస్తులను ధరించిన పదిమంది బాలికలు సుభద్రమ్మ కెదురుగ నిలువబడి, చేతులు జోడించి మధుర స్వరముతో నిట్లు పాడిరి.

పరమేశ్వరా! పరమపురుష! భక్తవత్సల!
కరుణజూపి! మమ్ముకృపను! గావు మీశ్వరా॥పర॥
మాదు పాపములను బాపి! మమ్ముగావుమా!
నీదు సుతుల ప్రేమజూపి చేరదీయుమా ॥పర॥
శాంతిభక్తితోడ మమ్ము వర్థిలం జేయుమా
సేవయందు మాకు ప్రీతి వృద్ధిజేయుమా ॥పర॥

సుభద్రమ్మ ఆపాటను విని మిక్కిలి ఆనందించి బాలికల కైదురూపాయలను బహుమతిగా నిచ్చెను. ఆమె ఇంటికి వెళ్ళిపోవుదునని చెప్పగా కమల దీన స్వరముతో నేనీ యాదివారమున మీకొర కెదురుచూచు చుందును.

సుభ—మేము తప్పక ఈ ఆదివారము వచ్చెదము.

కమ—సుశీలా పిల్లవాడు క్షేమముగా నున్నారా!

సుభ—ఈ రోజుననే ఉత్తరము వచ్చినది. అందరు క్షేమముగాను న్నారు. మోహనరా విక్కడకొక సారియైనను రాలేదా?

కమ—లేదు. కాని నెలకు రెండు రూపాయిల చందాను మాత్రము పంపుచున్నారు.

సుభ—కమలా! నీ వుండుము. చాల వేళయైనది. నేను వెళ్ళి వచ్చెదను.

కమ—మీరు దయచేయుటవలన నేను కృతార్థురాల నైతిని.

సుభ—ఆశ్రమ సందర్శనమువలన నేను పవిత్రురాలనైతిని. నీ ప్రేమ, భక్తి, కార్యకుశలత ఎంత వినుతించినను చాలదు. నిజముగ నీవు స్త్రీ సమాజమునకు అలంకారమువంటి దానవు.

కమ—(కన్నీటితో) నన్ను నేను మీ పూర్వపు దాసినిగానే భావించుకొను చున్నాను. నేను జీవించి యున్నంతకాలము మీ శ్రేయము నె కోరుచుందును. మునిగి పోవుచున్న నన్ను మీరె రక్షించిరి. దైవమెల్లప్పుడును మీకు కళ్యాణ మొనగూర్చుగాక యని ప్రార్థించుచుందును.

సంపూర్ణము